# ప్రపంచ చరిత్ర

## (మూడవ భాగము)


రచన:

జవహర్‌లాల్ నెహ్రూ


అనువాదం:

చింతా దీక్షితులు


సంస్కృతి ప్రచురణ

(33)

వెల రెండు రూపాయలు

# విషయసూచిక

# చిత్రాలు



# ర చ యి త

జననం 1889. కాశ్మీర బ్రాహ్మణులు. తండ్రి మోతీలాల్ నెహ్రూ. ప్రఖ్యాత న్యాయవాది. తల్లి స్వరూపరాణి. జన్మస్థానం ప్రయాగ - అలహాబాద్. ఇంటివద్ద కొంతకాలం ప్రైవేటు చదువుకొని హారోలో, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలోని ట్రినిటీ కళాశాలలో విద్య నభ్యసించారు. అలహాబాద్ హైకోర్టులో న్యాయవాదిగా జీవితాన్ని ప్రారంభించారు. 1918లో ఇండియన్ హోమ్‌రూల్ లీగుకు కార్యదర్శి అయినారు. 1918 నుంచి అఖిలభారత కాంగ్రెస్ సభలో సభ్యుడుగానున్నారు. 1921 లో మొదటిసారి కారాగృహ వాసా న్ననుభవించారు. ఇప్పటికి ఎనిమిది మారులు శ్రీకృష్ణజన్మస్థానాన్ని చూచివచ్చారు. 1929 లో కాంగ్రెస్ కార్యదర్శి అయినారు. 1930 లోను, 1936, 37, 46 లలోనూ కాంగ్రెస్ అధ్యక్షులయినారు. వివాహితులు. భార్య-కమలా నెహ్రూ చనిపోయింది. కొడుకులు లేరు. ఒక్కతే కుమార్తె-ఇందిరా గాంధీ. చెల్లెండ్రిద్దరు-విజయలక్ష్మి పండిట్, కృష్ణ హాఠీసింగ్.

ఈయన గొప్ప ప్రజాస్వామ్యవాది. ఆంగ్లంలో అనేక గ్రంథాలను రచించారు. వీరి రచనలలో 'సోవియట్ రష్యా' 'ప్రపంచ పరిణామము'లను మాప్రచురణలలో ప్రచురించియున్నాము. నేడు (1950) ఇండియా ప్రధానిగా నున్నారు.

విలాసము : 17, యార్క్ రోడ్డు, న్యూ ఢిల్లీ

# 63

# క్రైస్తవమత
# యుద్ధకాలమున యూరోపు

జూన్ 20, 1932.

క్రైస్తవమునకును, ఇస్లాముకును 11. 12. 13 శతాబ్దములలో జరిగిన సంఘర్షణనుగురించి కొంత వెనుకటి జాబులో తెలిసికొంటిమి. యూరోపులో క్రైస్తవ లోకభావము వృద్ధినందజొచ్చెను. క్రైస్తవ మిప్పటికి యూరోపునందంతటా వ్యాపించెను. క్రైస్తవమతములోనికి చిట్టచివర వచ్చిచేరినవారు తూర్పుయూరోపు స్లావ్ జాతులు—రష్యనులును, ఇతరులును. దీనిని గురించి ఒక చక్కని కథ గలదు. ఇది ఎంతవరకు నిజమో తెలియదు. వెనుకటి రష్యనులు క్రైస్తవమును స్వీకరించుటకు ముందు, తమమతమును మార్చుకొనుటయును క్రొత్త మతమును స్వీకరించుటయును భావ్యమా యని తర్కించుకొనిరి. వారు విన్న క్రొత్తమతములు రెండు—క్రైస్తవము, ఇస్లాము. కాన నేటి కాలములో చేయువిధముగా వారొక రాయబారమును ఆయామతములు ఆచరణలోనున్న దేశములకు పంపిరి. ఆమతములను పరిశీలించి, పరీక్షించి తమనిర్ణయమును రాయబారులు రష్యనుప్రజలకు తెలుపవలెను. ఈ రాయబారులు పశ్చిమ ఆసియాలోని కొన్ని ప్రాంతములకు, ఇస్లాంను పరిశీలించుటకు వెళ్ళిరి. పిమ్మట వారు కాంస్టాంటినోపులు వెళ్ళిరి. ఆర్తొడాక్సు చర్చియొక్క పూజాపురస్కారములు, కర్మకలాపము, సంగీతముతో, చక్కనిపాటలతో కన్నులపండువుగ, వైభవముగ నుండెను. పురోహితులు దివ్యమగువస్త్రములు ధరించివచ్చిరి. ధూపములు

వేసిరి. ఉత్తరమునుండివచ్చిన అమాయకులును, పూర్తిగా నాగరికులు కానివారును అయిన రాయబారులీ కర్మకాండము చూచి ఎంతో మెచ్చుకొనిరి. ఇస్లాముతో ఇట్టి వైభవమేమియులేదు. కాన వారు క్రైస్తవమే బాగున్నదని భావించి ఇంటికి తిరిగివచ్చిరి. తాముచూచిన విషయములు రాజుకు నివేదించిరి. అటుపిమ్మట రాజును ప్రజలును క్రైస్తవమతమును స్వీకరించిరి. వారు క్రైస్తవమును కాంస్టాంటినోపులునుండి గ్రహించిరి గనుక, ఆర్థొడాక్సు గ్రీకుచర్చినే అనుసరించిరికాని రోముననుసరించలేదు. తరువాతకాలమునందైనను రష్యా యెన్నడును రోములోని పోపును అంగీకరించలేదు.

రష్యా మతాంతరప్రవేశము క్రైస్తవమత దండయాత్రలకు పూర్వమే జరిగెను. బల్గేరియనులుకూడ ఒకకాలమున మహమ్మదీయులు కావడానికి అర్థాంగీకారము చూపిరట. కాని కాంస్టాంటినోపులు అక్కడ బలీయముగా ఉండెను. వారి రాజొక బైజాంటైను రాజకుమార్తెను వివాహమాడి క్రైస్తవుడాయెను. బైజాంటియమ్ కాంస్టాంటినోపులు పాతపేరని నీకు జ్ఞాపకమున్నదా? ఈవిధముగానే పొరుగుననున్న జాతులుకూడ క్రైస్తవము నవలంబించెను.

ఈ మతయుద్ధములు జరుగుకాలమున యూరోపులో యేమి జరుగుచుండెను? కొందరు రాజులును చక్రవర్తులును పాలస్తీనాకు ప్రయాణమై వెళ్ళిరనియు, అందు పలువురు అచ్చటి కష్టములపాలైరనియు తెలిసికొనియుంటిమి. ఈకాలమున పోపు రోములో కూర్చుండి నమ్మకములేని తురుష్కునిపై పవిత్రయుద్ధము సాగించమని ఉత్తరువులూ, హెచ్చరికలూ చేయుచుండెను. బహుశా ఈకాలమునందే పోపులప్రాబల్యము మిన్నుముట్టుచుండెను. కనోస్సావద్ద అభిమానియగు చక్రవర్తి యొకడు పాదరక్షలులేకుండ మంచులోనడచి క్షమాపణ వేడుకొనుటకు పోపు దర్శనమునకై నిరీక్షించెనని యిదివరలో చెప్పియుంటిని. ఇతడు

పోపు గ్రిగోరీ VII. ఇతని వెనుకటిపేరు హిల్డిబ్రాండు. ఇతడు పోపుల నెన్నుకొనుటకొక క్రొత్తపద్ధతిని ప్రవేశపెట్టెను. రోమన్ కేతలిక్కు ప్రపంచములో కార్డినలులు, మతాచార్యులలో వున్నతపదవియందున్న వారు. కార్డినలుల కళాశాల యొకటి సృష్టింపబడినది. దానికి పవిత్ర కళాశాల(Holy College) అనిపేరు. ఈకళాశాలయే క్రొత్తపోపును ఎన్నుకొనును. క్రీ. వె. 1059 సంవత్సరమున ఈపద్ధతి ప్రవేశపెట్టబడినది. నేటివరకూ బహుళా కొన్నిమార్పులతో అది జరుగుచునే యున్నది. నేడుకూడ, పోపు మరణించినప్పుడు కార్డినలుల కళాశాల వెంటనే సమావేశమగును. వారు తాళమువేసిన ఒకగదిలో కూర్చుందురు. ఎన్నిక పూర్తియగువరకూ ఎవరూ లోపలినుండి బయటకుగాని, బయట నుండి లోపలికిగాని పోరాదు. తరుచు వారెన్నో గంటలాగదిలో, ఎట్టి నిర్ణయమునకురాలేక కూర్చుండేవారు. కాని వారు బయటికిరారాదు కాన చివరకు వారు ఒక అంగీకారమునకు వత్తురు. ఎన్నిక అయిన తోడనే తెల్లపొగ పైకిపంపుదురు. దీనినిచూచి బయటనున్న ప్రజలు సమావేశము పూర్తియైనదని తెలిసికొందురు.

ఎన్నికలవల్లనే పోపును ఏర్పాటుచేయుదురు. ఇట్లే పవిత్రరోమక సామ్రాజ్యచక్రవర్తినికూడ యెన్నుకొనుటకు ప్రారంభించిరి. కాని అతనిని ఎన్నుకొనువారు ప్రబలులగు ఫ్యూడల్ ప్రభువులు. వీరు ఏడుగురు. నియామక రాజకుమారులని (Elector Princes) వీరిని పిలిచేవారు. ఈ విధముగాచేసి ఎప్పుడును ఒకే కుటుంబమునుండి చక్రవర్తి రావీలు లేకుండ చేసిరి. క్రియకువచ్చినప్పుడు మాత్రము ఒకే కుటుంబమువారు తరుచు దీర్ఘకాలముపాటు ఈయెన్నికలపై యధికారము చెలాయించే వారు.

12, 13 శతాబ్దములలో హోహెన్‌స్టాఫెన్ రాజవంశము సామ్రాజ్యముపై అధికారము చెలాయించుచుండిరి. హోహెన్‌స్టాఫెన్

అనునది జర్మనీలో ఒక చిన్నపట్టణమో, గ్రామమో అని నానమ్మకము. అందుండివచ్చిన కుటుంబమున కాపేరువచ్చినది. 1152 సంవత్సరమున హోహెన్‌స్టాఫెన్ కుటుంబమునకుజెందిన ఫ్రెడరిక్కు I చక్రవర్తి అయ్యెను. సామాన్యముగా అతనిని ఫ్రెడరిక్కు బార్బరొస్సా అనెడి వారు. మతదండయాత్రలకు పోవుచు త్రోవలో నీటమునిగి చనిపోయిన వాడీతడే. సామ్రాజ్యచరిత్రలో ఇతని పరిపాలనము మిక్కిలి ప్రశస్త ముగా నుండెనని చెప్పుదురు. జర్మను ప్రజలదృష్టిలో అతడొకవీరుడు, ఒకమాదిరి పురాణపురుషుడు. అతనినిగూర్చిన కథలనేకములు గలవు. అతడు ఒక పెద్దపర్వతగుహలో నిద్రించుచుండెననియు, తరుణము రాగానే అతడులేచి తనప్రజలను రక్షించుటకు వచ్చుననియు చెప్పుదురు.

ఫ్రెడరిక్కు బార్బరోస్సా పోపుతో పెద్దవివాదము పెట్టుకొనెను. కాని చివరకు పోపుకే విజయముదక్కెను. ఫ్రెడరిక్కు అతనికి తల యొగ్గవలసివచ్చెను. అతడు నిరంకుశుడగురాజు. కాని అతనిఫ్యూడల్ సామంతులు అతనినెన్నో చిక్కులుపెట్టిరి. ఇటలీలో పెద్దనగరములు వృద్ధియగుచుండెను. ఫ్రెడరిక్కు వాటిస్వతంత్రత నణచుటకు ప్రయ త్నించెను. కాని అతడట్లు చేయలేకపోయెను. జర్మనీలోకూడ పెద్ద నగరములు వృద్ధినందుచుండెను. ముఖ్యముగా నదీతీరములందవి యుండెను; కొలోన్, హాంబర్గు, ఫ్రాంక్‌ఫోర్టు, ఇట్టివింకను అనేకము. వీటివిషయమున ఫ్రెడరిక్కు అభిప్రాయము వేరుగానుండెను. కులీనుల యొక్కయు, ఫ్యూడల్ ప్రభువులయొక్కయు ప్రాబల్యము నరికట్టవలె ననే వూహతో స్వతంత్ర జర్మను నగరముల కాతడు ప్రాపుగా నుండెను.

రాజత్వమునుగూర్చి ప్రాచీన హైందవుల యభిప్రాయము లెట్లుండెనో అనేక సందర్భములలో నీకు చెప్పియుంటిని. ప్రాచీన ఆర్యులకాలమునుండి అశోకునికాలమువరకును, అర్థశాస్త్రకాలమునుండి

శుక్రుని నీతిశాస్త్రకాలమువరకును తరుచుగా చెప్పబడ్డ విషయమేమనగా, రాజు ప్రజాభిప్రాయమునకు తలయొగ్గి యుండవలెనని. చివరకు యజమానులు ప్రజలే. ఇది హిందువుల సిద్ధాంతము. క్రియకువచ్చినప్పుడు ఇతరదేశములందువలెనే ఇండియాలోని రాజులుకూడ నిరంకుశులై యుండినను సిద్ధాంతము మాత్రమిదియే. ఈ యభిప్రాయమును ప్రాచీన యూరోపియనుల యభిప్రాయముతో పోల్చిచూడుము. ఆనాటి న్యాయవాదులమాటలనుబట్టిచూడ చక్రవర్తికి సర్వాధికారములును కలగతమై యుండెను. అతనియిచ్ఛయే శాసనము. వారుచెప్పినమాట, "లోకమున చక్రవర్తి సజీవశాసనము" అని. ఫ్రెడరిక్కు బార్బరోస్సా చెప్పిన దేమనగా "రాజుకు శాసనములందించేపని ప్రజలదికాదు. అతని ఆజ్ఞలను తలదాల్చుటయే వారిపని."

ఈ యభిప్రాయమును చీనావారి యభిప్రాయముతోకూడ పోల్చి చూడుము. చీనారాజును లేదా చక్రవర్తిని అచ్చటివారు స్వర్గపుత్రుడు మున్నగు పెద్దబిరుదములతో పేర్కొందురు. దీనినిబట్టి మనము భ్రమ చెందరాదు. సిద్ధాంతమునుబట్టిచూడ అతడు సర్వాధికారియగు యూరోపియను చక్రవర్తికి అన్నివిధముల భిన్నముగా నుండును. మెంగ్-చే అను ఒకప్రాచీన చీనాగ్రంథకర్త యిట్లు వ్రాసియున్నాడు—"దేశములో ప్రధానాంశము ప్రజలే. తరువాత భూమిని సస్యములను పోషించు ఉపకారులగు దేవతలువత్తురు. ప్రాధాన్యమున చివరకువచ్చువాడు పరిపాలకుడు."

యూరోపులోని చక్రవర్తి భూమిపై సర్వోత్కృష్టుడుగా భావింపబడుచుండెను. దీనినిబట్టియే రాజుల దైవదత్తాధికారము కలవారనే భావముదయించెను. క్రియలోమాత్రము వారు సర్వోత్కృష్టతకు చాలా దూరముగానుండిరి. వారి ఫ్యూడల్ సామంతులే వారిపై తిరుగబడు చుండిరి. క్రమక్రమముగా క్రొత్తతరగతిప్రజలు నగరములలో తలఎత్తు

చున్నట్లు మనము ముందు తెలిసికొందుము. వీరును కొంతయధికారము తమకు కావలెనని కోరుచుండిరి. ఇది యిట్లుండ భూమిపై సర్వోత్కృష్టతను పోపుకూడ ఆశించెను. ఇద్దరు సర్వోత్కృష్టులున్నచోట పేచీలు తప్పవుకదా!

ఫ్రెడరిక్కు బార్బరోస్సా మనుమని పేరుకూడ ఫ్రెడరిక్కే. చిన్నవయస్సులోనే అతడు చక్రవర్తియయ్యెను. అతనిపేరు ఫ్రెడరిక్కు II. "ప్రపంచమున అద్భుత పురుషుడు" అను పేరుపొందినవాడితడే. ఇతడు పాలస్తీనావెళ్ళి ఈజిప్టు సుల్తానుతో స్నేహభావముతో ప్రసంగించివచ్చెను. ఇతడుకూడా, ఇతని తాతవలెనే, పోపును ధిక్కరించి అతని ఆజ్ఞలను పాలించ నిరాకరించెను. పోపు ఇతనిని బహిష్కరించెను. ప్రాచీనకాలమున పోపులచేతిలోని బలమైన ఆయుధమిది. కాని దానికి కొంచెము తుప్పుపట్టుచున్నది. పోపుక్రోధమును ఫ్రెడరిక్కు II లెక్కచేయలేదు. ప్రపంచముకూడ మారుచుండెను. రాజుల కార్యములలో పోపు కలుగజేసికొనవలసిన పనిలేదని చూపుచు అతడు యూరోపులోని రాజులకును, పాలకులకును పెద్దపెద్ద జాబులు వ్రాసెను. మతవిషయములకు, ఆధ్యాత్మిక విషయములకు సంబంధించిన వ్యాపారములను చక్కజేసికొనుటయే పోపులపని. రాజకీయములలో వారు కలుగజేసికొనరాదు. మరియు మతాచార్యుల దుష్ప్రవర్తనమునుకూడ నతడు వెల్లడించెను. ఫ్రెడరిక్కు పోపులతో సంవాదమునందు పైచేయి అనిపించుకొనెను. అతని ఉత్తరములు చదువుటకింపుగా నుండును. చక్రవర్తికిని పోపుకును జరిగిన వివాదములో నేటిభావముల తొలి చిహ్నము లందుండుట అందుకు కారణము.

ఫ్రెడరిక్కు II మతవిషయములపట్ల సహనము కలిగియుండెను. అతని కొలువునకు అరబ్బీ తత్త్వశాస్త్రజ్ఞులును, యూదుల తత్త్వశాస్త్రజ్ఞులును వచ్చుచుండిరి. అతని ద్వారానే అరబ్బీ అంకెలును. బీజ

గణితమును (కొంత నిది ఇండియానుండి వచ్చెనన్నమాట జ్ఞాపకమున్నదా?) యూరోపులో ప్రవేశించెను. నేపిల్సు విశ్వవిద్యాలయమును, సాలెర్నో అను ప్రాచీన విశ్వవిద్యాలయములో నొకగొప్ప వైద్యపాఠశాలను అతడు స్థాపించెను.

ఫ్రెడరిక్కు II 1212 మొదలు 1250 వరకు రాజ్యముచేసెను. అతని మరణముతో సామ్రాజ్యముపై హోహెన్‌స్టాఫెన్ కుటుంబము యొక్క అధికారము సడలెను. నిజమునకు సామ్రాజ్యమంతరించినట్లే. ఇటలీ అంతరించెను. జర్మనీ శకలములాయెను. చాలాసంవత్సరముల వరకు అల్లరులు భయంకరముగా చెలరేగెను. దోపుడుగాండ్రగు నైటులను (Knights), బందిపోటు దొంగలును కొల్లగొట్టుచుండిరి, దోచుకొనుచుండిరి. వారి నరికట్టువారెవరూ లేకుండిరి. పవిత్రరోమక సామ్రాజ్యభారమును జర్మనురాజ్యము మోయలేకుండెను. ఫ్రాంసు ఇంగ్లాండులలో రాజులు తమప్రాబల్యమును వృద్ధిచేసికొనుచుండిరి. తమకు చిక్కులు కలిగించుచున్న ఫ్యూడల్ సామంతులను అణచివేయుచుండిరి. జర్మనీలో రాజు చక్రవర్తికూడ అయియుండెను. అతడు పోపుతో కలహించుచునో, ఇటాలియన్ ప్రభువుల నరికట్టుటకు ఇటాలియన్ నగరములతో పోరాడుచునో అందుపూర్తిగా నిమగ్నుడై యుండెను. జర్మనీకి చక్రవర్తి యుండుట గౌరవప్రదమేమో కాని ఆ కారణమువల్ల దానికివచ్చినలాభము యేమియులేదు సరిగదా దుర్బలత్వము కలతమాత్రము స్వదేశములో పెరిగెను. జర్మనీ ఏకమగుటకుపూర్వమే ఫ్రాంసు ఇంగ్లాండుదేశములు శక్తివంతములగు జాతులయ్యెను. జర్మనీలో వందలకొలది సంవత్సరములపాటు చిన్నచిన్న రాజులనేకులుండిరి. అరువది సంవత్సరములకు పూర్వమందు మాత్రమే అది యేకమైనది అయినప్పటికిని చిన్నరాజులును, రాజకుమారులును ఉంటూనే ఉండిరి. 1914—18 లో జరిగిన మహాయుద్ధము ఈరాచమూక అంతరించుటకు కారణమాయెను.

ఫ్రెడరిక్కు II అనంతరము జర్మనీలో అల్లరులధికముగా నుం టుటవలన 23 సంవత్సరములకాలముపాటు చక్రవర్తిఎన్నుకొనబడలేదు. 1273 సంవత్సరమున హాప్సుబర్గుకౌంటు అయిన రుడాల్ఫు అనువాడు చక్రవర్తిగా యెన్నుకోబడెను. ఒక క్రొత్తకుటుంబము—హాప్సుబర్గు వంశకుటుంబము—ఇప్పుడు రంగమునకు దిగెను. ఇది సామ్రాజ్యము అంత మొందేవరకూ దానిని అంటిపెట్టుకొని యుండెను. మహాయుద్ధకాలము నందే ఈకుటుంబము పాలకకుటుంబముగా అంతమునకువచ్చెను. యుద్ధకాలమున ఆస్ట్రియాహంగరీ చక్రవర్తి హాప్సుబర్గువాడే. అతని పేరు ఫ్రాంసిస్ జోసెఫ్. అతడు కడువృద్ధు. 60 సంవత్సరముల కాలము అతడు చక్రవర్తిగా నుండెను. అతని మేనల్లుడును, రాజ్యము నకు వారసుడును అయినవాడు ఫ్రాంజ్ ఫెర్డినాండు. బాల్కనులలోనున్న బోస్నియాలోని సెరజివోలో 1914 సంవత్సరమున భార్యతోగూడ అతడు హత్యగావింపబడెను. మహాయుద్ధప్రారంభమున కీహత్యయే కారణము. యుద్ధము అనేక విషయములను మరుమట్టించెను. అందు ప్రాచీన హాప్సుబర్గు రాజవంశ మొకటి.

పవిత్ర రోమకసామ్రాజ్యము సంగతి యిట్లుండెను. పడమర ఫ్రాంసు ఇంగ్లాండులు తరుచు ఒకరితోనొకరు పోరాడుకొనుచుండిరి. ఇంతకన్న తరుచుగా ప్రతియొక దేశపురాజును తనదేశమందలి గొప్ప కులీనులతో పోరాడుచుండెను. ఈరాజులు కులీనులపై విజయము సాధించిరి. జర్మనీరాజు లేదా చక్రవర్తి యిట్లు చేయలేకపోయెను. కావుననే ఇంగ్లాండు ఫ్రాంసులు ఐక్యతసాధించిన దేశములైనవి. వారి ఐక్యతయే వారికి బలమునిచ్చెను.

ఈకాలమున ఇంగ్లాండులో ఒక విశేషముజరిగెను. నీవు దానిని గూర్చి చదివియుండవచ్చును. క్రీ॥ వె॥ 1215 సంవత్సరమున జాన్‌రాజు మాగ్నకార్టా (Magna Charta) పై చేవ్రాలుచేసెను. సింహహృదయుడగు

రిచర్డు అనంతరము జాన్ సింహాసనమెక్కెను. అతడత్యాశాపరుడు అతడు దుర్బలుడుకూడా. అతడు అందరికీ కోపముతెప్పించెను. థేమ్సు నదిలోనున్న రన్నిమీడ్ ద్వీపములో కులీనులతనిని పట్టుకొని, కత్తి చూపి, బలవంతాన మాగ్నాకార్టా (మహాశాసనము)పై చేవ్రాలుపెట్టించిరి. ఇంగ్లాండులోనున్న కులీనులయొక్కయు, ప్రజలయొక్కయు కొన్ని హక్కుల నాతడు పాలించునట్లు వాగ్దానముచేసిన విషయమందుండెను. రాజకీయ స్వాతంత్ర్యముకొరకు ఇంగ్లాండులో దీర్ఘకాలము చేసినపోరాటమునకు ఇది మొదటి పెద్దసోపానము. ఏ పౌరుని సొత్తుగాని స్వాతంత్ర్యముగాని, సాటిపౌరుల అనుమతిలేకుండ రాజు ఆక్రమణచేయకూడదని అందు ముఖ్యముగా వుదహరించబడినది. దీనినుండియే జ్యూరీ పద్ధతి (Jury System) అమలులోనికి వచ్చినది. దీనినిబట్టి సాటివారు న్యాయవిచారణ చేయుదురు. ఇంగ్లాండులో ఈవిధముగా రాజుయొక్క అధికారము తొలిరోజులలోనే అరికట్టబడెను. పవిత్రరోమక సామ్రాజ్యములో అమలులోనున్న రాజు అధీశత (Supremacy) ను గూర్చిన సిద్ధాంతము నాడే ఇంగ్లాండులో అంగీకరింపబడలేదు.

700 సంవత్సరములక్రితము ఇంగ్లాండులో చేయబడిన ఈనిబంధనము 1932 సంవత్సరమున సైతము బ్రిటిషుపాలనలోనున్న ఇండియాలో చెల్లుటలేదను విషయము గమనింపదగినది. నేడు ఒకవ్యక్తియైన రాజప్రతినిధి (Viceroy) ఆర్డినెన్సులను జారీచేయుటకూ, శాసనములు నిర్మించుటకూ, ప్రజలఆస్థిని, స్వాతంత్ర్యమును అపహరించుటకూ అధికారముకలవాడు.

మాగ్నాకార్టా తరువాత ఇంగ్లాండులో మరియొక గొప్ప విశేషము జరిగెను. జాతీయసంఘమొకటి క్రమేణా వృద్ధినందెను. వేర్వేరు గ్రామములనుండియు, నగరములనుండియు పౌరులును, నైటులును (Knights) సంఘానికి పంపబడుచుండిరి. ఇదియే ఇంగ్లీషు పార్లమెం

టుకు పునాది. నైటులును, పౌరులును కామన్సుసభ (House of Commons) అయిరి. కులీనులును, బిషప్పులును లార్డ్సుసభ (House of Lords) అయిరి. ప్రారంభమున ఈపార్లమెంటు కెక్కువ అధికారములేదు. కాని యిది క్రమముగా వృద్ధినందెను. చిట్టచివరకు రాజుకును పార్లమెంటుకును ఎవరధికులనే విషయమున పోటీవచ్చెను. రాజు శిరచ్ఛేదము పాలా యెను. పార్లమెంటు అప్రతిహతమగు యాజమాన్యమును వహించెను. కాని ఈవిషయము సుమారు 400 సంవత్సరముల తరువాత 17 వ శతాబ్దములో జరుగనుండెను.

ఫ్రాంసులోకూడ ఒకఆలోచన సంఘముండెను. దీనికి మూడు ఎస్టేటుల (Estates) సంఘమనిపేరు. ఈమూడు ఎస్టేటులును ఏవనగా ప్రభువులు, చర్చి, కామను (Commons). రాజు కోరినప్పుడు సంఘ మొక్కొక్కమారు సమావేశమగుచుండెను. కాని దాని సమావేశములు నిరుచుగా జరుగుచుండుటలేదు. ఇంగ్లీషు పార్లమెంటు సంపాదించిన పలుకుబడి ఇది సంపాదించలేక పోయినది. ఫ్రాంసులోకూడ ఒకరాజు శిరచ్ఛేదనపాలు కావలసివచ్చెను. రాజుల అధికారము అంతమొందక ముందే యిది జరిగెను.

తూర్పున గ్రీకుల తూర్పు రోమకసామ్రాజ్యము ఇంకా ప్రాణ ములతో వుండెను. తొలిరోజులనుండియు యెవరితోనో వొకరితో అది పోరాడుచునేయుండెను. అనేకపర్యాయములది కూలిపోవుటకు సిద్ధ మయ్యెను. అయినను అది నిలిచినది. మొదట ఉత్తరబర్బరుల దండ యాత్రను, పిమ్మట ముస్లిముల దండయాత్రను ప్రతిఘటించి అది నిలిచి నది. రష్యనులు, బల్గేరియనులు, అరబ్బులు, సెల్జూకు తురుష్కులు— వీరు సామ్రాజ్యముపైచేసిన దాడులకన్న దారుణమును హానికరమును అగు దాడి మతవీరులు చేసినదే. ఈక్రైస్తవయోధులు (నైటులు) క్రైస్తవనగరమగు కాన్‌స్టాంటినోపులుకు యెక్కువ వుపద్రవము తెచ్చి

పెట్టిరి. క్రైస్తవమత విశ్వాసములేని ఏజాతియు యింతహాని చేయ లేదు. ఈ యుపద్రవానంతరము సామ్రాజ్యముకాని, కాంస్టాంటినోపులు నగరముకాని తేరుకోలేదు.

పడమటి యూరోపు లోకమునకు తూర్పు సామ్రాజ్యముసంగతి యేమీతెలియదు. దానినది లెక్కచేయలేదు. అది క్రైస్తవలోకమున ఒకభాగము కాదుగదా! దానిభాషగ్రీకు. పడమటి యూరోపుయొక్క విజ్ఞానవంతమగుభాష లాటెను. నిజమునకు, క్షీణదశనందుచున్న కాల మునకూడ, పడమరలోకంటె కాంస్టాంటినోపులులో విద్యయు, విద్యా వ్యాసంగములును అధికముగానుండెను. కాని దానివిద్య ముసలివారి విద్య. ఆవిద్యలో శక్తిగాని, సృష్టిసామర్థ్యముకానిలేవు. పడమరవిద్య తక్కువే. కాని అదివయస్సులో నుండెను. దానికి సృష్టిసామర్థ్యముం డెను. త్వరలో నీశక్తి అందముగు కార్యములు చేయుటకు సిద్ధమగు చుండెను.

తూర్పు సామ్రాజ్యమున, రోములోవలె చర్చికిని, చక్రవర్తికిని విరోధములులేవు. అచ్చటి చక్రవర్తి సర్వతంత్ర స్వతంత్రుడు. అతడు నిరంకుశుడు. స్వతంత్రత అనేమాట అక్కడ లేనేలేదు. ఎవరు బలాధి క్యులో, ఎవరు అధర్మమునకు వెనుదీయరో వారిదే సింహాసనము. హత్యలద్వారా, కుట్రలద్వారా, రక్తపాతముద్వారా, నేరములద్వారా, మానవుల కిరీటమును సంపాదించిరి. ప్రజలు పిరికిపందలై వారిఆజ్ఞ లకు బద్ధులైయుండిరి. ఎవరుపాలించినను వారికొక్కటే అన్నట్లుండెను.

యూరోపు ద్వారముదగ్గిర, తూర్పు సామ్రాజ్యము ద్వారపాలన చేయుచున్నట్లుండెను. ఆసియానుండి దండయాత్రలు రాకుండ అది కాపాడుచుండెను. అనేకవందల సంవత్సరముల కాలమదియట్లు నిర్వి ఘ్నముగ చేయగలిగెను. అరబ్బులు కాంస్టాంటినోపులును పట్టుకొన లేకపోయిరి. సమీపమునకు వచ్చియు సెల్జూకు తురుష్కులు దానిని

తీసికొనలేకపోయిరి. మంగోలులు దానిని తప్పించుకొని, ప్రక్కనుండి ఉత్తరముగా రష్యాకుపోయిరి. చివరకు ఆటోమను తురుష్కులు వచ్చిరి. వారిచేతులలో సామ్రాజ్యనగరమగు కాంస్టాంటినోపులు క్రీ॥ వె॥ 1453 సంవత్సరమున పడెను. నగరపతనముతో సామ్రాజ్యముకూడ పతనమయ్యెను.

# 64

# యూరోపియన్ నగరములు తలయెత్తుట

జూన్ 21, 1932.

మతదండయాత్రల కాలముననే యూరోపు ప్రజలలో సమానమైన కోరికయు, సమానమైన విశ్వాసము, గొప్పభక్తి చెలరేగెను. వీరు ఆ భక్తిని పురస్కరించుకొని సంసారికష్టములనుండి విముక్తి నందుటకు ప్రయత్నించిరి. అప్పుడు విజ్ఞానశాస్త్రము తలయెత్తలేదు: విద్యకూడ అంతమాత్రముగానే వుండెను. భక్తియున్నచోట విజ్ఞానశాస్త్రమూ, విద్యయూ అంతగా వికసించవు. విద్యయూ, విజ్ఞానమునూ ప్రజలను ఆలోచించునట్లు చేయును. సందేహమూ, విమర్శనమూ భక్తికి సహచరులుగా వుండజాలవు. విజ్ఞానశాస్త్రము అవలంబించుమార్గము విమర్శన ప్రయోగములతో సంబంధించియుండును. భక్తి అవలంబించు మార్గమిదికాదు. ఈభక్తి యెట్లు దుర్బలముకాగా సంశయము తలయెత్తినదో ముందుముందు తెలిసికొందము.

కాని యిప్పటిమట్టుకు భక్తివిజృంభించుచుండెను. భక్తిపరులపై నాయకత్వమును వహించి రోమన్‌చర్చి వీరిని ప్రజలను స్వలాభమునకై వుపయోగించుకొనుచుండెను. భక్తిపరులు వేలకువేలు మతదండయాత్రల నిమిత్తము పాలస్తీనాకు పంపబడిరి. వారు తిరిగి యింటికే

రాలేదు. పోపుకూడ క్రైస్తవులమీదను, తనకు లోబడని యూరోపులోని ప్రజాసంఘములమీదను మతయుద్ధము ప్రకటింపదొడగెను. ప్రజల భక్తిని పురస్కరించుకొని పోపును, చర్చియును వ్యావర్తనపత్రములను (Dispensations) క్షమాదాన పత్రములను (Indulgences) ప్రజల కిచ్చుచుండిరి. తరుచు వీటిని అమ్ముచుండిరి. వ్యావర్తనములనగా—చర్చికి సంబంధించిన శాసనముగాని సంప్రదాయమునుగాని మీరుటకిచ్చిన అనుమతులు. ఇట్లు చర్చి తాను స్వయముగాచేసిన శాసనములు, ప్రత్యేకసందర్భములలో, ఉపేక్షించుటకు సమ్మతి నొసగుచుండెను. అట్టి శాసనములపై గౌరవ మెంతకాలముండగలదు? క్షమాదానపత్రముల సంగతి యింతకన్న పాడుగానుండెను. రోమన్ చర్చిప్రకారము మృతినొందినవారి ఆత్మలు పాపవిముక్తి లోకము (Purgatory) నకు పోవును. ఈలోకము స్వర్గమునకును నరకమునకునుమధ్య నెక్కడో వుండును. ఇహలోకమునచేసిన పాపములకు ఫలములను అచ్చట ఆత్మలు అనుభవించును. తరువాత ఆత్మలు స్వర్గమునకు పోవునట. పాపవిముక్తి లోకమునపడకుండ నేరుగా స్వర్గమునకు పోవుటకుగాను పోపు కొంతధనము తీసికొని ప్రజలకు క్షమాదాన పత్రములద్వారా వాగ్దానములు చేయుచుండెను. అమాయకుల భక్తిని చర్చి ఈవిధముగా స్వలాభమునకై వినియోగించుకొనుచుండెను. నేరములను, పాపములనుకూడా ఆధారము చేసుకొని అది డబ్బుగడించుచుండెను. క్షమాదాన పత్రములను అమ్మే ఆచారము మతయుద్ధములతరువాత కొంతకాలమునకు తలయెత్తి వృద్ధినందెను. ఇదిచూచి నలుగురును ముక్కుపై వ్రేలు పెట్టుకొనిరి. రోమకచర్చిపై ప్రజలనేకులకు విముఖత్వము కలుగుటకిదియొక కారణము.

అమాయకులగు భక్తులు యింతమట్టుకు ఓర్చుకొనుట వింతగానున్నది. ఇందువల్లనే మతమనేకదేశములలో గొప్పలాభసాటి వ్యాపార

ములలో నొక్కటిగా నున్నది. దేవాలయములోని పూజారులను చూడుము. పాపము, భక్తునివారెట్లు డబ్బుకొరకు పీడించుకుతిందురో! గంగాతీరమునకుపోయి చూడుము. పండాలెట్లుకోరిన డబ్బుచెల్లించు వరకును పల్లెటూరు మనుష్యులు చేయమన్న పూజాదికర్మలు చేయక నిరాకరింతురో. కుటుంబములో పుట్టుకగాని, పెండ్లిగాని, చావుగాని, మరియేదైనగాని తటస్థించినతోడనే పురోహితుడు ప్రవేశించును. అతనికి ధనమిచ్చి తీరవలెను.

ప్రతిమతమునందును, హిందూమతముకానీ, క్రైస్తవమతము కానీ, ఇస్లాంమతముకానీ, జొరాష్ట్రియన్ మతముకానీ, యిది యిట్లే జరుగుచున్నది. భక్తిపరుల భక్తిని పురస్కరించుకొని ప్రతిమతమును ఏదో యొకపద్ధతి ననుసరించి ధనమును చేసికొనును. హిందూమత పద్ధతులు సువిదితమే. ఇస్లాంలో పురోహితులులేరని చెప్పుదురు. ప్రాతకాలమున మతమును పురస్కరించుకొని స్వార్థోపయోగమునకు తస్మతాపలంబులను బాధించకుండ రక్షించుటకు ఇదికొంచెము తోడ్పడి నది. కాని వ్యక్తులును కొన్నితరగతుల మనుష్యులును తలయెత్తిరి. మతవిషయమున ప్రత్యేకకృషి చేసినట్లు వారు చెప్పుకొనుచుండిరి. వారు పండితులు, మౌలవీలు, ముల్లాలు యిత్యాది భక్తిపరులగు ముస్లి ములను మాయచేసి వారు స్వలాభమును పొందుచుండిరి. పొడుగు గడ్డము, లేదా నడినెత్తిపైముడి, లేదా నుదుట పెద్దబొట్టు, లేదా ఫకీరు దుస్తులు, లేదా కాషాయవస్త్రములు—ఇవి మహనీయతకు చిహ్నము లైనప్పుడు ప్రజలను మాయచేయుటంత కష్టముకాదు.

దేశములన్నింటికన్న యెక్కువగా అభివృద్ధి చెందియున్న అమెరికాకు నీవువెళ్ళినచో అచ్చట మతమొక పెద్దపరిశ్రమమని కను గొనగలవు. స్వార్థమునకు ప్రజలనుపయోగించుకొని ఆపరిశ్రమ వృద్ధి నందుచున్నది.

మధ్యయుగములను, భక్తియుగమునుదాటి నేను ఇతరవిషయము లను చర్చించుచుంటిని. మనము మరల వాటికడకు పోదము. ఈమత విశ్వాసము క్రమేణా సృష్టిరూపమును ధరించుచుండుట మనము చూడ గలము. 12, 13 శతాబ్దములు భవననిర్మాణ కాలముగా మనము గణించ వచ్చును. పడమటి యూరోపు నందంతటను కెతీడ్రలులు (Cathedrals) లేచినవి. యూరొపులో ఇదివరకులేని ఒకక్రొత్త వాస్తునిర్మాణ మీకాలమున పొడగట్టినది. భవనములయొక్క పెద్దకప్పులయొక్క బరువును, ఒత్తి డిని (Stress) భవనము వెలుపలకట్టిన అండగోడలు (Buttresses) భరించునట్లు ఆకాలపువారు ఉపాయముచేసిరి. భవనము లోపలిభాగ మున సున్నితమగు స్తంభములు భవనోపరి భాగముయొక్క పెద్దబరు వును మోయుచున్నట్లు కనబడును. ఇది చూచుటకు ఆశ్చర్యకరముగా నుండును. అరబ్బుల వాస్తువైఖరి ననుసరించి ఒక ధనురాకారముగానున్న వంపు (Arch) మొనదేరియుండును. భవనముపై ఆకాశమునకు ఒక శిఖ రము (Spire) పోవును. దీనినే గాథిక్‌వాస్తువైఖరి యందురు. (Gothic style of architecture). ఈవాస్తువైఖరి రూపమందినది యూరోపులోనే. ఇది ఎంతో అందముగానుండును. ఆకసమునంటే భక్తికిని ఆకాంక్ష కును అది చిహ్నముగానున్నట్లు తోచును. అది నిజముగా మతవిశ్వాస యుగమున కుచితమగు చిహ్నమే. ఒక మహత్కార్యమును నిర్వ హించే తలంపుతో, ఒకరికొకరు సహాయము చేసికొనుచూ, భక్తిభావ ముతో పూనుకొన్న పనిని శ్రద్ధతో చేయుచూవుండే శిల్పులూ, పని వాండ్రుమాత్రమే అట్టిభవనముల నిర్మింపగలరు.

గాథిక్ వాస్తువైఖరి పడమటి యూరోపులో తలయెత్తుట ఆశ్చర్య కరమగు విషయము. అల్లరులు, అరాజకము, అజ్ఞానము అసహనము అను రొంపినుండి ఈసుందరవస్తువు లేచినది. ఫ్రాంసులో, ఉత్తర ఇటలీలో, జర్మనీలో, ఇంగ్లాండులో సుమారొకేమారు గాథిక్ కెతీడ్ర

లుయి లేచినవి. వాటిని నిర్మించిన శిల్పులపేళ్ళెవరికిని తెలియవు. సర్వప్రజలయొక్క ఉమ్మడిసంకల్పమును, ఉమ్మడిశ్రమయును అందు గోచరమగుచుండెను. ఒక్క శిల్పవిద్యకాదు. పేరొకనూతన విషయము—కెతీడ్రలుయొక్క గవాక్షముల కమర్చబడిన రంగుచిత్రములుగల గాజు పలకలు. ఈగవాక్షముల కాచఫలకములపై అందమైన రంగులతో రచింపబడిన చిత్రములు చక్కనివుండెను. భవనము చూచుటకు గంభీరముగాను, పావనముగాను కనిపించుచుండెను. గవాక్షముల గుండా లోనికివచ్చు సూర్యకాంతి ఈగుణములను వృద్ధిజేయుచుండెను.

కొద్దిరోజులకుపూర్వము, ఒకజాబులో నేను యూరోపును ఆసియాతో పోల్చి వ్రాసితిని. ఆకాలమున యూరోపుకన్న ఆసియా నాగరికతయందును, సంస్కృతియందును ముందంజ వేసియుండెనని తెలిసికొంటిమి. అయినప్పటికిని ఇండియాలో నూతనసృష్టి అంతగాలేదు. నూతన సృష్టివల్లనే దేశమునకు ప్రాణమున్నదని మనము నిర్ణయింపవచ్చును. సగము నాగరికతనందిన యూరోపునుండి గాథిక్ వాస్తువైఖరి తలయెత్తుటనుబట్టిచూడ ఆదేశమునకు ప్రాణమున్నదని మనము తెలిసికొందుము. అల్లరులును, వెనుకబడ్డ నాగరీక పరిస్థితులును కల్పించిన కష్టములు బాధపెట్టుచున్నప్పటికీ ఈప్రాణశక్తి బయటపడి, బాహ్యస్వరూపమునందుటకు మార్గములు వెదకుచుండెను. గాథిక్ భవనములట్టి ఒక ప్రత్యక్ష స్వరూపమే. కొంతకాలము గడచినపిమ్మట నీశక్తి చిత్రవిద్య, శిల్పవిద్య, సాహసకార్యములుచేయు నుత్సాహము—వీనియందు ప్రదర్శితమైనది.

ఇట్టి గాథిక్ కెతిడ్రలు నీవుకొన్ని చూచియుంటివి. నీకు జ్ఞాపకమున్నదా? జర్మనీలో కొలోనులోనున్న కెతీడ్రలును నీవు చూచితివి. ఇటలీలో, మిలానువద్ద ఒకచక్కని గాథిక్ కెతీడ్రలు కలదు. ఫ్రాంసులో చార్టెసులోకూడ నొకటియున్నది. ఈప్రదేశముల పేళ్ళు నేనిప్పుడు

చెప్పజాలను. జర్మనీ, ఫ్రాంసు, ఇంగ్లాండు, ఉత్తరఇటలీలలో ఈకెతీడ్రయలు వ్యాపించియున్నవి. రోములో మాత్రము ప్రసిద్ధిగన్న గాథిక్ భవనము లేకుండుట విచిత్రమే.

11, 12 శతాబ్దులకు సంబంధించిన ఈ భవననిర్మాణ కాలములో గాథిక్ వైఖరి ననుసరించని క్రైస్తవాలయములుకూడ నిర్మింపబడినవి. పారిస్‌లో నోటర్‌డేమ్ మహాకెతీడ్రలూ, బహుశా వెనీసులోని సెయింటు మార్కు కెతీడ్రలూ, నీవు చూచియుంటివి. అది బైజాంటైన్ సరణిని నిర్మించబడినది. అందు చిత్రవర్ణముల ఫలకములు చిత్ర విచిత్రాకారములుగా (Mosaics) నమర్చబడినవి.

భక్తియుగము క్షీణించెను. దానితో చర్చిలు, కెతీడ్రలులు నిర్మించుటకూడ తగ్గిపోయెను. మనుష్యుల ఆలోచనలు అన్యమార్గములు పట్టెను. వారి వర్తకవ్యాపారములలో, వారి పురజీవనములలో వారు నిమగ్నులైరి. కెతీడ్రయలకు బదులు పురభవనములు నిర్మింపదొడగిరి. 15 శతాబ్దాదినుండియు అందమగు గాథిక్ పురభవనములు, సంఘ (Guild) భవనములు ఉత్తర పశ్చిమయూరోపు నందంతటను అచ్చటచ్చట చెదిరియుండుట మనము చూతుము. లండనులో పార్లమెంటు సభాభవనములు గాథిక్ పంపిణీని కట్టబడినవే. అవి యెప్పుడు నిర్మింపబడెనవో నాకు తెలియదు. తొలుత నిర్మింపబడిన గాథిక్ భవనము రగులబడి పోయినదనియు, వేరొకటి గాథిక్ పంపిణీనే నిర్మింపబడినదనియు నా ఊహ.

11, 12 శతాబ్దములలో తలయెత్తిన ఈ గొప్పగాథిక్ కెతీడ్రలులు పట్టణములందును, నగరములందును నిలిచిఉండెను. ప్రాచీనపట్టణములు మేల్కొనుచున్నవి. నూతన పట్టణములు వృద్ధినందుచున్నవి. యూరోపునందంతటను మార్పుకానవచ్చుచుండెను. ప్రతిచోటను పట్టణవాసము వృద్ధిలోనుండెను. రోమక సామ్రాజ్యకాలమున మధ్యధరా

తీరముచుట్టును పెద్ద పట్టణములుండెను. రోముపతనము, గ్రీకు—రోమక నాగరికత పతనము కారణముగా ఈపట్టణములును క్షీణించెను. కాంస్టాంటినోపులువినా యూరోపులో పెద్దనగరమేలేదు. స్పెయినులో మాత్రమట్లుకాదు. అచ్చట అరబ్బులేలుచుండిరి. ఆసియాలో-ఇండియా చీనా, అరబ్బీలోకములలో—ఈకాలమున గొప్పనగరములు వర్ధిల్లెను. కాని యూరోపులోలేవు. నగరములతోపాటు సంస్కృతియు నాగరికతయు పోవుచుండుననితోచును. యూరోపులో రోమక ప్రభుత్వము కూలినపిమ్మట దీర్ఘకాలమువరకు ఇవిలేవు.

కాని మరల నగరజీవనము పునరుజ్జీవితమయ్యెను. ముఖ్యముగా ఇటలీలో ఈనగరములు వృద్ధినందెను. పవిత్రరోమక సామ్రాజ్య చక్రవర్తి ప్రక్కలో బల్లెములవలె నివి నిలిచియుండెను. వారికున్న స్వతంత్రములు కొన్ని తొలగుటకు వారు సమ్మతించరైరి. ఇటలీలోను ఇతర ప్రదేశములందును ఈ నగరములు, వర్తక తరగతులయొక్కయు, మధ్య తరగతులయొక్కయు (బూర్జువాజి) వృద్ధిని సూచించుచుండెను.

అడ్రియాటిక్ సముద్రముపై అధికారము చెలాయించుచున్న వెనీసునగరము స్వతంత్ర ప్రజాప్రభుత్వ రాజ్యమైనది (Republic). నేడది చూచుటకెంతో అందముగానున్నది; చుట్టునుతిరిగివచ్చు కాలువలగుండా లోనికివచ్చుచు వెనుకకుపోవుచు సముద్రమెంతో రమణీయముగా నుండును. కాని నగరనిర్మాణమునకు పూర్వము అది వట్టితేమనేలగావుండెనని చెప్పుదురు. హూణుడగు "అట్టిలా" ఖడ్గముచేబూని సర్వనాశనము చేసికొనుచువచ్చి "అక్వీలా"ను ప్రవేశించినప్పుడు కొందరు కాందిశీకులు (Fugitives) వెనీసుతేమలలోనికి పారిపోయిరి. వారచ్చట వెనీసు నగరమును నిర్మించుకొనిరి. వారు తూర్పు రోమకసామ్రాజ్యమునకును పడమటి సామ్రాజ్యమునకును మధ్యనుండుటచే స్వతంత్రులుగా నుండగలిగిరి. ఇండియానుండియు తూర్పుదేశములనుండియు వెనీసుకు

ప్ర్తకమువచ్చెను. దానితో అది నౌకాదళమునునిర్మించి సముద్రాధికార మును సంపాదించెను. అది భాగ్యవంతుల ప్రజాప్రభుత్వము (republic). దాని అధ్యక్షునకు డోజ్ అని పేరు. 1797 సంవత్సరమున నెపోలియన్ వెనీసును జయించువరకునది ప్రజాప్రభుత్వరాజ్యముగానే ఉండెను. అప్పుడు మిక్కిలివృద్ధుడగు డోజ్ పరాజయవార్తవిని ప్రాణములు విడిచిపడిపోయెనని చెప్పుదురు. అతడే వెనీస్‌యొక్క ఆఖరిడోజ్.

ఇటలీ కావలితట్టున జినోవా వున్నది. అదికూడ సముద్రములో తిరుగు ప్రజలతోనిండిన ఒకగొప్ప వ్యాపారనగరమే. అది వెనీసుతో స్పర్థ జరుపుచుండెను. ఈరెంటికినిమధ్య బొలోన్ విశ్వవిద్యాలయ ముండెను. పీజా, వెరోనా, ఫ్లారెంసు పట్టణములుండెను. ఈ ఫ్లారెంసు నగరముననే ప్రఖ్యాతులగు చిత్రకారులు పలువురు తలయెత్తనున్నారు. ప్రసిద్ధ " మేడిచీ '' కుటుంబము పరిపాలనక్రింద అది తేజోవంతముగా వెలుగనున్నది. ఉత్తర ఇటలీలోని మిలాను నగరము అప్పుడే ఒకముఖ్య కేంద్రమై యుండెను. దక్షిణమున నేపుల్సు అభివృద్ధినందుచుండెను.

ఫ్రాంసులో " హ్యూకేపెట్ '' పారిస్‌ను తనరాజధానిగా చేసి కొనెను. ఫ్రాంసు అభివృద్ధితో నదియును అభివృద్ధి నందుచుండెను. ఎల్లకాలములందును పారిస్ ఫ్రాంసు దేశముయొక్క నాడీకేంద్రమును, హృదయమునై యుండెను. ఇతరదేశముల రాజధానులుండెనుగాని అందొక్కటియు, కడచిన 1000 సంవత్సరములలోనూ తమదేశము లలో ఫ్రాంసులో పారిస్ సంపాదించినంత ప్రాబల్యమును సంపాదించ లేదు. ఫ్రాంసులో ప్రసిద్ధినందిన ఇతరపట్టణములు లయన్సు, మార్సైల్సు (ఇది ప్రాచీన రేవుపట్టణము), ఆర్లియన్సు, బోర్డో, బొలోన్.

ఇటలీలోవలెనే జర్మనీలోకూడ స్వతంత్రనగరముల అభివృద్ధి ముఖ్యముగా 13, 14 శతాబ్దులలో అధికముగా నుండెను. వాటి జన సంఖ్యవృద్ధియగుచూ, వాటి ప్రాబల్యమూ, భాగ్యమూ అతిశయించిన

తోడనే వాటికి ధైర్యమువచ్చును. కులీనులతో అవి యుద్ధమునకు దిగును. చక్రవర్తి ఒక్కొక్కసారి వాటిని ప్రోత్సహించును. ప్రబలు లగు కులీనుల నణగద్రొక్కవలెనని యాతడు కోరుట యిందుకు కారణము. ఈనగరములు పెద్దవర్తకసంఘములను ఆత్మరక్షణ సంఘములను స్థాపించుకొనెను. ఒక్కొక్కమారు ఈ సంఘములు (వీటిని కాంఫిడెరసీలు అనెడివారు) కులీనుల ప్రతిసంఘములతో యుద్ధము చేయుచుండెను. హాంబర్గు, బ్రెమెన్, కొలోన్, ఫ్రాంక్‌ఫర్టు, మ్యూనిచ్, డాంజిగ్, నూరెంబర్గు, బ్రెస్లా—ఇవి కొన్నివృద్ధినందుచున్న నగరములు.

నెదర్లాండులలో (నేడు వీటిని హాలెండు, బెల్జియము అందురు.) ఆంట్‌వర్పు, బ్రూజెస్, ఘెంట్ అను నగరములుండెను. ఇవి వర్తక నగరములు. ఇందు వ్యాపారము నానాటికీ అతిశయించుచుండెను. ఇంగ్లాండులో లండనుండెను. కాని అప్పుడు యూరోపునందున్న ఇతర ముఖ్యనగరములతో పరిమాణమునందుగాని, భాగ్యమునందుగాని వర్తకమునందుగాని అది సరిపోలకుండెను. ఆక్స్‌ఫర్డు, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయములు రెండును విద్యానిలయములుగా ప్రాముఖ్యమును గడించుకొనుచున్నవి. యూరోపుకు తూర్పున వియన్నా నగరముండెను. యూరోపులో అది కడు ప్రాచీననగరము. రష్యాలో మాస్కో, కీవ్, నొవోగోరాడ్ నగరములుండెను.

ఈ నూతననగరములకును లేదా ఇందులో పెక్కునగరములకును ప్రాచీన సామ్రాజ్యనగరములకునూ భేదమును మనము గమనించవలెను. యూరోపులో క్రొత్తగా తలయెత్తుచున్న నగరములకు ప్రాముఖ్యము ఒకరాజునుబట్టికాని చక్రవర్తినిబట్టికాని వచ్చినదికాదు. అది వారివశమందున్న వర్తకమునుబట్టి వచ్చినది. కులీనులవల్ల వాటికి బలము చేకూరలేదు. వర్తకజనులవల్లనే దానికి బలమువచ్చినది. అవి వర్తకనగరములు. ఈనగరములు తలయెత్తుట, బూరువాజి (మధ్యతర

గతులు) తలయెత్తుటయే. ఈబూర్జువాజీ క్రమముగా ప్రబలులై, రాజులను కులీనులను ఎదిరించి వారినుండి అధికారమును వశపరచుకొన్నసంగతి ముందు ముందు తెలిసికొందము. ఇది మనము ప్రసంగించుకొనుచున్న కాలమున కెంతోపిమ్మట జరుగనున్నది.

నేనిప్పుడే చెప్పియుంటినిగదా: నగరములును నాగరికతయును తరుచు కలిసినడుచునని. నగరములు పెరుగుటతో విద్యకూడా వ్యాపించును, స్వతంత్రభావనయు వృద్ధినందును. పల్లెప్రాంతముల నివసించు జనులు చెదిరియుందురు. తరుచు వారు మూఢవిశ్వాసములలో మునిగియుందురు. వారు పంచభూతములవశమైయున్నట్లు తోచును. వారు కష్టపడి పనిచేయవలెను. వారికి విశ్రాంతి తక్కువ. యజమానుల ఆజ్ఞలను వారు కాదనలేరు. నగరములలో బహుసంఖ్యాకులు కలిసి జీవింతురు. నాగరీకజీవనమును గడపుటకు వారికెక్కువ సావకాశము లున్నవి. జ్ఞానము నార్జించుటకు, చర్చలు విమర్శలు చేయుటకు ఆలోచించుటకు వారికెక్కువ సావకాశము లున్నవి.

ఫ్యూడల్ కులీనులుచూపు రాజకీయాధికారమును, చర్చిచూపు మతాధికారమును ధిక్కరించి స్వతంత్రభావన పెంపొందుట చూచితిమి. మతవిశ్వాసయుగము క్షీణించినది. సంశయము తలయెత్తినది. పోపు అధికారమునుకాని, చర్చిఅధికారమునుగాని ఎల్లవేళల కన్నులుమూసికొని అనుసరించుపద్ధతి పోయినది. ఫ్రెడరిక్కు II పోపునెట్లు ధిక్కరించెనో చూచియుంటిమి. ఈ ధిక్కారభావమెట్లు వృద్ధిగాంచుచుండెనో ముందుముందు చూతము.

పన్నెండవ శతాబ్దము మొదలుకొని విద్యాపునరుద్ధరణకూడా జరిగినది. యూరోపులో పండితులభాష లాటిన్. జ్ఞానపిపాస కలవారు ఒక విశ్వవిద్యాలయమునుండి వేరొక విశ్వవిద్యాలయమునకు ప్రయాణము చేయుచుండిరి. "డాంటే అలిఘెరి" అను గొప్ప ఇటలీ

కవీశ్వరుడు 1265 సంవత్సరమున జన్మించెను. ఇటలీవాడగు వేరొక గొప్పకవి "పెట్రార్కు" అనువాడు 1304 లో జన్మించెను. కొంతకాల మైన పిమ్మట, గొప్ప ఇంగ్లీషుకవులలో తొలుతటి కవియగు ఛాసరు ఇంగ్లాండులో వర్ధిల్లెను.

విద్యాపునరుద్ధరణకన్న ఎక్కువ ముఖ్యమైన విషయము విజ్ఞాన శాస్త్రోత్సాహము యొక్క అస్పష్టప్రారంభములు. యూరోపులో తరువాతి సంవత్సరములలో విజ్ఞానశాస్త్రమెంతగానో పెరుగనున్నది. అరబ్బుల కిట్టి యుత్సాహముండెననియు, దానిప్రకారము వారు కొంతవరకు పని చేసిరనియు చెప్పియుంటిని జ్ఞాపకమున్నదా? మధ్యయుగములలో, నిష్పక్షపాతముగ విచారణను సాగించుటకునూ, ప్రయోగములుచేయుట కునూ యూరోపులో సాధ్యముకాకుండెను. చర్చి అట్టిపనులు సహించదు. చర్చికి ఇష్టములేకున్నను అది పొడగట్టుచుండెను. ఈకాలమున యూరోపులో నిట్టిశాస్త్రోత్సాహము కలవారిలో నొకడు ఇంగ్లీషువాడగు రోజర్ బేకన్. 13 వ శతాబ్దిలో అతడు ఆక్సుఫర్డులో నివసించి యుండెను.

## 65

# ఇండియామీద అష్టసుల దండయాత్ర

జూన్ 23, 1932.

నిన్నను నీకు ఉత్తరం వ్రాస్తూంటే ఆటంకం వచ్చింది. వ్రాయ డానికి కూర్చున్నాను. జైలూ, ఈపరిసరాలూ మరచాను. మధ్యయుగాల (Middle Ages) నాటి ప్రపంచానికి మనోవేగంతో వెళ్ళాను. అంతకన్న వేగంగా వర్తమానానికి వచ్చిపడ్డాను. నేను జైల్లో వున్నానన్నమాట తెలివికి వచ్చింది. బాధపడ్డాను. పైనుంచి పుత్తరువులు వచ్చాయట—

అమ్మతోటీ దివ్వాజ్ (ఇందిరమామ్మ) తోటీ నెలవరకూ నేను సంభాషణ చేయకూడదని. ఎందుకో నాతో చెప్పలేదు. బందీకి ఎందుకు చెప్పాలి? నాతో సంభాషణ చేసే రోజు ఎప్పుడు వస్తుందా అని పదిరోజులబట్టి వాళ్ళు డెహ్రాడూన్‌లో కనిపెట్టుకునున్నారు. ఇదంతా వ్యర్థమయింది. వాళ్ళు మళ్ళీ తిరిగిపోవలసిందే. ఇదీ మాకుచూపే మర్యాద. కానీ, కానీ ఇదిమనము లెక్కపెట్టకూడదు. రోటిలో తలపెట్టి రోకలిపోటుకు భయపడడ మెందుకు? ఇంతకీ చెరసాల చెరసాలే. ఈసంగతి మనం మరచిపోకూడదు.

ఈ అన్యాయం జరిగినపిమ్మట వర్తమానాన్ని వదలి పూతకాలానికి వెళ్ళడం నాకు సాధ్యంకాలేదు. రాత్రి నిద్రపోయాను కాబట్టి ఈ రోజు కొంచెం నయంగావుంది. మళ్ళీ ప్రారంభిస్తున్నాను.

మనమిప్పుడు మళ్ళీ ఇండియాకువద్దాం. చాలాకాలమైంది దానిని వదలిపెట్టివెళ్ళి. మధ్యయుగాల అంధకారంలోంచి బయటపడ్డానికి యూరోపు కొట్టుకొంటూన్న సమయంలో ఇండియాలో ఏమి జరుగుతోంది? ఫ్యూడల్ పద్ధతి బరువుకిందనూ, అచ్చటిదు ష్పరిపాలనవల్లనూ, అల్లరిలవల్లనూ ప్రజలు బాధపడుతూన్నప్పుడూ పోపూ, చక్రవర్తి ఒకరితో ఒకరు పెనగులాడుకొంటూన్నప్పుడూ, యూరోపులో దేశములు ఒకరూపానికి వస్తూన్నప్పుడూ, ప్రాచ్యములకాలమున క్రైస్తవమూ, ఇస్లామూ పరస్పరోన్నతికోసం పోరాడుతున్నప్పుడూ ఇండియాలో ఏమి జరుగుతోంది?

మధ్యయుగముల తొలిరోజులలో ఇండియా యెట్లావుండేదో కొద్దిగా చూచాము. వాయవ్య దిశనున్న గజినీరాజ్యమునుంచి సుల్తాను మహమ్మదు భాగ్యవంతమైన ఉత్తరహిందూస్థాన మైదానములమీదికి వచ్చిపడి, దోచుకుని, నాశనం చెయ్యడం మనము చూచాము. మహమ్మదు దండయాత్రలు ఘోరమైనవేకాని వాటివల్ల ఇండియాలో గొప్ప

మార్పుగాని, శాశ్వతమైన మార్పుగాని ఏమీరాలేదు. దేశానికి అసగా ముఖ్యంగా ఉత్తరాదికి ఒకపెద్ద దెబ్బతగిలినట్లయింది. చక్కని సౌధములను, భవనములను అనేకము అతడు నాశనంచేశాడు. కాని సింధు దేశమూ, పంజాబులో కొంతభాగముమాత్రమే గజినీసామ్రాజ్యంలో నిలిచాయి. ఉత్తరహిందూస్థానములో మిగతాభాగాలు త్వరలో తేరుకున్నాయి. దక్షిణాదికి ఎట్టి యిబ్బందికలుగలేదు. బెంగాలూ అంతే. మహమ్మదు అనంతరం 150 సంవత్సరములుపైగా ముస్లింవిజయములుగాని. ఇస్లాం మతముగాని ఇండియాలో యెట్టివిధముగానూ ముందుకు పోలేదు.

12 వ శతాబ్ది చివరభాగములో (సుమారు 1186 క్రీ. వె.) వాయవ్యమునుంచి నూతనదండయాత్రా పరంపరలు వచ్చాయి. ఆఫ్ఘనిస్థానములో ఒకనాయకుడు తలయెత్తి, గజనీని స్వాధీనము చేసుకొని గజినవైటు సామ్రాజ్యాన్ని తుదముట్టించాడు. అతనిపేరు సహాబ్-ఉద్-దీన్ ఘోరి (ఘూర్ ఆఫ్ఘనిస్థానములో చిన్నపట్టణము). అతడు లాహోరుకు దిగివచ్చి, దానిని స్వాధీనము చేసుకొని ఢిల్లీపై దండయాత్ర సాగించాడు. ఢిల్లీరాజు పృథ్వీరాజుచౌహాన్. ఉత్తర హిందూస్థానాధీశులు అనేకులు అతనితోచేరారు. పృథ్వీరాజు నాయకత్వాన్ని వారు సహాబ్-ఉద్-దీన్‌ను యెదుర్కొని అతనిని పూర్తిగా ఓడించారు. మరుసటి సంవత్సరం సహాబ్-ఉద్-దీన్ పెద్దసైన్యమును కూర్చుకొని తిరిగివచ్చాడు. ఈమారతడు పృథ్వీరాజును ఓడించి అతనిని చంపాడు.

పృథ్వీరాజునుగురించి ప్రజాసామాన్యము నేడుకూడా కథలుగా చెప్పుకుంటున్నారు. పాటలుకట్టి పాడుతున్నారు. ఈ పదాలలో ముఖ్యమైనది—అతడు కనోజిరాజైన జయచంద్రుని కూతురును యెత్తుకుపోయి పెళ్ళిచేసుకోడానికి సంబంధించినది. ఇందువల్ల అతనికి చాలా నష్టంకలిగింది. తన యనుచరులలో యోధులన్నవాళ్ళందరూ ప్రాణా

లర్పించుకోవలసివచ్చింది. ప్రబలుడైన రాజుతో శత్రుత్వం వచ్చింది. అన్యదేశీయుడు దండెత్తివచ్చి ఇతనిని ఓడించడం సులభమైంది.

ఈవిధముగా క్రీ. వె. 1192 లో సహబ్-ఉద్దీన్ మొట్టమొదటి విజయమును పొందాడు. దీనికి ఫలితము ఇండియాలో ముస్లిము పరిపాలన స్థాపించబడడం. మెల్లమెల్లగా తూర్పుగాను, దక్షిణముగాను ఆఫ్ఘనులు వ్యాపించారు. మరి 150 ఏండ్లలో (1340 సంవత్సరానికి) ముస్లిమ్‌పరిపాలన దక్షిణమున చాలాభాగముపై వ్యాపించింది. పిమ్మట దక్షిణమున అది తగ్గుమొహము పట్టింది. కొత్తరాజ్యములు తలయెత్తినవి. అందు కొన్ని ముస్లిమ్ రాజ్యములు, కొన్ని హిందూరాజ్యములు. అందు ముఖ్యముగా విజయనగర హిందూసామ్రాజ్యము పేర్కొనదగినది. 200 సంవత్సరములకాలము కొంతవరకు ఇస్లాము ఉన్నతిలో లేదు. 16 వ శతాబ్దమధ్యమందు అక్బరు తలయెత్తినప్పుడు మళ్ళీ ఇస్లాము సుమారు ఇండియా అంతటను వ్యాపించింది.

దండయాత్రలుచేస్తూ ముస్లిములు ఇండియాకు రావడంవల్ల అనేక ఫలితాలు కలిగాయి. దండయాత్రలు చేసినవాళ్ళు ఆఫ్ఘనులనేమాట మరవకు. అరబ్బులునూకారు, పర్షియనులునూకారు, పడమటి ఆసియాలో మంచి నాగరికతనందిన ముస్లిములునూకారు వచ్చినది. నాగరికతనుబట్టిచూస్తే ఈఆఫ్ఘనులు, హిందూదేశస్థులకన్న వెనుకబడివుండిరి. కాని వారు చురుకుగావుండిరి. అప్పటి ఇండియాలోని ప్రజలకంటె ఎక్కువ శక్తితోవుండిరి. ఇండియా పాతమార్గాల్లో చిక్కుకొనిపోయివున్నది. అది ముందుకు పోవడంలేదు. మారడంలేదు. పాతపద్ధతులను గట్టిగా పట్టుకున్నదేగాని ఆపద్ధతులను బాగుచెయ్యడానికి ప్రయత్నించడం లేదు. యుద్ధపద్ధతులలోకూడా ఇండియా వెనుకబడివుండెను. ఇంతకన్న ఆఫ్ఘనులు కట్టుదిట్టంగా వుండిరి. కాబట్టి యెంతటి ధైర్యసాహసాలున్నా ముస్లిము దండయాత్రకు ఇండియా తలయొగ్గవలసి వచ్చింది.

మొట్టమొదట ఈ మస్లిములు భయంకరముగా, క్రూరముగా వుండేవారు. వారు కర్కశదేశమునుండి వచ్చారు. మార్దవమంటే అక్కడ అట్టే మెచ్చుకోరు. ఇంతేకాదు, వారు తాము జయించిన కొత్త దేశంలో వుండిరి. వారి చుట్టుపట్లవారందరూ వారికి శత్రువులే. వారు ఏక్షణంలోనైనా తిరుగబడవచ్చును. తిరుగబడుదురను భయము నిత్యమూ వుండెను. అట్టిభయమే క్రూరత్వానికీ, భయంకరత్వానికీ బీజము. ప్రజలను భీతావహులనుజేసి అణచిపెట్టడానికి హత్యలు జరుగుతుండేవి. మతము పేరుచెప్పి ఒక హిందువును ఒక మస్లిము చంపడంకాదిది, పరదేశి ఒకడు దేశమును జయించి అచ్చటి ప్రజలను బెదిరించి అణచిపెట్టుటకు చేసిన హత్యలివి. ఈక్రూరకృత్యాలను మతానికి ముడిపెట్టడం సర్వసామాన్యంగా జరుగుతోంది. కాని అదిసత్యం కాదు. ఒక్కొక్కప్పుడు మతాన్ని సాకుగా పెట్టుకోవడం కద్దుకాని నిజమైన కారణాలు రాజకీయమైనవీ, సాంఘికమైనవీ. ఇండియాపై దండెత్తిన మధ్యఆసియా ప్రజలు స్వదేశంలోకూడా క్రూరులే. ఇస్లాం మతము పుచ్చుకోవడానికి ముందునుంచీ వారట్లాంటివారే. ఒకదేశము నూతనముగా జయించి దానిని అదుపుఆజ్ఞలలో పెట్టుకోడానికి ఒక్కటే మార్గం వారెరుగుదురు.—అది ప్రజలలో భీతి సృష్టించడమే.

క్రమేణా ఇండియా ఈ భయంకరయోధులను సాదుచేసి వారిని నాగరీకులనుగా చెయ్యడం మొదలుపెట్టింది. క్రమేణా వారుజయేచ్ఛతో పరదేశమునుంచి వచ్చినవారుగా భావించుకోక భారతీయులుగానే భావించుకొన మొదలుపెట్టారు. కొత్తదేశంలోని పిల్లలను పెండ్లిచేసుకొన్నారు. విజేత, విజితుడు అనేభేదం క్రమంగా తగ్గిపోయింది.

ఈ సందర్భంలో చిత్రమైన ఒకవిషయం చెప్పుతాను. గజినీ మహమ్మదు ఉత్తర హిందూస్థానముకు తెలిసిన విధ్వంసకులలో మేటి. విగ్రహారాధకులను శిక్షించడానికి, ఇస్లాంను రక్షించడానికి అతను పూను

కొన్నట్లు చెప్పుతారు. అతనికింద ఒక హిందువులసైన్యం వుండేది. ఆ హిందూసైన్యానికి అధిపతి తిలక్ అనే పేరుకలవాడు. మహమ్మదు తిలక్‌నూ, అతని సైన్యమునూ గజనీ తీసుకువెళ్ళి, తిరుగుబాటుచేసిన మస్లిములను అణచివేశాడు. దీనినిబట్టి మహమ్మదులక్ష్యము విజయమే నని నీవు గ్రహించగలవు. ఇండియాలో మస్లిముసైనికుల సహాయంతో విగ్రహారాధకులను చంపడానికతడు సిద్ధపడ్డాడు. మధ్య ఆసియాలో హిందూసైనికుల సహాయంతో అతడు మస్లిములను చంపడానికీ సిద్ధపడ్డాడు.

ఇస్లాము ఇండియాను వూపివేసింది. అభివృద్ధిలో పూర్తిగా వెనకబడుతున్న సంఘములో వీర్యమునూ, వృద్ధిపొందవలెననే ఇచ్ఛను అది ప్రవేశపెట్టింది. హిందూకళ క్షీణదశలో వుంది. పునరుక్తితో అనవసరపు వివరములతో అది అలవిగాకుండా వున్నది. ఈకళ ఉత్తరాదిని మస్లిము సంపర్కమువల్ల మార్పుచెందింది. కొత్తకళ వృద్ధిలోకి వచ్చింది. దానిని హిందూ—మస్లిముకళ అనవచ్చు ననుకుంటాను. అది వీర్యవంతంగా, శక్తివంతంగా వున్నది. మస్లిములు కొత్తగా తెచ్చిపెట్టిన నూతనాభిప్రాయములు కారణముగా ప్రాచీన హిందూస్థాన భవననిర్మాణ కుశలులు కొత్తఆవేశమును పొందిరి. మస్లిముమతమూ, జీవితసమస్యల గూర్చిన వారివూహలూ ఆనాటి వాస్తుపద్ధతిలో మార్పులు ప్రవేశపెట్టెను. సరళమైన, ఉదారమైన చిత్రకల్పనకు వారు తిరిగి వచ్చిరి.

మస్లిం దండయాత్ర మొదటిఫలితము ప్రజలు దక్షిణానికి తరలిపోవడము. మహమ్మదు దండయాత్రలూ, హత్యలూ కారణముగా ఉత్తరహిందూస్థానములో ఇస్లాము కిరాతక్రౌర్యమునకూ, వినాశమునకూ పెట్టినదిపేరని ఊహించమొదలుపెట్టారు. కాబట్టి నూతన దండయాత్ర వచ్చినప్పుడు, దానినెవరూ ఆపలేక పోయినప్పుడు, నిపుణులగు

శిల్పులూ, పండితులూ వందలు వందలుగా దక్షిణ ఇండియాకు తరలి పోయారు. ఆర్యసంస్కృతి దక్షిణాదిని వృద్ధిజెందడాని కిదికారణమైనది.

దక్షిణాదిని గురించి ఇదివరలో నీకు చెప్పియుంటిని. 6 వ శతాబ్ది మొదలుకొని 200 సంవత్సరములవరకూ చాళుక్యులు పశ్చిమము నందూ మధ్యదేశములోనూ (మహారాష్ట్రదేశము) ప్రబలులై వుండిరని చెప్పియుంటిని. అప్పటి పాలకుడు అగు పులకేశి II ని యువాన్ చ్వాంగ్ దర్శించెను. తరువాత రాష్ట్రకూటులు వచ్చిరి. వీరు చాళుక్యులను ఓడించి మరి 200 సంవత్సరముల కాలము దక్షిణమును పాలించిరి (ఎనిమిది శతాబ్దిమొదలు సుమారు పదవశతాబ్దాంతంవరకు). ఈ రాష్ట్రకూటులు, సింధుదేశమును పాలించు అరబ్బీ ప్రభువులతో సఖ్యముగా నుండిరి. అరబ్బీ వర్తకులూ, యాత్రికులూ వీరిని దర్శించ వచ్చెడివారు. అందొక యాత్రికుడు తాను చూచిన విషయములు వ్రాసి వుంచాడు. నాటి (9 వ శతాబ్ది) రాష్ట్రకూట పాలకుడు ప్రపంచమందలి నలుగురు మహారాజులలో ఒక్కడని అతడు చెప్పుతున్నాడు. అతడి ఊహలో మిగత ముగ్గురు ఎవరనగా,—బాగ్దాదుకాలీఫు, చీనా చక్రవర్తి, రూమ్ అనగా కాంస్టాంటినోపులు చక్రవర్తి. ఆకాలమునాడు ఆసియాలో యిట్టి అభిప్రాయము ప్రచారములో వుండి వుండవచ్చును. ఒక అరబ్బీ యాత్రికుడు, బాగ్దాదు మహోచ్ఛదశలో వెలుగుతూన్న కాలమునాటి కాలీఫు సామ్రాజ్యమును రాష్ట్రకూటుల రాజ్యముతో పోల్చాడంటే, మహారాష్ట్రరాజ్యము చాలాబలముగా, ప్రబలముగా వుండివుండవలెను.

పదవ శతాబ్దిలో ఈ రాష్ట్రకూటుల స్థానమును చాళుక్యులాక్రమించారు. వీరు 200 సంవత్సరాలుపైగా (క్రీ. శ. 1190 వరకు) రాజ్యపదవిలో వున్నారు. వీరిలో ఒక చాళుక్యరాజును గురించి పెద్ద పదమొకటి వున్నది. స్వయంవర మహోత్సవములో ఇతని భార్య యితనిని వరించడం ఇందలికథ. ప్రాచీన ఆర్యుల ఆచారమైన ఈ స్వయంవరము ఇంతకాలము నిలిచివుండడము చిత్రమే.

ఇంకా ఇండియాకు దక్షిణముగాను, తూర్పుగాను తమిళదేశమున్నది. ఇచ్చట 3-వ శతాబ్దినుండి తొమ్మిదవ శతాబ్దివరకూ, సుమారు 600 సంవత్సరాలకాలము పల్లవులు రాజ్యముచేశారు. 200 సంవత్సరములపాటు, అనగా 6-వ శతాబ్దిమధ్యనుండీ వారు దక్షిణమున దొరతనము చేశారు. ఈపల్లవులే మలేసియాకూ, తూర్పుద్వీపములకూ అభినివేశార్థము (Colonisation) యాత్రలు పంపారు—జ్ఞాపకమున్నదా? పల్లవరాజ్యానికి రాజధాని కాంచీపట్టణము. దీనినే కంజీవరం అంటారు. అప్పుడది చాలా అందమైన పట్టణము. నేడుకూడ దాని నగరనిర్మాణ పద్ధతి (Town planning) ప్రశస్తముగా నున్నది.

పదవశతాబ్దము తొలిరోజులలో పల్లవుల స్థానమును సాహసులగు చోళులాక్రమించిరి. రాజరాజ, రాజేంద్రుల సామ్రాజ్యము గురించిన్నీ, వారుగొప్ప నావికాదళములను నిర్మించి, సింహళము, బర్మా, బెంగాలు దేశముల జయించుటకు వెళ్ళినట్లున్నూ నేను చెప్పియున్నాను. ఇంతకన్న ముచ్చటగొలిపే సంగతి వారు గ్రామపంచాయతీలను యెన్నుకొనేపద్ధతి. ఈపద్ధతి క్రిందనుంచి పైకి నిర్మించబడింది. గ్రామసంఘములు వేర్వేరు రకములు పనులు చూచుకొనుటకై అనేక కమిటీలను యెన్నుకొనుచుండిరి. మండల సంఘములనుకూడా యెన్నుకొనుచుండిరి. అనేక మండలములుకలిసి ఒక రాష్ట్రము అగుచుండేది. ప్రాచీన ఆర్యుల రాజ్యపరిపాలనాపద్ధతికి, గ్రామపంచాయతీలు ఆయువుపట్లు కాబట్టే వీటినిగురించి నేను తరుచు ఈజాబుల్లో గట్టిగా చెప్పుతూ వుంటాను.

ఉత్తర హిందూస్థానముపై ఆఫ్ఘనులు దండయాత్రలు సాగించే కాలంలో చోళులు దక్షిణ ఇండియాను పాలిస్తూవున్నారు. కాని త్వరలోనే వారు క్షీణదశకువచ్చారు. వారికిలొంగివున్న ఒక చిన్నరాజ్యము స్వతంత్రమై ప్రబలమైనది. ఇది పాండ్యరాజ్యము. దీనికి మధుర

రాజధాని. కల్యాణము రేవుపట్టణము. వెనీసునుండి ఒకప్రసిద్ధ యాత్రికుడు, మార్కోపోలో అను పేరుగలవాడు, (ఇతనిని గురించి ముందుముందు యెక్కువగా చెప్పుతాను) కల్యాణరేవుపట్టణమును 1288 లోను 1293 లోను రెండుమార్లు దర్శించాడు. అతడా పట్టణాన్ని "వైభవోపేతమైన మహానగరమ"ని వర్ణించాడు. అరేబియా, చీనా దేశాలనుంచి వచ్చిన ఓడలతో అది నిండియున్నది. వ్యాపారము బాహాటంగా అక్కడ జరుగుతోంది. మార్కో చీనానుంచి ఓడలో వచ్చాడు.

"సాలెగూళ్ళవలె" కనిపించే మిక్కిలి చక్కని మస్లినులు ఇండియా తూర్పుతీరాన్ని చేసేవారని అతడు చెప్పుతున్నాడు. మద్రాసుకు ఉత్తరముసంమా, తూర్పుతీరమందూవున్న తెనుగుదేశమును రుద్రమణిదేవి * యను రాణీ పాలించుచున్నట్లు అతడు చెప్పెను. ఈమె 40 సంవత్సరములు రాజ్యము చేసినది. మార్కో ఈమెనెంతో ప్రశంసించెను.

మార్కో వేరొక విశేషాన్ని చెప్పాడు. అరేబియా. పరిషియా దేశములనుంచి దక్షిణ ఇండియాకు అధికసంఖ్య గుఱ్ఱములను దిగుమతి చేశేవారట. గుఱ్ఱములను పెంచుటకు దక్షిణ ఇండియా శీతోష్ణస్థితి అనుకూలముకాదు. దండయాత్రలుచేసిన మస్లిములు చక్కగా యుద్ధము చేయుటకొక కారణము వారికి మంచిగుఱ్ఱము లుండడమే అని చెప్పుతారు. ఆసియాలో గుఱ్ఱములను పెంచే ప్రదేశములన్నీ వారిఅధీనంలోనే వుండెను.

చోళులు క్షీణించినప్పుడు, 13-వ శతాబ్దిలో, పాండ్యరాజ్యమే నాయకత్వమును వహించిన తమిళరాజ్యము. పధ్నాలుగో శతాబ్ది మొదటిభాగములో (1310 లో) మస్లిం దండయాత్ర దక్షిణమున

* రుద్రమ దేవి.

ప్రవేశించింది. అది పాండ్యరాజ్యములో ప్రవేశించి దానిని చీల్చింది. అందువల్ల నది శీఘ్రముగా పతనమైనది.

ఈ జాబులో దక్షిణ హిందూదేశచరిత్ర నేను పరామర్శ చేశాను. వెనుకచెప్పిన విషయాలే మళ్ళీ చెప్పియుండవచ్చు. కాని ఈవిషయము కొంచెం ఖంగారు పెడుతుంది. పల్లవులు, చాళుక్యులు, చోళులు మున్నగు పేర్లు కలగాపులగమై భ్రాంతికలిగిస్తాయి. అయినా సమగ్రంగా చూస్తే సమస్తమూ నీవుఅర్థంచేసుకోవచ్చు. అశోకుడు ఇండియాసంతాను (అడుగున ఒకచిన్న తునుక మినహాగా) ఆఫ్ఘనిస్థానాన్ని, మధ్య ఆసియాలో కొంతభాగాన్ని పాలించాడు. అతని తరువాత దక్షిణాన్ని ఆంధ్రరాజ్యము తలయెత్తింది. అది దక్కనంతా వ్యాపించింది. 400 సంవత్సరములు నిలిచింది. ఉత్తరాన్ని కుషాణులు పాలిమేర సామ్రాజ్యము ఏలుతూన్నకాలంలో ఇది జరిగింది. తెలుగు ఆంధ్రులు క్షీణించుచుండగా తూర్పుతీరాన్ని, దక్షిణాన్ని తమిళ పల్లవులు తలయెత్తారు. చాలాకాలం వారు రాజ్యంచేశారు. మలేసియాలో వారు అధినివేశా లేర్పరచుకొన్నారు. 600 సంవత్సరములు వారేలిన పిమ్మట చోళులు వచ్చారు. వారు దూరదేశాలు జయించారు. నౌకాదళముల పెట్టుకొని నిరాఘాటంగా సముద్రాలమీద సంచారంచేశారు. 300 సంవత్సరములు కడచిన పిమ్మట వారు రంగంనుంచి తప్పుకున్నారు. అప్పుడు పాండ్యరాజ్యము ప్రసన్నతికి వచ్చింది. మధురానగరము సంస్కృతికి కేంద్రమయింది. కల్యాణిరేవుపట్టణము గొప్పది. ఓడలతో ప్రజలతో కిటకిటలాడుచుండేది. దూరదేశములతో దానికి సంబంధం వుండేది.

దక్షిణదేశమునకు తూర్పుదేశమునకూ సంబంధించిన చరిత్ర యిది. ఇక పడమర మహారాష్ట్ర దేశములో చాళుక్యులున్నారు. రాష్ట్రకూటులున్నారు. మళ్ళీ చాళుక్యులు వచ్చారు.

ఇవన్నీ వట్టి పేర్లుమాత్రమే. కాని ఈరాజ్యములు యెంతెంత దీర్ఘ కాలం నిలిచాయో, నాగరికతలో ఎటువంటి ఔన్నత్యాన్ని పుట్టాయో ఆలోచించు. వారిలో ఒక అతఃశక్తి ఉన్నది. దాని ప్రభావము వల్లనేవారికి స్థిరత్వము శాంతికలిగియుండవచ్చును. యూరోపురాజ్యములకీ స్థిరత్వమూ శక్తీలేవు. కాని సంఘ కట్టుబాట్లు నియతకాలాన్ని మించి నిలిచాయి. అందుచే స్థిరత్వము చెడినది. పద్నాలుగో శతాబ్ద మొదటిభాగంలో ముస్లిం సేనలు దక్షిణముగా నడిచినప్పుడు ఈ స్థిరత్వము తల క్రిందులైనది.

## 66

# ఢిల్లీలోని బానిసరాజులు

జూన్ 24, 1932.

గజినీ మహమ్మదును గురించి నీకు చెప్పాను. మహమ్మదు కోరికమీద షానామా అనే గ్రంథాన్ని పరిషియన భాషలో వ్రాసిన ఫిరదౌసి కవినిగురించి కూడా కొంత చెప్పాను. మహమ్మదుతోకూడా పంజాబుకు వచ్చిన పేరొక ప్రసిద్ధిపురుషుణ్ణి గురించి నీకింకా చెప్పలేదు. ఇతడు ఆల్బురూని అనువాడు. ఇతడు చదువుకున్నవాడు. పండితుడు. ఆనాటి క్రూరులూ, మూఢవిశ్వాసము గల వారూ అగు యుద్ధవీరులవంటి వాడుకాడితడు. అతడు హిందూదేశమంతా తిరిగాడు. నూతన దేశమును, తత్ప్రజలను అర్థం చేసుకోవాలని ప్రయత్నించాడు. హిందువుల దృక్పథము తెలిసికొనవలెననే ఆకాంక్షతో హిందువుల ప్రధానగ్రంథముల చదవడానికని అతడు సంస్కృతము నేర్చుకొన్నాడు. హిందూ తత్త్వశాస్త్రమును అతడు పఠించాడు. ఇక్కడ బోధించే శాస్త్రములను కళలను తెలిసికొన్నాడు. భగవద్గీత అతని అభిమానగ్రంథమైనది. అతడు దక్షిణమునకు, చోళ రాజ్యమును, చూడడానికి వెళ్లాడు.

అచ్చట గొప్ప పౌరుదల పద్ధతిచూచి అత్యాశ్చర్యము చెందాడు. అతడు ఇండియాలో, చూచిన విషయములన్నీ, గ్రంథరూపముగా వ్రాసి పెట్టాడు. ప్రాచీన కాలమునాటి యాత్రా గ్రంథాలలో ఇది ఒకగొప్ప గ్రంథము. విధ్వంసము, హత్యలు, అసహనము తాండవ మాడు తుండగా ఈతడు, ఈ పండితుడు ఓపికతో పరిశీలిస్తూ, జ్ఞానమును సంపాదిస్తూ, సత్యమును తెలిసికో ప్రయత్నిస్తూ ప్రముఖుడనిపించు కున్నాడు.

పృథ్వీరాజు నోడించిన ఆఫ్ఘన్ దేశీయుడు సహాబ్ ఉద్దీన్ తరువాత ఢిల్లీలో సుల్తానులు వరుసగా గద్దె ఎక్కారి. వారికి బానిస రాజు లనిపేరు. వీరిలో మొదటివాడు కుతుబ్ ఉద్దీన్. ఇతడు సహాబ్ ఉద్దీన్ వద్ద బానిసగానుండెను. బానిసలు సైతము ఉన్నతస్థానము లందగలరు కదా! అతడు ఢిల్లీలో మొట్టమొదటి సుల్తానయ్యేను. అతని తరువాత వచ్చిన కొందరు సుల్తానులు కూడ తొలుత బానిసలే. అందువల్ల దీనికి సుల్తాను రాజ వంశమని పేరు వచ్చింది. వీరందరూ క్రూరులే; దేశములను జయిస్తూ, ఇండ్లనూ భాండాగారములనూ వారు నాశనం చేసే వారు. జనులను భీతావహులను చేసేవారు. భవన నిర్మాణమంటే వారి కిష్టమే. పెద్ద భవనములంటే వారికిష్టము. కుతుబ్-ఉద్దీన్ కుతుబ్ మైనరును కట్టప్రారంభించాడు. నీ వెరుగుదువుకదా ఢిల్లీ సమీపమందున్న పెద్దస్తంభమును **(Tower)**. అతని తరువాతవచ్చిన ఇల్టూట్మిష్ **(Iltutmish)** దానిని పూర్తిచేసి దాని సమీపాన్ని అందమైన కొన్ని ఆర్చీలు **(arches)** కట్టాడు. అవి నేటికీ ఉన్నవి. ఇవి కట్టడానికి కావలసిన సామానంతా పాత హిందూస్థాన భవనములనుంచి—అందుముఖ్యముగా దేవాలయములనుంచి గ్రహించారు. ఇవి కట్టే నిర్మాణ ప్రవీణులందరూ భారతీయులే. కాని, నే నిదివరలో చెప్పాను—మస్లిములు తెచ్చిన నూతన అభిప్రాయములు వారిలో మార్పులు కలిగించాయి.

గజినీ మహమ్మదు మొదలుకొని ఇండియాపై దండెత్తిన ప్రతి విదేశీయుడూ తనతోకూడా హిందూదేశ శిల్పులనూ, వాస్తు నిర్మాణ ప్రవీణులనూ అనేక మందిని, స్వదేశమునకు తీసుకువెళ్లారు. మధ్య ఆసియాలో ఈ విధముగా హిందూవాస్తుపద్ధతి వ్యాపించింది.

బీహారు, బెంగాలుదేశములను మిక్కిలి సులభముగా ఆఫ్ఘనులు జయించారు. ఆఫ్ఘనులు సాహసులు. హఠాత్తుగా ఈదేశములమీద పడ్డారు. సాహసము ఎప్పటికైనా లాభించేదే. కార్టెజ్, పిజ్జారోలు అమెరికాలో విజయములు సాధించటము ఎంత ఆశ్చర్యకరమో ఈ బెంగాలు విజయముకూడా అంత ఆశ్చర్యకరము.

ఇల్‌టూట్‌మిష్ పరిపాలనాకాలమున (1211 మొదలు 1236 వరకూ) ఇండియా పొలిమేర ప్రాంతములమీద భయంకరమైన కారు మేఘము క్రమ్ముకొని వుండెను. చెంగిజ్‌ఖాను నాయకత్వమునసుండు మంగోలులే ఈకారుమేఘము. శత్రువును తరుముకొంటూ అతడు సింధునదివరకూవచ్చి అక్కడ ఆగిపోయాడు. అతనివల్లకలిగే ప్రమాదం నుంచి ఇండియా తప్పించుకొన్నది. 200 సంవత్సరముల పిమ్మట అతెగవాడే, తైమూరనువాడు ఇండియామీదపడి హత్యలు చేశాడు. దేశాన్నిధ్వంసము చేశాడు. చెంగిజ్‌ఖాన్ ఇండియాకు రాకపోయినా మంగోలులు అనేకులు ఉండుండీ ఇండియామీద దండయాత్రలు సాగిస్తూ వుండేవారు. లాహోరువరకూ కూడా వాళ్లు వచ్చారు. ప్రజలను భీతావహులనుచేశారు. సుల్తానులుకూడా వారినిచూచి భయపడిపోయి వాళ్లకు లంచాలిచ్చి పంపించివేశారు. వారిలో అనేకవేలమంది పంజాబులో స్థిరనివాసా లేర్పాటు చేసుకున్నారు.

సుల్తానులలో రజియా అనే ఒకస్త్రీ వుండేది. ఆమె ఇల్‌టూట్‌మిష్ కూతురు. ఆమె సమర్థురాలైనట్లూ, ధైర్యముతో పోరాడగలిగే దనిన్నీ తోస్తుంది. కాని క్రూరులగు ఆఫ్ఘను కులీనులవల్లా, పంజాబుపై

దండయాత్రలుచేసిన అంతకన్న క్రూరులైన మంగోలులవల్లా చాలా కష్టపడింది.

1290 సంవత్సరమునాటికి బానిసరాజుల ప్రభుత్వమంతరించింది. వెంటనే అలాఉద్దీన్ ఖిల్జీ సింహాసనమధిష్టించాడు. తన మేనమామను (తనమామగారుకూడా) హత్యచేసి ఇట్టి శాంతపద్ధతితో నతడు సింహాసనము సంపాదించాడు. ఈపని చేసినపిమ్మట, తనకు ప్రతికక్షులని తోచిన మస్లిము కులీనులనందరినీ హత్య చేయించాడు. మంగోలులు తనపై కుట్రపన్నుచున్నారని భయపడి తనరాజ్యములోనున్న మంగోలుల నందరినీ చంపించాడు. "ఆజాతివాళ్ళలో ఒక్కరూ భూమిమీద సజీవులై వుండకూడద"ని అట్లా చేయించాడట. నిరపరాధులైన మంగోలులు 20,000 లేదా 30,000 మంది ఈవిధంగా హత్య చేయబడ్డారు.

హత్యలను గురించిన ఈవిషయములు రుచికరముగా నుండవు, నిజమే. చరిత్రయొక్క విశాలదృక్పథమున కివి అంత ముఖ్యము కాదుకూడా. అయినా ఆకాలమున ఉత్తరహిందూస్థానమందలి పరిస్థితులు అనాగరికముగాను, భద్రతలేకుండాను ఉన్నట్లు గ్రహించడానికి ఇవి సహకారంగా ఉంటాయి. కొంతవరకు అనాగరికము ఆకాలములో తల చూపింది. ఇస్లాము ఇండియాకు అభివృద్ధిని కొంత చేకూర్చింది. మస్లిము ఆఫ్ఘనులు ఇండియాకు అనాగరికతను తెచ్చిపెట్టారు. పలువురు ఈరెండువిషయములూ కలిపివేస్తారు. కాని వాటిభేదమును గమనించుట ముఖ్యము.

మిగిలిన వారివలెనే అలాఉద్దీన్ సహనము లేనివాడు. కాని మధ్యఆసియానుంచి వచ్చిన పాలకులదృష్టిలో ఇప్పుడు భేదము పొడ చూపుచున్నది. వారు ఇండియాను స్వదేశముగా భావించుటకు మొదలు

పెట్టారు. అలాఉద్దీన్ హిందూస్త్రీని వివాహం చేసుకొన్నాడు. అతని కొడుకుకూడ హిందూస్త్రీనే పెండ్లాడాడు.

అలాఉద్దీన్ పాలనమున రాజ్యాంగపద్ధతిని సమర్థముగా పెట్టుకోవలెననే ప్రయత్నములు జరిగినట్లున్నవి. సైన్యములు నడచిపోవుట కనుకూలముగా వుండుటకై రాచబాటలు సక్రమంగా ఉంచబడ్డవి. అలాఉద్దీన్ సైన్యముపట్ల ప్రత్యేకజాగ్రత్త తీసికొనుచుండెను. సైన్యము నతడు చాలా శక్తివంతము చేసెను. దానితో అతడు గుజరాతును, దక్షిణహిందూస్థానములో చాలాభాగమును జయించెను. దక్షిణము నుంచి అతని సేనానాయకుడు ధనము నమితముగా తెచ్చెను. అతడు 50,000 మణుగుల బంగారమూ, రత్నములూ, ముత్యములూ అమితముగానూ, 20,000 గుఱ్ఱములూ, 312 ఏనుగులు తెచ్చాడని చెప్పుతారు.

వీరగాథలకూ క్షాత్రధర్మ పరిపాలనమునకూ చిత్తూరునిలయము. పరాక్రమోపేతము. కాని అది పాతపద్ధతులను వదలిపెట్టలేదు. పాతపడి తుప్పుపట్టిన యుద్ధపద్ధతులనే అది నమ్మియుండెను. కాన సమర్థమగు అలాఉద్దీన్ సైన్యమున కది లొంగిపోయెను. 1303 సంవత్సరమున చిత్తూరు కొల్లగొట్టబడెను. ఇది జరుగుటకు పూర్వము చిత్తూరు కోటలోని పురుషులును, స్త్రీలును ప్రాచీనాచారము ప్రకారము జౌహారు చేసిరి. ఇది భయంకర కర్మ. పరాజయము తప్పదన్నప్పుడు, మార్గాంతరము లేనప్పుడు, పురుషులు రణభూమిలో పోరాడుచు చనిపోవుటయును, స్త్రీలు చితినెక్కి దగ్ధమైపోవుటయును మంచిదని అట్లు చేయుచుండిరి. ఇది ముఖ్యముగా స్త్రీలవిషయమున ఎంతటి దారుణకర్మము! స్త్రీలుకూడా ఖడ్గముచేబూని యుద్ధభూమికివెళ్ళి అక్కడ పోరాడుచూ చనిపోయినట్లయితే ఇంతకన్న బాగావుండేది. ఆరోజులలో పరాజయమన్నప్పుడు బానిసత్వమూ, పరాభవమూ అన్నమాట. ఇంతకన్న చావు శ్రేష్ఠముకాదా?

ఈకాలములో దేశప్రజలు, అనగా హిందువులు మెల్లగా ఇస్లాం మతములోనికి త్రిప్పబడుచుండిరి. ఈకార్యము తొందరగా జరుగలేదు. ఇస్లాం తమకు నచ్చింది కాబట్టి కొందరు తమ మతము మార్చుకొన్నారు. భయపడి కొందరు మతాంతరులైనారు. జయించినవారి పక్షమున చేరుట సహజము కాబట్టి కొందరు మతము తీసుకున్నారు. కాని మతము మార్చుకొనడమునకు ప్రధానకారణము ఆర్థికస్థితికి సంబంధించినది. ముస్లిములు కానివారు ఒకప్రత్యేకపన్ను—జిజియా అను తలపన్ను—చెల్లించవలసి యుండెను. ఇది బీదలకు భారముగా ఉండెను. ఈపన్ను తప్పించుకోడానికి పలువురు మతము మార్చుకొనేవారు. పై తరగతుల ప్రజలలో రాజానుగ్రహము సంపాదించవలెననీ, గొప్ప ఉద్యోగములు సంపాదించవలెననీ కోరిక ప్రబలముగా ఉండెను. మలీకాఫరు అనే అలాఉద్దీన్ గొప్పసేనాని, దక్షిణదేశమును జయించినవాడు, మతాంతరుడైన హిందువే.

నేను వేరొక ఢిల్లీసుల్తానును గురించి నీకు చెప్పవలెను. ఇతడు అసామాన్యుడు. పేరు మహమ్మద్ బిన్‌తుఘ్లకు. పర్షియన్, అరబ్బీ భాషలలో అతడు గట్టిపరిశ్రమచేసిన పండితుడు. సకలవిద్యలూనేర్చినవాడు. అతడు తత్త్వశాస్త్రమును, తర్కమును, గ్రీకు తత్వశాస్త్రమును కూడ చదివినవాడు. గణితశాస్త్రము కొంత అతనికి తెలుసును. విజ్ఞానశాస్త్రము వైద్యముకూడా తెలుసును. అతడు ధైర్యశాలి. ఆకాలమున ఇంతటి చదువునేర్చిన వాడున్నాడా అని అనిపించిన అద్భుతుడు. అయినప్పటికీ, ఈఆదర్శపురుషుడు క్రౌర్యమున రాక్షసుడు. వట్టిపిచ్చివాడేమోనని తోచును! తన తండ్రినిచంపి అతడు గద్దెయెక్కెను. పర్షియా, చీనా దేశముల జయించవలెననే పిచ్చిఊహలతడు పెట్టుకొనెను. అట్టి ఊహలు విఫలమగుట సహజమే. ఇతడు చేసిన ఘనకార్యములలో మిక్కిలి ప్రసిద్ధిమైనది తన సొంత రాజధానియగు ఢిల్లీని పాడుపెట్టుట.

ఇందుకు కారణమేమనగా నగరములో కొందరు, అతని పరిపాలనా పద్ధతిని విమర్శిస్తూ ఆకాశరామన్న ప్రకటనలు చేశారట. రాజధాని ఢిల్లీనుంచి దక్షిణముననున్న (నేటి హైద్రాబాదు సంస్థానములో) దేవగిరికి మార్చ వలసిందని అతడు ఉత్తరువుచేశాడు. దీనికే దౌలతాబాదు అనుపేరు అతడు పెట్టాడు. ఇండ్ల యజమానులకు అతడు కొంత నష్టపరిహార మిచ్చాడు. నగరములో ప్రతియొక్కడున్నూ, తప్పకుండా మూడు రోజులలో నగరమును వదలిపెట్టవలసినదని అతడు ఉత్తరువు జారీచేశాడు.

చాలామంది నగరాన్ని వదలివేశారు. కొందరు దాక్కొన్నారు. దొరికినప్పుడు అట్టివారు క్రూరముగా దండింపబడ్డారు. అందొక్కడు గుడ్డివాడు. ఒకడు పక్షవాతంతో బాధపడుతున్నాడు. అయినాసరే! ఢిల్లీనుంచి దౌలతాబాదుకు 40 రోజుల ప్రయాణం. ఈ ప్రయాణములో ప్రజలుపడ్డ దుర్భరకష్టములు ఊహించుకోవలసిందే. తోవలో ఎందరు మరణించారో!

ఇక ఢిల్లీ ఏమైనట్లు? రెండు సంవత్సరములైనపిమ్మట ఢిల్లీలో మరల ప్రజలను ప్రవేశపెట్టడానికి అతడు ప్రయత్నించాడు. కాని సఫలుడు కాలేదు. వెనుక ఇతడు ఢిల్లీని "పూర్తిగా ఎడారిగా" చేశాడు. ప్రత్యక్షముగా చూచినవాడు చెప్పిన మాటలివి. ఉద్యానవనమును అడవిగా మార్చడం సులభమే. అడవిని ఉద్యానవనం చెయ్యడం సులభంకాదు. ఆఫ్రికా దేశస్థుడైన "మూరు" (Moor) యాత్రికుడు, "ఇబిన్ బట్టుటు" అనువాడు సుల్తానుతోకూడా వుండెను. అతడు ఢిల్లీకి తిరిగివచ్చి ఈవిధముగా చెప్పెను—"ఢిల్లీ ప్రపంచమందలి మహానగర ములలో ఒక్కటి. మేము మొదట ప్రవేశించినప్పు డావిధముగా నుండెను. అది ఇప్పుడు ఖాళీగావుండెను. ప్రజలు దానిని విడిచిపెట్టి పోయిరి. ఉన్న ప్రజాసంఖ్య బహుకొద్ది." 8 లేదా 10 మైళ్ళవరకు

ఢిల్లీ విస్తరించియుండెనని వేరొకటు వర్ణించెను. అందిప్పుడు "సమస్తమూ నాశనము చేయబడెను. పూర్తిగా అది పాడయ్యేను. ఆనగరమందలి ఇండ్లలోగాని, నగరులలోగాని, పేటలలోగాని ఒక కుక్కైనా, ఒకపిల్లి అయినా తిరగడంలేదు."

ఈఉన్మత్తుడు 1351 సంవత్సరము వరకు, 25 సంవత్సరముల పాటు, సుల్తానుగా రాజ్యముచేసెను. తమ పాలకులలోని దుర్మార్గము, క్రౌర్యము, అసమర్థత ప్రజలెట్లు సహించారో ఆశ్చర్యకరంగా వుంటుంది. ప్రజలంత దాసులై వున్నప్పటికీ మహమ్మదు బిన్ తుఘ్లక్ తన సామ్రాజ్యమును తానే విచ్ఛిత్తి చేసుకున్నాడు. అతడి పిచ్చి యోచనలవల్లనూ, పన్నులు దుర్భరముగా వుండుటవల్లనూ దేశము భ్రష్టమైనది. రాజ్యములో కాటకములు ప్రవేశించాయి. చివరకు తిరుగుబాట్లుకూడా వచ్చాయి. అతని జీవితకాలంలోనే, 1340 సంవత్సరం మొదలుకొని, సామ్రాజ్యములో పెద్దభాగాలు స్వతంత్రమయినవి. బెంగాలు స్వతంత్రమయినది. దక్షిణమున అనేక రాజ్యములు తల యెత్తినవి. ఇందు ముఖ్యముగా పేర్కొనదగ్గది హిందూరాజ్యమైన విజయనగరము. అది 1336 సంవత్సరమున తలయెత్తి పది సంవత్సరములలో దక్షిణాదిలో మిక్కిలి ప్రబలరాజ్యమైనది.

ఢిల్లీ సమీపమున నేడుకూడ తుఘ్లకాబాదు శిధిలములు నీవు చూడవచ్చు. ఈనగరమును నిర్మించినవాడు మహమ్మదు తండ్రి.

## 67

# ఆసియా యూరోపులను చెంగిజ్ ఖాన్ కల్లోల పరుచుట

జూన్ 25, 1932.

ఈమధ్య వ్రాసిన అనేక జాబుల్లో మంగోలులనుగురించి వ్రాశాను. వారుకలిగించినభీతి, చేసిన వినాశనములనుగురించి సూచించాను.

చీనాలో సుంగురాజవంశ వృత్తాంతము మంగోలులు వచ్చుపర్యంతమూ చెప్పితిని. మధ్య ఆసియాలో మంగోలుల ప్రభావంవల్ల పాతవిధాన మంతరించింది. ఇండియాలో బానిసరాజులు వారినుండి తప్పించు కున్నారు. అయినా వారు కొంతగొడవ చేయకపోలేదు. మంగోలియా నుండిదిగిన ఈ దేశద్రిమ్మరులు ఆసియాను లొంగుబాటులోనికి తెచ్చి నట్లుతోస్తుంది. ఆసియామాత్రమేకాదు సగము యూరోపునుకూడా. ఎవరీఅద్భుత మనుష్యులు, హఠాత్తుగా గోచరించి ప్రపంచాన్ని మాన్పడ చేసినవారు? మధ్య ఆసియానుంచివచ్చిన సిధియనులు, హూణులు, తురుష్కులు, తార్తారులు వీరందరూ, ఇదివరలో చరిత్రలో ప్రసిద్ధ పాత్రలు ధరించినవారే. వీరిలోకొందరింకా ప్రముఖులుగానే ఉన్నారు: పడమటి ఆసియాలో సెల్జూకు తురుష్కులూ, ఉత్తర చీనాలోను ఇతర దేశములలోను ఉన్న తార్తారులూ. కాని మంగోలులు ఇంతవరకూ చేసిన దేమీలేదు. పశ్చిమ ఆసియాలో ఎవరూవీరిని గురించి అట్టే తెలుసు కున్నవారులేరని తోస్తుంది. మంగోలియాలో అనేక చిల్లర తెగలకు వీరు చెందిఉన్నారు. వీరు, ఉత్తరచీనాను జయించిన కిన్నుతార్తారులకు లోబడి ఉండిరి.

ఉన్నట్లుండి వారు ప్రబలులైనట్లుతోస్తుంది. చెదిరిపోయినవారి తెగలుచేరి ఒకేఒక్క నాయకుణ్ణి ఎన్నుకున్నారు. అతడుగొప్ప ఖాన్. అతడు చెప్పినమాట వింటామనీ, భక్తితో ఉంటామనీ వారంతా శపథం చేశారు. అతని నాయకత్వంకింద వారు పీకింగ్‌కుకదలివెళ్లి కిన్నుల సామ్రాజ్యాన్ని తుదముట్టించారు. పశ్చిమదిక్కుగా వారువెళ్లి తోవలో ఉన్న గొప్పరాజ్యములను తుడిచివేశారు. వారు రష్యాకువెళ్లి దానిని అణచివేశారు. పిమ్మట కొన్నాళ్లకువారు బాగ్దాదునూ దానిసామ్రాజ్యాన్నీ పూర్తిగానాశనంచేశారు. పోలెండుకున్నూ, మధ్య యూరోపువరకున్నూ వెళ్లారు. వారిని ఆపేవారెవరూ లేకపోయారు. అదృష్టవశాత్తూ ఇండియా

మాత్రం తప్పించుకొంది. ఉబికిన ఈ అగ్నిపర్వతాన్ని చూచి ఆసియా యూరోపులలోని ప్రజలు ఎంతగా దిగ్భ్రమచెందారో ఊహించుకోవచ్చు. ఇది దేశానికి తటస్థించిన మహోపద్రవం. ఇది భూకంపము. దానిముందు మానవుడేమి చేయగలడు ?

మంగోలియానుంచివచ్చిన ఈమంగోలులు పురుషులూ, స్త్రీలూ దృఢకాయులు. కష్టజీవనానికి అలవాటుపడ్డవారు. ఉత్తరఆసియాలోని విశాలమగు స్టెప్పీలలో (Steppes) గూడారములు వేసుకొని నివసిస్తూ ఉండేవారు. ఎంతబలవంతులైనా, ఎంతటి కష్టజీవనాని కలవడ్డవాళ్లయినా తగిన నాయకుడులేకుంటే లాభములేదు. వారిలో ఒక నాయకుడు ఉదయించాడు. అతడు అసాధారణ సామర్థ్యముకలవాడు. ఇతనినే చెంగిజ్ఖాన్ అంటారు. (గెంఘిజ్, జెంగిజ్, జెంఘిజ్ఖాన్—అని అనేకవిధాల వ్రాస్తారు). అతడు క్రీ. వె. 1155-లో పుట్టెను. అతని అసలుపేరు టిమూచిన్. అతని తండ్రి అతనిబాల్యాన్నే మరణించాడు. అతనిపేరు ఏసుగై—బగటూర్. మంగోలుకులీనులకు ఇష్టమైనపేరు బగటూర్—అనగా వీరుడుఅని. ఉర్దూలోని బహదూరు శబ్దము నుండియే వచ్చియుండవచ్చును.

అతడు పదేళ్లచిన్నపిల్లవాడు. సహాయం చేసేవారెవరూలేరు. అతడు శ్రమపడి శ్రమపడి అభివృద్ధిలోకివచ్చాడు. ప్రయోజకుడయాడు. క్రమక్రమముగా అతడు ముందుకువచ్చాడు. చివరకు గొప్పమంగోలు సమావేశములో—దానిపేరు "కురుల్తాయి"—అతడు గొప్పఖానుగా, లేదా కాగన్‌గా లేదా చక్రవర్తిగా ఎన్నుకోబడ్డాడు. కొద్ది సంవత్సరములకు ముందు అతనికి చెంగిజ్ అనేపేరుఇచ్చారు.

13 శతాబ్దిలో వ్రాయబడి, 14 వ శతాబ్దిలో చీనాలో ప్రకటింపబడిన "మంగోలుజనుల రహస్యచరిత్ర" అను గ్రంథములో ఈఎన్నిక ఇట్లువర్ణింపబడినది—

"కాబట్టి, కంబళీ డేరాలలో నివసించు అన్ని తెగలవారూ ఏకమై ఒకే అధికారముక్రిందకు వచ్చినప్పుడు, లియోపార్డు సంవత్సరములో ఓవన్ నదీ ముఖములవద్ద వారు సమావేశమై, "తొమ్మిదికాళ్ళ" (Nine legs) మీద తెల్ల జెండాను ఎగురవేసి చెంగిజ్‌కు కాగన్ బిరుదును యిచ్చిరి."

గొప్పఖాను లేదా కాగన్ అనుసరికి చెంగిజ్ వయస్సప్పటికే 51 సంవత్సరములు. అతడు పడుచువాడుకాడు. ఈ వయస్సులో చాలామంది నెమ్మదిగా, శాంతిగా వుండాలని కోరుతారు. కాని అతని జైత్రయాత్ర ఇప్పటినుంచే ప్రారంభము. ఇది గమనించవలసిన విషయము. ఎందువల్లనంటే పలువురు ప్రముఖయోధులు వయస్సులో వున్నప్పుడే తమవిజయయాత్రలు సాగించారు. పడుచుతనపు వుత్సాహముతో చెంగిజ్ ఆసియా కడ్డుపడి జయించుకుంటూ పోలేదని దీనినిబట్టి మనము గ్రహించవచ్చు. మధ్యవయస్సులోనున్న ఇతడు మిక్కిలి జాగ్రత్తకలవాడు. ముందు జాగ్రత్త పడేవాడు. బాగా ఆలోచించి, తయారై మరీ అతడు గొప్పకార్యాల్లోకి దిగేవాడు.

మంగోలులు దేశద్రిమ్మరులు. నగరములన్నను, నగరపద్ధతులన్నను వారికికిట్టవు. వారు దేశద్రిమ్మరులు కాబట్టి అనాగరికులని చాలామంది అనుకుంటారు. ఇదిపొరపాటు. నగరవిద్యలు వారికి తెలియని మాట వాస్తవమే. వారు వారి జీవితవిధానమును ఒకపద్ధతిలో వృద్ధి చేసుకొన్నారు. వారికి క్లిష్టమైనసంస్థ (organisation) కద్దు. వారు రణభూమిలో గొప్పవిజయములు సాధించినంటే దానికి కారణము వారధిక సంఖ్యాకులై వుండుటకాదు; వారి క్రమశిక్ష, వారి నిర్మాణపద్ధతీ అందుకు కారణము. అన్నిటికన్న ప్రధానమైనవిషయము చెంగిజ్‌ఖాన్‌యొక్క అప్రతిమాన నాయకత్వము. చరిత్రయంతటిలోనూ, రణవిద్యలో చెంగిజ్ అత్యుత్తమ ప్రతిభాశాలీ, నాయకుడూ, అనడానికి సందేహం లేదు. అతనిముందు అలగ్జాండరూ, సీజరూ అల్పులు. తాను గొప్ప




చెంగిజ్ ;"భగవంతుని చేతికొరడా"

సేనానాయకుడగుటయే కాదు. అతడు తన సేనానులనేకులకు శిక్ష యిచ్చి వారిని గొప్పనాయకులనుగా జేసెను. తమ స్వదేశమునకు వేల కొద్దిమైళ్ళ దూరములోవుండి శత్రువులూ, శత్రుత్వముచూపే ప్రజలూ చుట్టుముట్టియుండగా, తమకంటె అధికసంఖ్య గలవారితో యుద్ధముచేసి విజయాలు వారు సాధించారు.

చెంగిజ్, ఆసియా యూరోపులపై పడ్డప్పుడు వాటి పటములెట్లుండెను. మంగోలియాకు తూర్పుగా దక్షిణముననున్న చీనా చీలిపోయియుండెను. దక్షిణమున దక్షిణ సుంగులు పాలించు సుంగులసామ్రాజ్యముండెను. ఉత్తరమున, పీకింగ్ రాజధానిగా, సుంగులను తరిమివేసిన కిన్నుల (బంగారు తార్తారుల) సామ్రాజ్యముండెను. పడమర గోబీ ఎడారిమీదుగా దానికావల హిసియా (Hsia) లేదా టాంగట్ (Tangut) సామ్రాజ్యముకలదు. ఇది దేశద్రిమ్మరులదే. ఇండియాలో బానిసరాజులు ఢిల్లీలో పరిపాలన సాగించిరని తెలిసికొనియుంటిమి. పర్షియా, మెసపొటేమియాలలోను ఇండియా పొలిమేరలవరకునూ వ్యాపించిన గొప్ప ఖ్వారాజిమ్ లేదా ఖీవాపుస్లిము రాజ్యము, సమరఖండము రాజధానిగా వుండెను. దీనికి పడమరగా సెల్జూకులుండిరి. ఈజిప్టు, పాలస్తీనాలలో సలాదీన్ తరువాతవచ్చిన పాలకులుండిరి. బాగ్దాదు చుట్టుపట్టులను కాలీఫు, సెల్జూకుల రక్షణ కిందనుండి ఏలుచుండెను.

తరువాత వచ్చిన క్రూసేడుల కాలమిది. హోహెన్‌స్టాఫెన్ వంశమునకుచెందిన ఫ్రెడరిక్కు II -'ప్రపంచమున అద్భుతపురుషుడు'- పవిత్ర రోమక సామ్రాజ్యమునకు చక్రవర్తిగా వుండెను. ఇంగ్లాండులో మాగ్నాకార్టా, తదనుతర కాలమిది. ఫ్రాంసులో లూయీ IX రాజు పాలించుచుండెను. ఇతడు క్రూసేడులకువెళ్ళి తురుష్కుల చేజిక్కెను. ఇతనిని విడుదల చేయించుటకు ప్రాణదానభృతి నీయవలసివచ్చెను. తూర్పుయూరోపులో రష్యా రెండు రాజ్యములుగా చీలిపోయెను. అవి

ఉత్తరమున నొవోగోరాడ్, దక్షిణమున కీవ్. రష్యాకును, పవిత్రరోమక సామ్రాజ్యమునకును మధ్య హంగెరీ, పోలెండు లుండెను. కాంస్టాంటినోపులు చుట్టును బైజాంటైను సామ్రాజ్యము వర్ధిల్లుచుండెను.

విజయములు సాధించుటకు చెంగిజ్ జాగ్రత్తగా తయారయ్యెను. తన సైన్యానికి అతడు శిక్షఇచ్చెను. తన గుర్రములకూ, అదనపు గుర్రములకూ శిక్షనిచ్చెను. దేశద్రిమ్మరులకు గుర్రములకంటె ప్రధానమైనదేదీలేదు. తరువాత అతడు తూర్పుగా దండయాత్రవెళ్లి ఉత్తరచీనా మంచూరియాల కిన్ను సామ్రాజ్యమును అంతమందించి పీకింగ్ వశపరుచుకొనెను. కొరియాను లోబరుచుకొనెను. దక్షిణ సుంగులతోనతడు స్నేహముగా ఉన్నట్టుతోచును. అతడు కిన్నులపైకి పోయినప్పుడు వారతనికి సహాయముకూడచేసిరి. కాని అతడువారిమీదకు కూడ రాగలడని వారనుకోలేదు. తరువాత చెంగిజ్ తాన్‌గట్లనుకూడ నిర్జించెను.

ఈవిజయములు సాధించినపిమ్మట చెంగిజ్ విశ్రాంతి తీసుకొనియుండును. పశ్చిమముగా దండయాత్రచేయుట అతనికిష్టము లేనట్టుతోచును. ఖ్వారాజిమ్‌షా(రాజు)తో అతడు స్నేహభావముతో నుండగోరెను. కాని యిట్లుజరుగ వీలులేకపోయింది. లాటిన్‌లో ఒకసామెతఉంది. భగవంతుడు ఎవరినైతే పాడుచేయదలచుకుంటాడో వారికి మొదట పిచ్చిపట్టిస్తాడు. ఖ్వారాజిమ్‌షా ఆత్మవినాశనానికి చేయవలసిందంతా చేసుకున్నాడు. అతని గవర్నరొకడు మంగోలువర్తకులను హత్యచేశాడు. చెంగిజ్ అప్పటికిన్నీ శాంతినేకోరాడు. గవర్నరును శిక్షించవలసిందని రాయబారులను పంపాడు. తెలివితక్కువవాడగుషా, తనమనతను త్రలుచుకొని, రాయబారులను దూషించి వారిని చంపించాడు. ఇట్టిప్రవర్తన చెంగిజ్ సహించలేకపోయాడు. కాని అతడు తొందరగా ఏపనిచెయ్యలేదు. బహుజాగ్రత్తగా చెయ్యవలసిన ఏర్పాట్లన్నీ చేసుకొన్నాడు. తరువాత తనసైన్యంతో పశ్చిమంగా బయలుదేరాడు.

1219 సంవత్సరమున ప్రారంభించిన ఈ దండయాత్ర ఆసియా కళ్లు విప్పింది. యూరోపుకళ్లూ కొంత విప్పింది. అవి ఈనూతన మహోత్పాతాన్ని చూచాయి. గొప్ప రోలరువలె దొర్లుకొంటూవచ్చి కోట్లకొద్దిజనులనూ నగరములనూ అది నలిపివేసింది. ఖ్వారాజిమ్ సామ్రాజ్యము అంతరించింది. సౌధములతోను, పదిలక్షలపైగా జనులతోను నిండియున్న బొఖారానగరము భస్మము చేయబడింది. రాజధాని యగు సమరఖండము నాశనముచేయబడ్డది. అచ్చట నివసించే 10 లక్షల ప్రజలలోనూ ప్రాణములు దక్కించుకొన్నవారు అరలక్షమంది మాత్రమే. హీరట్, బాఖ్ మున్నగు వృద్ధినందుచున్న నగరములు అన్నీ నాశనము చేయబడ్డవి. లక్షలజనులు చంపబడ్డారు. మధ్య ఆసియాలో వందలకొద్ది సంవత్సరములపాటు వర్ధిల్లిన కళలూ వృత్తి విద్యలూ అంతరించాయి. పరిషియా, మధ్య ఆసియాలలో నాగరీక జీవనమే అంతరించినట్లయింది. చెంగిజ్ నడిచివెళ్లిన దేశమంతా ఎడారియైనది.

ఖ్వారాజిమ్‌షాయొక్క కుమారుడైన జలాలుద్దీన్ ధైర్యంగాపోరాడాడు. ఈఉప్పెనను ఆపడానికి ప్రయత్నించాడు. అతడు వెనుకకు అడుగు వేయవలసి వచ్చినది. సింధునదివరకూ అతడు వెనుకకు వచ్చాడు. అక్కడకూడ అతనికి శత్రువులు ఊపిరి ఆడనియ్యలేదు. గుర్రముమీద కూర్చునిఉండే అతడు 30 అడుగుల క్రిందఉన్న మహానదిలోకిదూకి ఈది వెళ్లిగట్టెక్కాడు. ఢిల్లీకోర్టులో అతడు తలదాచుకున్నాడు. అతనిని అక్కడికి వెంబడించడం ప్రయోజనంలేని పనిఅని చెంగిజ్ ఊరుకున్నాడు.

వారి అదృష్టంవల్ల సెల్జూకుతురుష్కులను, బాగ్దాదును అతడు వదలిపెట్టి ఉత్తరముగా రష్యాలోకి దండయాత్ర సాగించాడు. ఖీవ్‌యొక్క గ్రాండు డ్యూకును (Grand Duke) అతడు ఓడించి చెరపెట్టాడు. తరువాత "హిపియాల" లేదా "తాంగట్ల" తిరుగుబాటును అణచివేయుటకు తూర్పుకు తిరిగివచ్చాడు.

72 సంవత్సరముల వయస్సున, 1227 సంవత్సరమున, చెంగిజ్ మరణించాడు. నల్లసముద్రము మొదలు శాంతసముద్రమువరకూ అతని సామ్రాజ్యము విస్తరించిఉండెను. అప్పటికింకా అదివీర్యవంతముగా నుండి వృద్ధిలోనుండెను. అతనిరాజధాని యింకను మంగోలియాలోని "కారకోరం" అనుచిన్నపట్టణమే. చెంగిజ్ దేశద్రిమ్మరి అయినను అతని అంగనిర్మాణశక్తి అప్రతిమానము. బుద్ధిమంతులగు మంత్రుల నతడు తనకు సహాయముచేయుటకై ఏర్పాటుచేసికొన్నాడు. అంతత్వరిత గతితో జయింపబడిన అతని సామ్రాజ్యము అతడు మృతినొందిన తోడనే విచ్ఛిత్తికాలేదు.

పరిషియన్, అరబ్బీ చరిత్రకారులదృష్టిలో చెంగిజ్ ఒకరాక్షసుడు- అతనిని "భగవంతుని కొరడా" అనేవారు (జనులను శిక్షించుటకు అతనిని సాధనముగా భగవంతుడువాడాడన్నమాట). అతనిని మిక్కిలి క్రూరుడని నిరూపించారు. అతడు, నిజమే, చాలాక్రూరుడే. కాని ఆనాటి పరిపాలకులకూ ఇతనికీ భేదం అంతగాలేదు. ఇండియాలో ఆఫ్ఘనులు ఆవిధముగానే సంచరించారు. 1150 సంవత్సరమున ఆఫ్ఘనులచేతులలో గజినీపడ్డప్పుడు పాతరక్తవైరాలు మనస్సులోపెట్టుకొని ఆనగరాన్ని కొల్లగొట్టి, తగులబెట్టి కసితీర్చుకొన్నారు. ఏడు రోజులు "దోపుళ్లూ, విధ్వంసము, హత్యలు అడ్డులేకుండా జరిగాయి. కనిపించిన ప్రతి మగవాణ్ణీ చంపివేశారు. స్త్రీలనూ, పిల్లలనూ చెరబట్టారు. మహమూదీ రాజులయొక్క (వీరు సుల్తానుమహమ్మదు సంతతివారు) సాటిలేని నగరులూ, భవనములూ నాశనంచేశారు.'' ముస్లిములు సాటి సోదర ముస్లిములపట్ల ప్రవర్తించిన విధమిది. దీనికిన్నీ, ఆఫ్ఘనురాజుల కాలములో ఇండియాలో జరిగిన దారుణములకున్నూ, పర్షియా, మధ్య ఆసియాలలో చెంగిజ్ చేసిన విధ్వంసమునకున్నూ ఏమీ తేడాలేదు. చెంగిజ్ కు ఖ్వారాజిమ్ మీద ప్రత్యేకముగా కోపము కలిగెను. ఇందుకు

కారణము షా అతని రాయబారిని చంపడము. అతనిదృష్టిలో అది రక్తవైరము వంటిదే. చెంగిజ్ అమితముగా ఇతర ప్రదేశములలోకూడా వినాశముచేశాడు. కాని మధ్యఆసియాలో చేసినంత చెయ్యలేదు.

పట్టణములను విధ్వంసము చెయ్యడములో చెంగిజ్ అభిప్రాయము వేరొకటికద్దు. అతని ప్రకృతి దేశద్రిమ్మరిప్రకృతి. పట్టణములూ, నగరములూ అంటే అతనికి అసహ్యం. స్టెప్పీలలో (పెద్ద మైదానములలో) నివసించుట అతని కిష్టము. చీనాలోని నగరముల నన్నిటినీ నేలమట్టము చెయ్యడము ఉచితమేమోనని అతడొకమారాలోచించాడు. అదృష్టవశాత్తు అతడంతపనిచేయలేదు. నాగరికతను ద్రిమ్మరి జీవనముతో మిశ్రితము చేయడ మతని అభిప్రాయము—కాని ఇది సాధ్యముకాలేదు. సాధ్యముకాదు.

చెంగిజ్ ఖాన్ పేరునుబట్టి అతడు మహమ్మదీయుడని ఊహింతువేమో! అతడు మహమ్మదీయుడుకాడు. ఆ పేరు మంగోలులు పెట్టుకొను పేరు. మతవిషయమున చెంగిజ్ సహనబుద్ధికలవాడు. అతని మతము "షామాయి మతము." "శాశ్వత వినీలాకాశము"ను ఆ మతమువారు కొల్తురు. చీనాలోని టోయిస్టు మునులతో అతడు దీర్ఘప్రసంగములు చేసేవాడు. కాని షామాయిమతము నతడు వీడలేదు. కష్టకాలములో అతడు ఆకాశమును సలహాఅడిగేవాడు.

చెంగిజ్ మంగోలుల సమావేశములలో గొప్పఖానుగా ఎన్నుకోబడ్డాడని ఈ జాబులో నీవు చదివియున్నావు. ఈ సమావేశము నిజముగా పూడల్ సమావేశమే. ప్రజాసమావేశముకాదు. కాన చెంగిజ్ తనతెగకు పూడల్ యజమాని మాత్రమే అని గ్రహించవచ్చును.

అతనికి చదువురాదు. అతని అనుచరులకూడాదు. చాలాకాలం వరకూ వ్రాతఅనేది ఒకటి ఉన్నదనే సంగతే అతనికి తెలియదు. నోటిమాటలద్వారానే సందేశాలు పంపుతూవుండేవారు. సాధారణంగా ఈ

సందేశాలు పద్యరూపాన్న సామెతలుగానో, వ్యంగ్య కథలుగానో ఉండేవి. నోటిసందేశాలతో విశాలసామ్రాజ్యంలో ఎట్లా రాచకార్యాలు నడిపించేవారో తలుచుకుంటే ఆశ్చర్యంగానే ఉంటుంది. వ్రాతఅనేది ఒకటి ఉన్నదని చెంగిజ్ తెలిసికొన్న తరవాత అదిచాలా ఉపయోగకరమైనదీ, విలువయైనదీ అని అతడు గ్రహించాడు. తన కొడుకులనూ, ప్రధానోద్యోగులనూ వ్రాత నేర్చుకోమని ఉత్తరువుచేశాడు. అంతేకాదు మంగోలుల సాంప్రదాయక చట్టమును, తన వచనములను వ్రాసిపెట్ట వలసిందనికూడా ఉత్తరువుచేశాడు. ఇందలి అభిప్రాయమేమనగా ఈ సాంప్రదాయకచట్టము ఏన్నటికీ మారదని. శాశ్వతముగా నిలిచిఉంటుందని. దాని నవలంబించకుండా ఎవరూ ఉండకూడదని. చక్రవర్తి సహితము దానికిలొంగి ఉండవలసినదే. కాని ఈ నిర్వకారచట్టము నేడు నష్టమైనది. నేటికాలపు మంగోలుల కది జ్ఞాపకములేదు. ఆ సంప్రదాయమే వారిలో చ్యుతమైనది.

ప్రతి దేశమునకూ ప్రతి మతముకూ ప్రాచీన సాంప్రదాయక చట్టమున్నూ లేఖ్యమైన చట్టమున్నూ ఉంటవి. ఇది శాశ్వతంగా నిలిచి ఉండే నిర్వికారచట్టమని భావించడంకద్దు. ఒక్కొక్కప్పుడు దానిని శ్రుతిగా **(revelation)** —అనగా భగవంతుడు తెలియజేసిన విషయముగా—కూడా భావించేవారు. భగవంతుడు తెలియజేశాడన్న విషయము మారుతుందనికాని, నేడుండి రేపు పోతుందనికాని అనుకో వీలు లేదుకదా! కాని చట్టములు తత్కాల పరిస్థితుల కనుకూలంగాఉండ నుద్దేశింపబడ్డవి. మనము బాగుపడడానికి అవి సహాయభూతంగా ఉండాలని అభిప్రాయం. పరిస్థితులు మారితే పాతచట్టము లెట్లా సరిపోతవి? పరిస్థితులతోబాటు అవీ మారవలెను. లేనిచో అవి ఇనుప సంకెళ్ళగును. ప్రపంచము ముందుకుపోతూంటే ఈ సంకెళ్ళు మనలను వెనక నిలిపివేస్తవి. ఎట్టిచట్టమూ నిర్వికారచట్టం కాజాలదు. అదిజ్ఞానముపై ఆధారపడి ఉండాలి. జ్ఞానము పెరిగినప్పుడు అవన్నీ వృద్ధిచూపాలి.

నీకు చెంగిజ్‌నుగూర్చిన విశేషాలెన్నో అవసరములేనివి వ్రాశాను. కాని ఆ మనిషి నన్నెంతో ఆకర్షిస్తున్నాడు. ఇది వింతగాలేదూ? ఈ భీకరుడు, ఈ క్రూరుడు, హింసలుచేసే దేశద్రిమ్మరి తెగకు చెందిన ఈ ఫ్యూడల్ నాయకుడు, అహింసావాదినీ, సాత్వికుణ్ణీ, శాంతముగాబ్రతికే వాణ్ణీ, నగరములలో నివసించేవాణ్ణీ, ఫ్యూడల్ విషయములన్న తలకంటగించుకొనేవాణ్ణీ అయిన నన్ను ఆకర్షించడం వింతగాలేదూ?

## 68

# మంగోలుల ప్రపంచాధిపత్యము

జూన్ 26, 1932.

చెంగిజ్‌ఖాన్ చనిపోయినప్పుడు అతనికొడుకు, "ఒఘోటాయి" గొప్పఖానయ్యెను. చెంగిజ్‌తోనూ, ఆనాటి మంగోలులతోనూ పోల్చి చూస్తే అతడు దయగలవాడూ, శాంతముగా ఉండగోరేవాడూ అని తెలుస్తుంది. "మన కాగన్‌చెంగిజ్ ఎంతోకష్టపడి మన సామ్రాజ్యభవనాన్ని కట్టాడు. ప్రజలకు శాంతి, సౌఖ్యమూ ఇక ఇవ్వవలెను. ప్రజల భారములు తగ్గించవలెను''అని చెప్పుతూఉండేవాడు. అతడెట్లు ఫ్యూడల్ నాయకుని చిత్తవృత్తితో, తన ప్రత్యేక తెగనుగురించే ఆలోచిస్తున్నాడో గమనించు.

కాని దేశములను జయించడం ఇంకా పూర్తికాలేదు. మంగోలులింకా పరాక్రమోత్సాహాలతో నిండిఉన్నారు. "సాబూటాయి'' అనే గొప్పసేనాని నాయకత్వమున యూరోపుమీద రెండవసారి దండయాత్ర నడిచినది. యూరోపులోని సేనలూ, సేనానులూ సాబుటాయికి ఈడుగారు. చారులను శత్రుదేశాలకు వారి అనుపానులు తెలుసుకోడానికి పంపి జాగ్రత్తగా తయారవుతున్నాడు. తాను వెళ్ళడానికిముందు ఆయా దేశాలలో రాజకీయ పరిస్థితులూ, యుద్ధపరిస్థితులూ ఎట్లాఉన్నాయో అతడు బాగా తెలుసుకొన్నాడు. యుద్ధరంగమున, యుద్ధవిద్యలో అతడు

అప్రతిమానుడు. అతనితో పోల్చిచూచిన యూరోపియన్ సేనానులు యుద్ధవిద్యలో ప్రారంభకులుగానే ఉన్నారు. నైరుతి దిక్కునఉన్న సెల్జూకులను, బాగ్దాదును వదలిపెట్టి అతడు తిన్నగా రష్యాకువెళ్ళెను. 6 సంవత్సరముల కాలముపాటు అతడు మాస్కో, కీవ్, పోలెండు, హంగరీ, క్రాకోలను దోచుకొంటూ నాశనముచేస్తూ ముందుకుపోవుచునే ఉండెను. 1241 సంవత్సరమున, మధ్యయూరోపులో, లోయరు సైలీసియాలోని లీబ్‌నిట్‌జి కడ ఒక పోలిష్ జర్మనుసైన్యము తుద ముట్టించబడినది. యూరోపు అవసానకాలము సమీపించినట్లు కనిపించెను. మంగోలులను ఆపగలిగినవా రెవరూలేరు. "లోకమున అద్భుత"ని పేర్కొనబడ్డా ఫ్రెడరిక్కు మంగోలియానుండి వచ్చిన ఈనిజమగు అద్భుతము ముందర వెలవెల్లాడి ఉండవచ్చును. యూరోపులోని రాజులూ పాలకులూ, అనుకోని సహాయంరాగా ఊపిరిపీల్చుకొన్నారు.

ఒఘోటాయి మరణించాడు. ఉత్తరాధికార మెవ్వరిదీఅనే విషయమున కొంత పేచీవచ్చింది. యూలోపులోని మంగోలు సైన్యములు అపరాజితమైనప్పటికీ వెనుకకుతిరిగి 1242 సంవత్సరమున తూర్పుగా ఇంటికి నడిచివెళ్ళాయి. యూరోపు నిట్టూర్చింది.

ఈ మధ్యకాలములో మంగోలులు చీనాలో వ్యాపించారు. ఉత్తరమున కిన్నులను, దక్షిణ చీనాలోని సుంగులను సైతము వారుపూర్తిగా రూపుమాపారు. మంగుఖాన్ 1252 లో గొప్పఖాన్ అయ్యెను. అతడు కుబ్లైఖాన్‌ను చీనాకు గవర్నరుగా నియమించాడు. ఆసియా యూరోపులనుండి, కారకోరంలోని మంగుకొలువుకు, గొప్ప జనసమూహము వచ్చుచుండెను. ఇంకను గొప్పఖాను దేశాలలోనే దేశద్రిమ్మరి ఆచారముప్రకారము నివసించుచుండెను. కాని ఆ దేశాలు భాగ్యవంతముగానుండెను. దేశములు కొల్లగొట్టిన వస్తువులతో, ధనముతో దేరాలు నిండియుండెను. వర్తకులువచ్చేవారు. ముఖ్యముగా ముస్లిమువర్తకులు.

మంగోలులు వారినుండి బాహాటముగా కొనేవారు. శిల్పులూ, జ్యోతిష్కులూ, గణిత శాస్త్రజ్ఞులూ, అనాటిశాస్త్రము నభ్యసించినవారూ ప్రపంచమును ధిక్కరించు ఆ దేశాల నగరములో సమావేశ మయ్యేవారు. కొంతవరకు శాంతి, క్రమతలు విశాల మంగోలు సామ్రాజ్యములో ఉండేవి. దేశఖండముల మధ్యనుండిపోవు గొప్ప వర్తకమార్గములు వచ్చేపోయే జనముతో నిండిఉండేవి. యూరోపు, ఆసియాలకు దగ్గిర సంపర్గ కలిగింది.

మరిన్ని మతప్రవర్తలు కారకోరంరా మొదలుపెట్టారు. ఈలోక విజేతలను, తమతమ మతములకు, తిప్పుకోడానికి వారంతా ప్రయత్నించారు. సర్వశక్తియుతులగు వీరిని ఎవరైతే తమమతములో కలుపుకోగలుగుతారో వారున్నూ శర్వశక్తియుతు లవుతారు. మిగిలిన మతములపై గెలుపు సాధించినవారవుతారు. రోమునుండి పోపు రాయబారులను పంపాడు. నెస్టోరియన్ క్రైస్తవులు వచ్చారు. ముస్లిము లక్కడే ఉన్నారు. బౌద్ధులూ ఉన్నారు. కొత్తమతము స్వీకరించే ఆత్రత మంగోలులకులేదు. వారంత మతపిచ్చికలవారు కారు. ఒకప్పుడు గొప్పఖాను క్రైస్తవమును స్వీకరిద్దామా! అనుకొన్నాడుట. కాని పోపు తనకున్నవని చెప్పుకొను అధికారాదులు అతనికి కిట్టలేదు. చివరకు మంగోలులు ఎక్కడెక్కడైతే నివాసా లేర్పచురకొన్నారో ఆయాప్రాంతాల మతములను స్వీకరించారు. చీనా,మంగోలియాలలో చాలామంది బౌద్ధులయారు. మధ్య ఆసియాలో వారు ముస్లిములయారు. బహుశా రష్యాలోను, హంగరీలోనుఉన్న కొందరు క్రైస్తవులయారు.

రోములోని వాటికకాలో (Vatican), గొప్పఖాక (మంగు) పోపుకువ్రాసిన అసలు జాబొకటి, అచ్చటి భాండాగారంలో ఉన్నది. నేడుకూడా దానిని మనము చూడవచ్చును. అది అరబ్బీభాషలోనున్నది. ఓఘటాయి మరణానంతరము కొత్తఖానువద్దకు ఒక రాయబారిని పోపు

పంపాడుట. మళ్ళీ యూరోపుపై దండయాత్ర చేయవద్దని హెచ్చరిక చేశాడట. తనపట్ల యూరోపియనులు సక్రమంగా ప్రవర్తించని కారణం వల్ల తాను యూరోపుపై దండెత్తితినని ఖాకా సమాధానం వ్రాశాడట.

మంగుకాలములో వేరొక జైత్రయాత్ర, దానితో వినాశనము జరిగినవి. అతని సోదరుడు హులగూ పర్షియాలో గవర్నరుగాఉండెను. ఏదో విషయమును గురించి బాగ్దాదులోని కాలీఫుపై అతడు కోపించాడు. అన్నమాటలు నిలబెట్టుకొనక పోయినందుకు అతనిని చీవాట్లు వేస్తూ ముందుముందు సరిగా ప్రవర్తించమనినీ, అట్లు చేయకుంటే తనసామ్రాజ్యమే పోతుందనీ అతనికి హులగూ సందేశముపంపాడు. కాలీఫు అట్టే తెలివైనవాడుకాడు. వెనుకటి అనుభవాన్ని బట్టిఅయినా అతడు లాభము పొందలేదు. దూషిస్తూ సమాధానం పంపాడు. మంగోలు రాయబారులను బాగ్దాదులోని ప్రజాసమూహము పరాభవించింది. హులగూయొక్క మంగోలురక్తము వేడెక్కింది. క్రోధముతో అతడు బాగ్దాదుమీదికి దండయాత్ర చేశాడు. 40 రోజుల ముట్టడి అనంతరమూ దానిని స్వాధీనం చేసుకొన్నాడు. అరేబియా రాత్రులకథలకు సంబంధించిన నగరము ఆనాటితోసరి. సామ్రాజ్యము 500 సంవత్సరములలోను, కూడబెట్టిన ధనసంచయము, రత్నరాసులు అంతరించాయి. కాలీఫును అతని కొడుకులును, దగ్గిర బంధువులును చంపబడ్డారు. కొన్ని వారములపాటు ప్రజలను హత్యచేశారు. టైగ్రీసునది మైళ్ళదూరము రక్తముతో ఎర్రబడ్డది. 15 లక్షలమంది అప్పుడు చనిపోయినారట. కళాసంపద, వాఙ్మయసంపద, భాండాగారములునాశనమైనవి. పశ్చిమ ఆసియాలోని ప్రాచీనకాలమునాటి పారుదలపద్ధతి, వేలసంవత్సరములు పనిచేసిన పద్ధతి కూడా హులగూ నాశనముచేశాడు.

అలెప్పో, ఎడిస్సా, ఇంకా ఇతరపట్టణము లనేకము నాశనమైనవి. పశ్చిమఆసియాలో అంధకారము కప్పింది. అనాటి చరిత్రకారు

చొకడు "విజ్ఞానశాస్త్రమునకును, నీతికిని కరువుపట్టిన కాలమది" అని చెప్పియున్నాడు. పాలస్తీనాకు పంపబడిన ఒక మంగోలుసేన ఈజిప్టు సుల్తానైన బైబర్సువల్ల ఓడించబడెను. ఈ సుల్తానుకు "బందూక్దారు" అను విశేషనామముండెను. అతనికి బందూకులు—తుపాకులు—గల ఒకసేనాదళ ముండుటవల్ల ఈపేరు వచ్చినది. మన మిప్పుడు తుపాకుల యుగమున ప్రవేశిస్తున్నాము. చీనాదేశస్థులకు తుపాకి మందుచేయుట ఎంతకాలమునుంచో తెలుసును. మంగోలులు బహుశా వారినుండి ఈవిద్య నేర్చుకొని యుండవచ్చును. బహుశా వారి విజయములకు ఈ తుపాకులే కారణము కావచ్చును. మంగోలుల ద్వారానే తుపాకులు యూరోపులో ప్రవేశించినవి.

1258 సంవత్సరమున బాగ్దాదు విధ్వంసము చేయబడ్డప్పుడే మిగిలిన అబ్బాసీదు సామ్రాజ్యము తుదముట్టినది. పశ్చిమఆసియాలో ప్రత్యేక అరబ్బీ నాగరికత కిదేఅంతము. దూరమున, దక్షిణ స్పెయినులో గ్రానడా యింకను అరబ్బీ సంప్రదాయములను సాగించుచుండెను. ఇక 200 సంవత్సరములు నిలిచి అదియును అంతరించినది. అరేబియా శీఘ్రముగానే తన ప్రాముఖ్యాన్ని కోల్పోయింది. నాటినుండి ఆ దేశ ప్రజలు చరిత్రలో గొప్పపనులేమీ చెయ్యలేదు. కొంతకాలమైన పిమ్మట ఆ టొమణ్తురుష్క సామ్రాజ్యములో వారొక భాగమైరి. 1914-18 సంవత్సరములలో జరిగిన మహా సంగ్రామములో, ఇంగ్లీషువారిమద్దత్తు మీద అరబ్బులు తురుష్కులపై తిరుగబడిరి. నాటినుండియు కొంచెమెచ్చుతక్కువగా అరబ్బులు స్వతంత్రముగానే ఉండిరి.

రెండుసంవత్సరములపాటు కాలీపులేదు. అప్పుడు ఈజిప్టుసుల్తాను బైబర్సు, వెనుకటి అబ్బాసీదు కాలీపు బంధువును, కాలీపుగా నియమించాడు. అతనికి రాజకీయాధికార మేమీలేదు. మతవిషయకాధికారి మాత్రమే అతడు. 300 సంవత్సరముల అనంతరము కాంస్టాంటి

నోపులులోని తురుష్క సుల్తానుకు కాలీపుఅనే బిరుదము వెనుకటి కాలీపు ఇచ్చాడు. కొద్దిసంవత్సరముల క్రితము ముస్తాఫా కమాల్ పాషా, సుల్తానునూ, కాలీపునూ అంతరింప జేసేవరకూ, తురుష్క సుల్తానులు కాలీపులుగానే ఉంటూవచ్చారు.

ప్రధానకథ వదలి యితరవిషయాలలోకి దిగాను. గొప్పఖాను అయిన మంగు 1239 లో చనిపోయాడు. చనిపోవుటకుముందు అతడు టిబెట్టుజయించాడు. చీనాలో గవర్నరుగాఉండిన కుబ్లైఖాను గొప్ప ఖాను అయినాడు. కుబ్లై చాలాకాలము చీనాలో ఉండుటవల్ల దానిపై అతనికి ఇష్టముకలిగింది. కాబట్టి అతడు తన రాజధానిని కారకోరంనుంచి పీకింగుకు మార్చి దాని పేరుమార్చి ఖాంబాలిక్ (ఖాననగరము) అనే కొత్తపేరు పెట్టాడు. చీనా వ్యవహారములలో అతనికిగల అనురక్తి కారణముగా అతడు తన గొప్ప సామ్రాజ్యమును ఉపేక్షించాడు. క్రమ క్రమముగా మంగోలు గవర్నర్లందరూ స్వతంత్రులయ్యారు.

కుబ్లై చీనాను పూర్తిగా జయించాడు. ఇతని జైత్రయాత్రలు వెనుకటి పాతమంగోలు జైత్రయాత్రలవంటివి కావు. క్రౌర్యము తక్కువ, విధ్వంసముతక్కువ. చీనా అప్పుడే కుబ్లైనుసాధుచేసినది. నాగరీకుణ్ణిచేసింది. చీనా దేశస్థులుకూడా అతనిని తమలో ఒకనినిగా భావించుకొని అతనితో అరమరికలేకుండా ఉండేవారు. అతడొక శుద్ధ చీనా రాజవంశమునుకూడా ప్రతిష్ఠించాడు. దానిపేరు యు ఆన రాజ వంశము. తన సామ్రాజ్యములో కుబ్లైఖాను, టాంకింగ్, అన్నామ్, బర్మాలను కలుపుకొన్నాడు. అతడు జపాను మలేసియాలను జయించా లని ప్రయత్నించాడు. మంగోలులు సముద్రయాత్రల కలవాటు పడని వాళ్ళగుటచేతను, ఓడలు కట్టుకొనుట వాళ్ళకు తెలియకపోవడంచేతను అతడాపని చెయ్యలేకపోయాడు.

మంగుఖాన్ కాలములో ఫ్రాంసురాజైన లూయీ 16 నుండి అతనికొక రాయబారం వచ్చింది. ముస్లిములకు వ్యతిరేకముగా, మంగోలులును, యూరోపులోని క్రైస్తవ ప్రభుత్వములనుచేరి మిత్రులుగా ఉండుట మంచిదని అతడు సూచించాడు. క్రూసేడుల కాలములో చెరపట్టబడి, పాపము, లూయీ చాలా కష్టములపాలయి ఉంటాడు. ఇట్టి మిత్రత్వములమీద మంగోలులకు అట్టే మోజులేదు. ఒక ప్రత్యేక మతమునకు చెందియున్నారనే కారణముచేత ఏ మతమువారినీ ఎదుర్కొనుట వారి కిష్టములేనిపని.

యూరోపులోని చిల్లర రాజులతోను రాజకుమారులతోను వారెందుకు స్నేహం చేసుకోవాలి? ఇంతకీ ఎవరి నెదిరించడాని కీస్నేహం? పశ్చిమయూరోపు రాజ్యములయొక్కయు, ఇస్లాం రాజ్యములయొక్కయు యుద్ధనిపుణత వారిని భయపెట్టేదికాదు. అదృష్టమువల్లనే పశ్చిమ యూరోపియన్ రాజ్యములు వారి బారినిపడకుండా తప్పించుకున్నవి. సెల్జూకు తురుష్కులు వారికి తలయొగ్గి పన్ను చెల్లించుకున్నారు. ఈజిప్టు సుల్తానుమాత్రము ఒక మంగోలు సైన్యమును ఓడించాడు. కాని గట్టిగా తలుచుకుంటే అతనిని మంగోలులు అణచివేసి యుందురనడానికి సందేహంలేదు. ఆసియా, యూరోపుఖండాల నంతటను బ్రహ్మాండమైన మంగోలు సామ్రాజ్యము వ్యాపించియుండెను. మంగోలు విషయములతో పోల్చదగ్గది చరిత్రలో ఏమీలేదు. అంతగొప్ప సామ్రాజ్యమున్నూ ఎన్నడూలేదు. ఆ కాలమున మంగోలులు ప్రపంచానికంతకూ అధినేతలా! అని తోచును. ఇండియా వారివశం కాలేదు. వారాదారిని రాక పోవడమే ఇందుకు కారణము. పరిమాణమున ఇండియాతో సమానముగానున్న పశ్చిమ యూరోపుకూడా వారి సామ్రాజ్యములోలేదు. ఈ ప్రదేశాలన్నీ అట్లా ఉండడానికి కారణం వారుండనిచ్చారు కాబట్టి. వాటిని గ్రహించాలని వాళ్ళు అనుకొనేవఱకూ అవి అట్లా ఉన్నాయి. 13 వ శతాబ్దిలో అట్టిఅభిప్రాయం ఉన్నట్టు తోచును.

కాని మంగోలుల బ్రహ్మాండశక్తి తగ్గుచున్నట్లు తోచుచుండెను. విజయయాత్రకు వెళ్ళుదమనే ప్రేరణ మాసిపోతోంది. ఆ రోజులలో జనులు కాలినడకనో, గుర్రమునెక్కో మెల్లగాపోతూండేవారు. త్వరగా పోవుటకు ఆ కాలములో సాధనములులేవు. ఒకసైన్యము స్వదేశమగు మంగోలియానుండి యూరోపులోని సామ్రాజ్యముయొక్క పడమటి పొలిమేరకు పోవడానికి ఒకసంవత్సరం పట్టుతుంది. కొల్లగొట్టి ధనము సంపాదించే సావకాశం లేనప్పుడు, వారు తమ సామ్రాజ్యముగుండానే ఇంతింత గొప్పప్రయాణాలుచేసి కొత్తరాజ్యాలమీదికి దండెత్తానికి సుముఖులుగాలేరు. ఇంతేకాకుండా యుద్ధములోను, దోపిడిలోను వరసగా విజయాలు వచ్చిఉండడంవల్ల మంగోలు రౌతులు కొల్లగొట్టిన ధనముతో ధనవంతులైనారు. వారిలో చాలామంది బానిసలనుకూడా పెట్టుకొని ఉండవచ్చు. కాబట్టివారు శాంతించి, శాంతిమార్గా లవలంబించడానికి పూనుకొన్నారు. తనకు కావలసినదంతా సంపాదించుకొన్న మానవుడు కోరేది శాంతీ, భద్రతాను.

బ్రహ్మాండమగు ఈ సామ్రాజ్యమును పాలించడము చాలా కష్టకార్యమైఉండాలి. ఆ కారణమువల్లనే అది చీలికలగుటకు మొదలు పెట్టిందంటే ఆశ్చర్యంలేదు. కుబ్లైఖాను 1292 లో చనిపోయెను. అతని తరువాత గొప్పఖాను లెవరూలేరు. సామ్రాజ్యము 5 పెద్దభాగములుగా విడిపోయింది.

(1) చీనా సామ్రాజ్యము- దీనిలో మంగోలియా, మంచూరియా, టిబెట్టులు చేరిఉన్నవి. ఇది ముఖ్యమైన సామ్రాజ్యము. ఇది "యుఆన్" రాజవంశమునకు చెందిన కుబ్లైఖాన్ సంతతివారి క్రిందనుండెను.

(2) గోల్డెన్‌హార్డి సామ్రాజ్యము. (అచ్చటి మంగోలులకా పేరుండేది) దూరముగా పశ్చిమమున రష్యా, పోలెండు, హంగరీలలో ఈ సామ్రాజ్యముండెను.

(3) పర్షియా, మెసపొటేమియా, మధ్య ఆసియాభాగము— వీటిలో ఇల్‌ఖాన్ సామ్రాజ్యముండెను. ఇది హూలగు స్థాపించినది. దీనికే సెల్జూకు తురుష్కులు కప్పము చెల్లించేవారు.

(4) మధ్య ఆసియాలో టిబెట్టుకు ఉత్తరముగా గ్రేట్ టర్కీ ఉండెను. అదియే జగటాయి సామ్రాజ్యము.

(5) మంగోలియాకు, గోల్డెన్ హోర్డ్‌కు మధ్య మంగోలుల సైబీరియన్ సామ్రాజ్య మొకటి యుండెను.

గొప్పదైన మంగోలు సామ్రాజ్యము చీలిపోయినప్పటికీ అందలి 5 భాగములలోను ప్రతి ఒక్కటే శక్తివంతమైన సామ్రాజ్యముగానే ఉండెను.

## 69
# గొప్ప యాత్రికుడైన మార్కో పోలో

జూన్ 27, 1932.

కారకోరంలోని గొప్పఖాన్ కొలువుకూటమును గురించి చెప్పియుంటిని. మంగోలులకీర్తి, వారి విజయములూ వర్తకులనూ, శిల్పులనూ, పండితులనూ. మిషనరీలనూ ఆకర్షించడంవల్ల వారా కొలువు కూటముకు వచ్చేవారు. అట్టి వారిని రమ్మని మంగోలులు ప్రోత్సహించడంకూడా వారిరాకకు ఒక కారణము. మంగోలులు వింత మనుష్యులు. కొన్ని విషయములలో వారు మిక్కిలి సమర్థులు; మరి కొన్ని విషయములలో చిన్న పిల్లల వంటివారు. వారి భీకరత్వమూ, క్రౌర్యమూ అసహ్యకరముగాఉన్నా వాటిలోకూడా పసితనపు లక్షణాలు కనిపిస్తవి. భీకరులగు ఈ యోధులు మనల నాకర్షించడానికి ఈ పసితనపు లక్షణాలే కారణమై యుండవచ్చు. కొన్ని వందల సంవత్సరములైన తర్వాత ఒక మంగోలు,—ఇండియాలో వీరినే మొఘల్

అంటారు—ఈ దేశమును జయించెను. అతడు బేబరు. అతని తల్లి చెంగిజ్ ఖాన్ సంతతిలోనిది. ఇండియాను జయించిన పిమ్మట అతడు కాబూలులోనూ ఇంకా ఉత్తర దేశములలోనూ ఉండే చల్లని గాలుల కోసం, పువ్వులకోసం, తోటలకోసం, కర్బూజా పుచ్చకాయలకోసం నిట్టూర్పులు విడుస్తూ ఉండేవాడు. అతడు సరదా మనిషి. అతడు వ్రాసిన ఆత్మచరిత్రమునుబట్టి అతని మానవత్వము వెల్లడి అవుతుంది. అతడు మనోహరమైన లక్షణములు కలవాడు.

దూరదేశములనుండి తమ కొలువుకు పరదేశస్థులు వచ్చేటట్లు మంగోలులు ప్రోత్సహించారు. వారికి జ్ఞానేచ్ఛ ఉండెను. వారు విద్యలు నేర్చుకొనగోరారు. వ్రాత అనునది ఉన్నదని చెంగిజ్ తెలిసికొన్నప్పుడతడు వెంటనే దాని లాభమును గ్రహించి దానిని నేర్చుకొమ్మని తన ఉద్యోగస్థుల కుత్తరువు లిచ్చేరన్నమాట జ్ఞాపకమున్నదా? వారికి నేర్చుకొనవలెనని బుద్ధిఉన్నది. ఇతరులవద్ద నేర్చుకొనగలరు. కుబ్లైఖాను పీకింగులో స్థిరముగానుండి చీనాదేశ సార్వభౌముడనే గౌరవ స్థితికి వచ్చినప్పుడు పరదేశవాసులు తన కొలువు కూటముకు వచ్చునట్లు ప్రోత్సహించాడు. అతనివద్దకు ఇద్దరు వెనీసు వర్తకులు వచ్చారు. వారు సోదరులు. నికొలోపోలో, మఫియోపోలో అనువారు. వర్తకముకోసరము వారు బొఖరావరకూ వెళ్ళారు. అక్కడ పర్షియాలోని హులగూకు, కుబ్లైఖాన్ పంపిన కొందరు దూతలు వారిని కలుసుకొన్నారు, వారిని తమ బిడారులో చేరమని ప్రోత్సహించారు. ఈ విధముగా వారు ప్రయాణము చేసివచ్చి పీకింగ్‌లో కుబ్లైఖాన్ కొలువు కూటము చేరుకున్నారు.

కుబ్లైఖాను వారిని బాగా ఆదరించాడు. వారతనికి యూరోపును గురించియు, క్రైస్తవమును గురించియు, పోపును గురించియు

చెప్పారు. కుబ్లై చాలా సంతోషించాడు: క్రైస్తవమత మతనివి ఆకర్షించినట్లు తోస్తుంది. 1269 లో పోలోలను అతడు యూరోపుకు తిరిగి పంపివేశాడు. వారిద్వారా పోపుకు సందేశంకూడా పంపాడు. నూర్గురు విద్యాధికులను- ఏడు కళలలోను బాగా పరిచయము కలవారినీ, తెలివైనవారినీ, క్రైస్తవమును సమర్థించగలవారినీ—తనవద్దకు పంపమని పోపును కోరాడు. కాని ఇద్దరు పోలోలును ఇంటికి వచ్చుసరికి యూరోపున్నూ, పోపున్నూ చిక్కులలో ఉన్నారు. అట్టి విద్యాధికులు నూర్గురు పోపుకు చిక్కలేదు. రెండు సంవత్సరముల తరువాత వారు ఇద్దరు క్రైస్తవ సన్యాసులతో చీనాకు బయలుదేరి వెళ్ళారు. ముఖ్యమైన విషయము వారు తమతోకూడా నికోలో కొడుకును మార్కో పోలో అనువానిని తీసుకొవెళ్ళారు.

ముగ్గురు పోలోలును బ్రహ్మాండమైన యీ ప్రయాణానికి పూనుకొన్నారు. నాటుబాటలగుండా వారు ఆసియానంతను అధిగమించారు. ఎంతటి బ్రహ్మాండమైన ప్రయాణములవి! నేడుకూడా పోలోలు వెళ్ళిన దారిని వెళ్ళితే సుమారు సంవత్సరం పట్టుతుంది. పోలోలు కొంత వరకు యువాన్‌చ్వాంగ్ వెళ్ళినదారినే అనుసరించారు. వారు పాలస్తీనా మీదుగా ఆర్మీనియాకు, అచ్చటినుండి మెసపొటేమియాకు, పర్షియన్ గల్ఫుకు వెళ్ళారు. అక్కడవారికి హిందూదేశ వర్తకులు కనిపించారు. పర్షియాకు అడ్డపడి బాఖ్‌కు, అక్కడ పర్వతములుదాటి కాష్గరుకు, అచ్చటినుండి ఖోటానుకు, అచ్చటినుండి "సంచార సరస్సు" అనబడు లోప్‌నోర్‌కు వెళ్ళారు. మళ్ళీ ఎడారివచ్చింది. అదిదాటి యీ విధముగా చీనాకువెళ్ళి పీకింగ్ చేరుకున్నారు. నిరాటంకముగా ప్రయాణము చేయడానికి వారివద్ద అధికార పత్రముండెను. అదియొక బంగారుబిళ్ళ. గొప్పఖాను స్వయముగా వారికది ఇచ్చెను.

ప్రాచీన రోమక కాలమున చీనా, సిరియాల మధ్యనున్న పాత బిఖాతు మార్గమిది. గోబీయెడారి కడ్డముగా స్వీడిష్ పరిశోధకుడున్ను,

యాత్రికుడును అయిన స్వెన్ హెడెన్ అనువాడు ప్రయాణము చేసినట్లు ఈ మధ్య చదివాను. పీకింగ్‌నుంచి పడమరగా అతడు ఎడారి దాటివెళ్లి లోప్‌నోర్ సరస్సునుతాకి అచ్చటినుండి ఖోటానుకు, ఇంకా పైగాను పోయాడు. నేటికాలమున సాధ్యపడు సదుపాయములన్నీ అతనికి గలవు. అయినా అతడూ అతని సహచరులూ కష్టములనూ, బాధలనూ పడవలసి వచ్చింది. 1300 సంవత్సరముల క్రితము యూవాన్ చ్వాంగుసూ, 700 సంవత్సరముల క్రితము పోలోలును ఆదారిని ప్రయాణం చేశేటప్పు డెట్లాఉండేదో! స్వెన్ హెడెన్ ఒక వింత విష యాన్ని కనిపెట్టాడు. లోప్‌నోర్ సరస్సు తన స్థానమును మార్చు కొన్నట్లు అతడు కనిపెట్టాడు. పూర్వకాలమున, నాల్గవ శతాబ్దిలో టారిన్‌నది లోప్‌నోర్‌లో పడేది. అది తన గతి మార్చుకొన్నది. ఎడారి ఇసుకలు త్వరలో కొట్టుకొనివచ్చి పాతమార్గాన్ని కప్పివేశాయి. లౌలాన్ అనే ప్రాచీన పట్టణము అక్కడ ఉండేది. నదిగతి మారడం వల్ల బాహ్య ప్రపంచముతో ఆ నగరానికి సంబంధం పోయింది. అందు నివసించే ప్రజలు దానిని వదలిపెట్టి వెళ్లిపోవడంవల్ల అది పాడుపడింది. ఈ నది గతి మార్చుకోడంవల్ల లోప్‌నోర్ సరస్సుకూడా తన స్థానాన్ని మార్చుకొన్నది. పాత బిడారు మార్గములు, వర్తక మార్గములూకూడా మారాయి. ఈ మధ్య కొద్ది సంవత్సరములకు పూర్వము టారిన్‌నది మళ్లీ తనగతి మార్చుకొని పాతప్రదేశమునకు పోయినదని స్వెన్ హెడెన్ కనుక్కున్నాడు. సరస్సూ తన స్థానం మార్చుకొన్నది. ఇప్పుడు టారిన్‌నది లౌలాన్‌నగర శిథిలముల ప్రక్కనుండి పారు తోంది. వేయి సంవత్సరములబట్టి ఉపయోగంలోలేని పాతబాటలుమళ్లీ ఉపయోగంలోకి రావచ్చును. కాని ఒంటెలకు బదులు నేడు మోటారు కార్లు పోతవి. ఇందువల్లనే లోప్‌నోర్‌కు "సంచార సరస్సు" అని పేరు వచ్చింది. టారిన్‌నది యొక్కయు, లోప్‌నోర్ యొక్కయు సంచారక్రమము నీకు చెప్పాను. దీనినిబట్టి నదులేవిధముగా పెద్ద భూభాగ

ములను మార్చివేస్తాయో, చరిత్రలో మార్పు తెస్తవో ఊహించుకొన వచ్చును. ప్రాచీనకాలమున మధ్య ఆసియా, జనులతో కిటకిట లాడు చుండెనని తెలిసికొన్నాము. అచ్చటి జనులు తెరలు తెరలుగా పడమరకూ, దక్షిణముకూ విజయయాత్రలు సాగించారు. నేడది ఎడారి వలెనే ఉన్నది. కొద్ది పట్టణములతోను, అల్ప జనసంఖ్యతోను ఉన్నది. బహుశా ఆకాలమున నీటివసతి పుష్కలముగా ఉండేది కాబోలు. అందువల్లనే పెద్ద జనసంఖ్యనది పోషించగలిగేది. శీతోష్ణస్థితి మారినది. వేడి అధికమైనది; నీటివసతి అంతగాలేదు; జనసంఖ్య నానాటికీ తగ్గిపోయింది.

అట్టిదీర్ఘ ప్రయాణములలో ఒక లాభమున్నది. క్రొత్త భాషను గాని భాషలనుగాని నేర్చుకొనుటకు తీరిక ఉంటుంది. వెనీసునుండి బయలుదేరి పీకింగు చేరుటకు ముగ్గురు పోలోలకు మూడున్నర సంవత్సరములు పట్టినది. ఈ దీర్ఘకాలములో మార్కో మంగోలు భాషను బహుశా చీనా భాషనుకూడా, క్షుణ్ణముగా నేర్చుకొని ఉండవచ్చును. మార్కో గొప్పఖానుకు ఇష్టుడయ్యెను. సుమారు పదిహేడు సంవత్సరములకాలము మార్కో అతని కొలువులో ఉండెను. అతడు గవర్నరయ్యాడు. ఉద్యోగ కార్యములమీద అతడు చీనా వివిధ భాగములకు వెళ్లేవాడు. మార్కోకును అతని తండ్రికిని ఇంటిమీదకు మనస్సు పోయినప్పటికీ, వెనీసుకు తిరిగి పోవలెనను కున్నప్పటికీ ఖాన్ అనుమతి సంపాదించడం కష్టంగా ఉండేది. చివరకు ఇంటికి తిరిగి పోవడానికి వారికి సావకాశం చిక్కింది. పర్షియాలోని ఇల్‌ఖాన్ సామ్రాజ్యమునకు రాజైన మంగోలు ప్రభువు కుబ్లైఖాన్ జ్ఞాతి. అతడికి భార్య పోయింది. మళ్ళీ పెళ్ళి చేసుకోవాలనుకున్నాడు. కాని అతని వెనుకటి భార్య తన తెగ స్త్రీనేగాని బయటి ఏ స్త్రీని పెళ్ళిచేసికోనని అతనిచేత వాగ్దానం చేయించింది. కాబట్టి (ఆ మంగోలు ప్రభువు ఆర్గన్ అనువాడు

పికింగుకు కుబ్లైఖానువద్దకు దూతలను పంపాడు. వారితెగకు చెందిన అనుకూలవతియగు వధువును పంపమని కోరాడు.

కుబ్లైఖాన్ మంగోలు రాజకుమార్తెను, యౌవనవతిని ఎంచి ముగ్గుర పోలోలతో ఆమె పరిజనముతో పంపాడు. వారు అనుభవము గల యాత్రికులౌట యిందుకు కారణము. సముద్రమార్గమున వారు దక్షిణ చీనానుండి సుమిత్రాకువెళ్ళి అక్కడ కొన్ని దినములాగారు. అప్పుడు సుమిత్రాలో శ్రీ విజయ బౌద్ధ సామ్రాజ్యముండెను. అది క్షీణ దశలో నుండెను. సుమిత్రానుండి వారు దక్షిణ ఇండియాకు వచ్చారు. దక్షిణ ఇండియాలోని పాండ్యరాజ్యములోని ఉచ్ఛస్థితిలోనున్న కయాల్ అనే రేవు పట్టణాన్ని మార్కో దర్శించినట్లు ఇదివరలో చెప్పియున్నాను. రాజకుమార్తెయు, మార్కోయును, పరివారమును ఇండియాలో కొంత కాలముపాటు నిలిచారు. ప్రయాణం సాగించడానికి వాళ్ళంత తొందర పడ్డట్లులేదు. పర్షియా చేరడానికి వారికి రెండు సంవత్సరములు పట్టింది. ఇంతలో పెళ్ళికొడుకు పరమపదించాడు. చాలాకాలం కనిపెట్టుకు ఉన్నాడు పాపం. అతని చావు అంత దురదృష్టంగా భావించనక్కర లేదు. రాచపడుచు అర్గన్ కుమారుని పెళ్ళిచేసుకొన్నది. వారు ఈడూ జోడూగా ఉన్నారు.

రాజకుమార్తెను వదలిపెట్టి పోలోలు కాంస్టాంటినోపుల్ ద్వారా ఇంటికి బయలుదేరారు. 1295 లో వారిల్లు చేరుకున్నారు. ఇల్లు వదలి వెళ్ళి అప్పటికి 25 సంవత్సరములైనది. వాళ్ళను ఎవ్వరూ పోల్చుకో లేక పోయారు. పాత స్నేహితులకూ ఇతరులకూ, నమ్మకం పుట్టించడం కోసం వారొక విందు చేశారట. విందు జరుగుచుండగా వారు తమ అందవికారమైన బొంతలవంటి దుస్తులను చింపివేశారట. వెంటనే వజ్రములు, కెంపులు, పచ్చలు, ఇతర రత్నములూ కుప్ప కుప్పలుగా రాలాయట. విందుకు వచ్చినవారు ఆశ్చర్య పోయారు. అయినా

ఇండియా, చీనాలనుగురించి పోలోలు చెప్పిన కథలు నమ్మినవాళ్ళు బహు కొద్దిమంది మాత్రమే. మార్కోయును, అతని తండ్రియు, పినతండ్రియు అతిశయోక్తులు చెప్పుతున్నారని వాళ్లు భావించారు. చిన్న వెనీసు ప్రజాప్రభుత్వమునకు మాత్ర మలవాటు పడినవారు చీనా యొక్కయు, ఇతర ఆసియా దేశములయొక్కయు పరిమాణమును ఊహించలేకపోయారు.

మూడు సంవత్సరముల తరువాత 1295 లో వెనీసుజినోవా నగరముమీదికి యుద్ధమునకు వెళ్లింది. అవి రెండును సముద్రాధిపత్యముగల నగరములు. పోటీదార్లు. వారిద్దరికీ గొప్ప నౌకాయుద్ధమొకటి జరిగినది. వెనీసువారు ఓడిపోయిరి. అనేకవేలమంది జినోవా వారిచేత చెరబట్టబడ్డారు. అట్లు బందీలైనవారిలో మన మార్కోపోలో ఒక్కడు. జినోవాలో చెరసాలలో కూర్చుని తన యాత్రావృత్తాంతమును అతడు వ్రాశాడు. అనగా లేఖకునకు చెప్పివ్రాయించాడు. ఈ విధముగా "మార్కోపోలో యాత్రలు" అను గ్రంథము పుట్టింది. మంచిపని చేయడానికి చెరసాల ఎంతటి అనుకూలమైన స్థలము!

ఈ యాత్రావృత్తాంతములో మార్కో ముఖ్యముగా చీనాను వర్ణించాడు. చీనాలో తాను చేసిన అనేక ప్రయాణములను వర్ణించాడు. అతడు సయాం, జావా, సుమిత్రా, సింహళము, దక్షిణఇండియాలను కూడా కొంతవరకు వర్ణించాడు. చీనాలోని గొప్ప రేవుపట్టణముల నాతడు వర్ణించాడు. తూర్పుదేశము లన్నింటినుండియు వచ్చిన ఓడలతో రేవులు కిటకిటలాడుచుండేవి. కొన్ని పెద్దఓడలుండేవి. అందు ఓడపని చేసేవారిసంఖ్య 300 మొదలు 400 వరకు ఉండెను. చీనా నాతడు భోగభాగ్యములతో కలకలలాడుతూ ఉన్నట్లు వర్ణించాడు. అందు నగరములు, పేటలు అనేకముండెను. పట్టుబట్టలు, జరీబట్టలు, సన్నవిపట్టులు (చీనిచీనాంబరములు) అందు తయారుచేయుచుండిరి.

అందు చక్కని ద్రాక్షతోటలు, ఉద్యానములు, కేదారములు విలసిల్లు చుండెను. బాటలపొడుగునా ప్రయాణీకుల సౌకర్యార్థము చక్కని సత్రము లుండెను. చక్రవర్తి సందేశములను తీసుకొనిపోవుటకు ప్రత్యేక ఏర్పాట్లు ఉన్నట్లు అతడు చెప్పుచున్నాడు. అంచెగుర్రముల మీద రోజుకు 400 మైళ్ళదూరము సందేశములు పోయెడివి. ఇది మంచివేగమే. వంటచెరుకుకు బదులు చీనావారు నల్లరాళ్ళను భూమి నుండి త్రవ్వి ఉపయోగించేవారట. దీని అర్థము వారు బొగ్గుగనులు త్రవ్వేవారనీ, బొగ్గును వంటచెరుకుగా వాడేవారనీ స్పష్టము. కుబ్లైఖాను కాగితపునోట్లను వాడుకలోపెట్టాడట. నేడు చేస్తూన్నట్లే నోట్లకు బదులు అడిగినప్పుడు బంగారము యిచ్చేపద్ధతిమీద అతడు నోట్లను ప్రచారములో పెట్టాడు. ఇది చాలామంచివిషయము. పరపతి (credit) పుట్టించే నేటికాలపు పద్ధతి నాతడు ఆ కాలములో ప్రచారములో పెట్టుట గొప్పవిషయమే. ఒక క్రైస్తవ అధినివేశము ప్రెస్టర్ జాన్ అను పాలకుని క్రింద చీనాలో నివసిస్తూండేదని మార్కో చెప్పాడు. ఇది విన్న యూరోపు ప్రజలకు ఆవేశము, ఆశ్చర్యము కలిగినవి. బహుశా వీరు మంగోలియాలోని వెనుకటి నెస్టోరియనులు కొందరై యుండవచ్చును.

జపాను, బర్మా, ఇండియాలను గురించి కూడా అతడు వ్రాశాడు. ఒక్కొక్కప్పుడు తాను స్వయముగా చూచిన విషయములూ, ఒక్కొక్కప్పుడు తాను విన్న విషయములు కూడా వ్రాశాడు. మార్కో వృత్తాంతము నాటికి నేటికీకూడా అద్భుత గాథగానే ఉంటున్నది. తమ చిన్నదేశాలలో గట్టిగా కూర్చుండి ఈర్ష్యలు పెంచుకొంటూఉన్న యూరోపుప్రజల కళ్ళనది తెరిపించింది. విశాల ప్రపంచమందలి ఘనత, భాగ్యము, వింతలు వారికి తెలియవచ్చాయి. వారిఊహలు రేగాయి. సాహసకార్యాలు చెయ్యవలెననే ఉత్సాహంవారికి కలిగింది. ధనాశ

రేకెత్తింది. సముద్రసంచార మధికముగా చేయ ప్రోత్సాహము కలిగింది. యూరోపు పెరుగుతోంది. దాని పసినాగరికత తప్పటడుగులు వేస్తోంది, మధ్యయుగములు పెట్టిన కట్టుబాట్లనుండి బయటపడవలెనని ప్రయత్నిస్తోంది. యౌవనావస్థ చెందబోతూన్న పడుచువానివలె అది ఉత్సాహముతో నిండిఉంది. సముద్రసంచారము చేయవలెననే ఈ ప్రేరణా, ధనాన్వేషణపరత్వమూ, సాహసకార్యములు చేయవలెననే ఉబలాటమూ ముందుకాలములో ఈ యూరోపియనులను గుడ్‌హోపు కేపు చుట్టించి అమెరికాకు, పసిఫిక్కుకు, ఇండియాకు, చీనాకు, జపానుకు తీసుకువెళ్ళినవి. సముద్రము ప్రపంచమునకు రహదారియైనది. భూఖండముల మధ్యగా పోవు ప్రయాణమార్గములు నానాటికి ప్రాముఖ్యము గోల్పోయినవి.

మార్కో వెళ్ళిపోయినతోడనే గొప్పఖానైన కుబ్లైఖాను మరణించాడు. అతడు చీనాలో ప్రతిష్ఠించిన యుఆన్ రాజవంశము అతడు మరణించిన పిమ్మట ఆట్టేకాలము నిలువలేదు. మంగోలు ప్రభుత్వము త్వరత్వరగా సన్నగిల్లింది. పరదేశులకు వ్యతిరేకముగా జాతీయోద్యమం చీనాలో తలయెత్తింది. 60 సంవత్సరముల లోపు కాలములో మంగోలులు దక్షిణచీనానుండి తరుమగొట్టబడిరి. నాన్‌కింగ్‌వద్ద ఒక చీనాదేశస్థుడు చక్రవర్తిగా పనిచేస్తున్నాడు. మరి 12 సంవత్సరములలో —1368 లో— యుఆన్ రాజవంశము చివరకు అంతరించింది. మంగోలులు గొప్పగోడ వెలుపలివరకూ తరుమగొట్టబడ్డారు. మరి యొక చీనారాజవంశము —తాయ్‌మింగ్ రాజవంశము— రంగములో ప్రవేశించింది. దీర్ఘకాల మీరాజవంశము —సుమారు 300 సంవత్సరములు— చీనాలో రాజ్యము చేసింది. మంచి పరిపాలనము, ప్రజాసౌఖ్యము, సంస్కృతీ ఈ కాలములో ఉండెను. అన్యదేశములను

జయించుటకుగాని, సామ్రాజ్యస్థాపనకుగాని ఎట్టి ప్రయత్నమూ జరుగలేదు.

చీనాలో మంగోలు సామ్రాజ్య మంతరించుటవల్ల చీనాకు యూరోపుకు ఉండే సంపర్కం పోయింది. నాటుమార్గములు భద్రముగా లేవు. సముద్రమార్గములింకా పరిపాటిగా ఉపయోగించడంలేదు.

## 70

# రోమన్ చర్చి యుద్ధోన్ముఖమగుట

జూన్ 28, 1932

నూర్గురు విద్యార్థికులను చీనాకు పంపమని కుబ్లైఖాను పోపుకు వర్తమానము పంపినట్లు నీకు చెప్పియున్నాను. పోపు పంపలేదు. అప్పుడతడు చిక్కులలో ఉన్నాడు. ఫ్రెడరిక్కు II చక్రవర్తి చని పోయినపిమ్మట 1250 నుండి 1273 వరకు చక్రవర్తిలేడు. అది నీకు జ్ఞాపకమున్నదనుకొంటాను. మధ్యయూరోపు ఆ కాలమున భయంకర స్థితిలో ఉండెను. అల్లరులు చెలరేగుచుండెను. బందిపోటు నైటులు అంతటా కొల్లగొట్టుచుండిరి. 1273 లో హాప్సుబర్గుకు చెందిన రూడాల్ఫు చక్రవర్తి అయ్యెను. కాని పరిస్థితులు బాగుపడలేదు. సామ్రాజ్యమునుంచి ఇటలీ చీలిపోయెను.

రాజకీయసంబంధమగు అల్లరులేకాదు. రోమన్ చర్చి అభిప్రాయముప్రకారము మతమునకు సంబంధించిన అల్లరులుకూడా అప్పుడే ప్రారంభమయినవి. చర్చిదత్తరువులను వినయవిధేయతలతో ప్రజలు శిరసావహించడం మానుకొన్నారు. వారు సందేహించడం మొదలు పెట్టారు. మతవిషయాలలో సందేహమునేది చాలా ప్రమాదకరమైనది. ఫ్రెడరిక్కు II చక్రవర్తి, పోపుతో ముఖావంగానున్నతనివిన్నీ, లక్ష

ష్కారాన్ని అట్టే లెక్కపెట్టడం లేదనిన్నీ తెలుసుకున్నాము. వ్రాత మూలకంగా అతనితో వాదంకూడా పెట్టుకొన్నాడు. కాని ఈ వాదంలో పోపు తన సిద్ధాంతాన్ని నిలబెట్టుకోలేకపోయాడు. అతని కాలములో యూరోపులో ఫ్రెడరిక్కు వలెనే సందేహించేవారు అనేకమంది ఉండ వచ్చును. సందేహాలు పెట్టుకోకపోయినా, చర్చి చెప్పినదానికి అడ్డం కాలు చెప్పకపోయినా, చర్చికి సంబంధించిన పెద్దవాళ్ళ లంచగొండితనము, భోగలాలసత్వమూ ఇష్టపడనివాళ్ళు మాత్రము అనేకమంది ఉన్నారు.

క్రూసేడులు అవమానకరంగా పరిణమిస్తున్నాయి. పెద్ద పెద్ద ఆశలు పెట్టుకొని, ఉత్సాహంతో వాళ్ళు ప్రారంభించారు. కాని ఏమీ చెయ్యలేకపోయారు. అటువంటి పరాజయాలవల్ల ప్రజలకు వ్యతిరేకాభిప్రాయాలు కలుగుతాయి. అప్పుడున్న చర్చితో తృప్తిపొందక, జ్ఞానము ఇతరత్రా లభ్యమవుతుందేమోనని వారు చూడమొదలుపెట్టారు. చర్చి హింసామార్గ మవలంబించి ప్రతీకారంచేసింది. ప్రజలను భీతావహులను చేసి వారి మనస్సులు తనస్వాధీనంలో ఉంచుకోవాలని ప్రయత్నించింది. కాని మానవుని మనస్సు నమ్మదగ్గది కాదు. పశుబలము దాని నేమీ చేయలేదు. ఈ విధముగా చర్చి, వ్యక్తులయొక్కయు సంఘముల యొక్కయు అంతరాత్మ ప్రబోధములను అణచివేయ ప్రయత్నించింది. హేతువాదముద్వారాను, చర్చద్వారాను సందేహము నివర్తించడానికి బదులు చర్చి, దుడ్డుకర్రద్వారాను, మనుష్యులను కట్టివేసి తగులబెట్టు స్తంభముద్వారాను సందేహముల నెదుర్కొన ప్రయత్నించింది.

1155 సంవత్సరములోనే చర్చి తన క్రోధమును ప్రజారంజకుడగు మతబోధకునిపై చూపినది. అతనిపేరు ఆర్నోల్డు. అతడు ఇటలీవాడు. మతగురువుల దుర్నీతిని, భోగప్రీతిని అతడు ఖండించెను. అందుకుగాను అతనిని పట్టుకొని ఉరితీశారు. అతని మృత

కళేబరాన్ని దహనముచేసి ఆ బూడిద రైనునదిలో కలిపారు. బూడిద నదిలో వెయ్యడానికి కారణం ప్రజలు దానిని జ్ఞాపకచిహ్నముగా ఉంచుకుంటారేమోనని. చివరవరకు ఆర్నోల్డు శాంతముగా చలించకుండా ఉండెను. మానవసంఘములుకాని, క్రైస్తవతెగలు కాని, చిన్న మతవిషయములో అభిప్రాయభేదము పెట్టుకొన్నా, మతగురువులను అమితంగా విమర్శించినా, వాటిని పోపులు బహిష్కారం కూడా చేసేవారు. ప్రజలమీద క్రూసేడులుకూడా ప్రకటించారు. అసహ్యము కలిగించే అన్నివిధములగు భయంకర క్రూరకృత్యములూ ప్రజలపట్ల ప్రయోగించారు. దక్షిణఫ్రాంసులోని టోలోజులోని ఆల్బిజియోస్ (ఆల్బిజెంసీసు) అను వారిపట్లా, వాల్డో అనువాని అనుచరులైన వాల్డెన్సీసు అనువారిపట్లా ఈ విధముగానే ప్రవర్తించారు.

ఈ కాలమునందో, ఇంతకు కొంచెము ముందుగానో ఇటలీలో ఒక పురుషుడుండేవాడు. క్రైస్తవ ప్రపంచములో మిక్కిలి మనోహరపురుషు డతడు. అతడు ఫ్రాంసిస్ ఆఫ్ అస్సిసీ. అతడు భాగ్యవంతుడు. కాని తన భాగ్యమును త్యజించి అతడు దరిద్ర జీవనము గడప శపథము చేశాడు. రోగులకూ, బీదవారికీ సేవ చేయ సంకల్పించి అతడు ప్రపంచములో ప్రవేశించాడు. కుష్టురోగులు అందరికన్న దుఃఖభాజనులు. వారిని చూచేవారెవరూ ఉండరు కాబట్టి అతడు ముఖ్యముగా వారికి పరిచర్య చేయపూనుకొన్నాడు. అతడొక సంఘమును స్థాపించాడు. దానికి సేంటు ఫ్రాంసిస్ సంఘమని పేరు. అది బౌద్ధసంఘమువంటిదే. మతబోధచేయుచు, మానవసేవ చేయుచు అతడు దేశసంచారము చేశాడు. క్రీస్తు బ్రదికిన విధముగా తాను కూడా బ్రదుకవలెనని అతడు ప్రయత్నించాడు. ప్రజ లనేకులు అతనికడకు వచ్చేవారు. అనేకులు అతని శిష్యులైనారు. క్రూసేడులు జరుగుచున్న కాలమునందే ఈజిప్టుకును,

పాలస్తీనాకును కూడ అతడు వెళ్ళెను. కాని, అతడు క్రైస్తవుడైనప్పటికిన్ని మస్లిములు ఆసాధుపురుషుని, ఆ ప్రేమాస్పదుని గౌరవించారు. అతనికి ఎట్టి ఆటంకములూ కల్పించలేదు. అతడు 1181 మొదలు 1226 వరకు జీవించియుండెను. అతని మరణానంతరము అతని సంఘమునకును, చర్చియొక్క ఉన్నతోద్యోగులకును విరోధము వచ్చింది. దరిద్రజీవనమంత ప్రధానమని చెప్పడం బహుశా చర్చికి ఇష్టంలేదు కాబోలు. ఇట్టిఆదిమ క్రైస్తవసిద్ధాంతమును చర్చివారు గడచిపోయారు. నలుగురు ఫ్రాంసిస్ సంఘసన్యాసులను, మతాంతరులని పేరుపెట్టి మార్సైల్సులో 1318 సంవత్సరమున నిండు జీవులను దహనము చేసి చంపారు.

అస్సిసీ అనే చిన్నపట్టణంలో సేంటు ఫ్రాంసిస్ గౌరవార్థము కొద్ది సంవత్సరములకు పూర్వ మొక గొప్ప ఉత్సవము జరిగింది. అప్పుడది ఎందుకు జరిగిందో నాకు జ్ఞాపకం చాలదు. బహుశా అతడు మరణించి 700 సంవత్సరములైనది కాబట్టి ఉత్సవము చేసిఉంటారు.

ఫ్రాంసిస్కన్ సంఘమువంటిదే వేరొక సంఘము చర్చిలో తల యెత్తింది. ఆశయాలలో దానికీ దీనికీ ఎట్టిపోలికలూ లేవు, దానిని స్థాపించినవాడు స్పానియర్డు అయిన సేంటు డోమినిక్. సంఘము పేరు డోమినికన్‌సంఘము. ఇది పూర్వాచారావలంబి. కలహమును ప్రారంభించు స్వభావము దీనికున్నది. క్రైస్తవ సిద్ధాంతములపై విశ్వాసము నిలుపుట పరమధర్మమనిన్నీ, మిగత విషయము లన్నియు దానితరువాతనే రావలెననిన్నీ వారి అభిప్రాయము. మంచిమాటలు చెప్పి ఇట్లు చేయించలేకుంటే బలవంతముచేసియైనా చేయించేవారు.

1233 సంవత్సరమున, ఇంక్విసిషన్ (ధర్మవిచారణ సభ) ప్రారంభించినప్పుడే చర్చి అధికారరీత్యా మతవిషయమున హింసాత్మక పరిపాలనము ప్రారంభించింది. ఇంక్విసిషన్ ఒకవిధమైన కోర్టు.

ప్రజల నమ్మకములు పూర్వాచారబద్ధముగా నున్నవా ? లేవా ? అని అది విచారణ చేయును. వారు పెట్టుకొన్న ప్రమాణమునకు తగ్గినస్లైన సాధారణముగా అట్టివారిని దహనము చేసి చంపువారు. ఖిస్టుమతావలంబులను పట్టుకోవలెనని వేటాడేవారు. అట్టివారిని వందలకొద్ది పట్టుకొని స్తంభమునకు కట్టి తగులబెట్టేవారు. ఇంతకన్న ఘోరమైన దండన, వారిని చిత్రహింస చేయుట. వారు నమ్మినదానిని కాదని త్రిప్పుకొనువరకూ ఇట్లు చేసేవారు. అనేకమంది దురదృష్టవంతురాండ్రగు స్త్రీలను, మంత్రకత్తెలనే నేరం వారిమీద మోపి, తగలబెట్టారు. కాని ఈ తగులబెట్టినవారు తరుచు— ముఖ్యముగా ఇంగ్లాండులోను, స్కాట్లెండులోను— మనుష్యుల మూకలే. ఇంక్విసిషన్ ఉత్తరువుపై ఇది జరుగలేదు.

పోపు "మతసిద్ధాంత శాసనము" ను (Edict of Faith) జారీ చేసెను. దాని ప్రకారము ప్రతి మనుష్యుడును నేరస్థులను బయలుపరచవలెను. రసాయన శాస్త్రమును పోపు నిషేధించెను. దానిని రాక్షసవిద్య అనెను. ఈ హింసావ్యాపారము, ఈ భయంకరత్వము అంతా వారు సద్భావంతో చేసినదే. ఆ మనుష్యుని స్తంభమునకు కట్టి తగులబెట్టుటవల్ల అతని ఆత్మను రక్షిస్తున్నామనీ లేదా ఇతరుల ఆత్మను రక్షిస్తున్నామనీ వారు నమ్మారు. మతప్రవిష్టులు తరుచు ఇతరులపై తమ అభిప్రాయములు రుద్ది ఆ విధంగా వారు సంఘసేవ చేస్తూన్నట్టు భావిస్తారు. భగవంతుని పేరుచెప్పి వారు హత్యలు చేశారు. చావులేని ఆత్మను రక్షించడానికని దేహాన్ని బాధిదచేయడానికి వారు సందేహించలేదు. మతముపేర జరిగిన కార్యములనుబట్టి చూస్తే మతచరిత్ర చాలా నికృష్టముగా ఉన్నదని చెప్పవలెను. కాని హృదయములేని క్రౌర్యాన్ని ప్రవర్తింపజేసిన సంస్థ ఇంక్విసిషన్ తప్ప

మరేదీ లేదని నాకు తోస్తుంది. దీనికి బాధ్యులైన పలువురు, ఆత్మ లాభముకోసం కాకుండా న్యాయకార్యము చేస్తున్నామనే నమ్మకంతో ఈ పని చేశారు. ఇది ఎంత ఆశ్చర్యకరము!

పోపు లీవిధముగా భీతావహప్రభుత్వమును యూరోపులో చెలాయిస్తూ ఉండగా రాజులమీదా, చక్రవర్తులమీదా ప్రభుత్వము నెరపేవారి పలుకుబడి సన్నగిల్లజొచ్చింది. చక్రవర్తిని బహిష్కరించే రోజులూ, భయపెట్టి తమకు లొంగునట్లు చేసుకొనేరోజులూ గడచిపోయాయి. పవిత్రరోమక సామ్రాజ్యము చిక్కులలో నున్నప్పుడూ, చక్రవర్తి లేనప్పుడూ లేదా చక్రవర్తి రోముకు దూరముగా ఉన్నప్పుడూ, ఫ్రాంసు రాజు పోపు చేసేపనుల కడ్డువచ్చాడు. 1303 లో పోపు చేసినపనికి రాజు అసంతుష్టి వెల్లడించాడు. అతడొక మనిషిని పోపువద్దకు పంపాడు. ఆ మనిషి పోపు సొంతభవనములో ఉన్న పడకగదిలోకి తోసుకుపోయాడు. అతని మొహంమీద అక్కడ అతణ్ణి దూషించాడు. ఏ దేశంలోనూ ఇట్లా పోపును పరాభవించడం మంచిది అని ఎవరూ అనలేదు. కనొస్సవద్ద జోళ్ళులేకుండా మంచులో నడిచివచ్చిన చక్రవర్తి నాటి పరిస్థితిని దీనితో పోల్చిచూడు!

కొద్దిసంవత్సరాలైన పిమ్మట 1309లో ఫ్రెంచిదేశస్థుడైన ఒక కొత్తపోపు ఫ్రాంసులో అవిగ్నన్‌వద్ద కాపురము ఏర్పాటు చేసుకొన్నాడు. ఫ్రెంచిరాజులు చెప్పినట్లు వింటూ 1377 వరకూ అతడక్కడ నివసించాడు. మరుసటి సంవత్సరం 1378 లో "కాలేజి ఆఫ్ కార్డినల్సు"లో భేదాభిప్రాయాలు పుట్టాయి. సభ్యులు రెండు చీలిక లయ్యారు. దీనికే గొప్ప విభేదము (The Great Schism) అంటారు. ఒక పక్షమునకు చెందిన కార్డినలులు ఒక పోపును, రెండవపక్షమునకు చెందిన కార్డినులు ఇంకొక పోపును ఇట్లు ఇద్దరు పోపులను ఎన్నుకున్నారు. ఒక పోపు రోములో నివసించేవాడు.

చక్రవర్తియు, ఉత్తరయూరోపులోని పలుదేశములును అతనిని అంగీకరించారు. రెండవ పోపును ఆంటి – పోపు అనేవారు. అతడు అవిగ్నన్‌లో నివాస మేర్పరచుకొన్నాడు. ఫ్రాంసురాజూ, అతని మిత్రులూ రెండవపోపు నంగీకరించారు. 40 సంవత్సరముల కాల మిట్లా జరిగింది. పోపూ, ఆంటీపోపూ ఒకరి నొకరు శపించుకొన్నారు. ఒకరి నొకరు బహిష్కరించారు. 1417 లో వారికి రాజీనామా కుదిరింది. ఒక కొత్తపోపును ఉభయపక్షములవారూ ఎన్నుకొన్నారు. అతని నివాసము రోము. కాని ఇద్దరు పోపులకూ జరిగిన అనుచితమైన యీ కలహము యూరోపుప్రజల హృదయములలో మార్పు తెచ్చిపెట్టింది. "వికారులు"ను (Vicars), భూమిపై భగవంతుని ప్రతినిధుల మనుకొనువారును ఈ విధముగా ప్రకటించినట్లయితే ప్రజలకు, వారు పవిత్రులేనా? వారు చెప్పుమాటలు నిజమేనా? అనేసందేహం కలుగుతుంది. మతాధికారమునకు కళ్ళుమూసుకొని తలయొగ్గే ఆచారం సడలడానికి ఈ కలహం సహాయం చేసింది. కాని పరివర్తన మింకా చాలదు.

చర్చిని బాహాటంగా విమర్శించడానికి పూనుకొన్నవారిలో ఒకడు వైక్లిఫ్ అనే పేరుగల ఇంగ్లీషువాడు. అత డొక మతగురువు. ఆక్సుఫర్డులో ఆచార్యుడు. బైబిలును మొట్టమొదట ఇంగ్లీషు భాషలోనికి తర్జుమాచేసి ప్రసిద్ధి నందినవా డీతడు. బ్రదికిఉన్న కాలములో రోముయొక్క క్రోధమునుండి అత డెట్లో తప్పించుకొనెను. కాని అతడు చనిపోయిన 31 సంవత్సరములకు 1415 లో ఒక చర్చి సంఘము అతని అస్థికలను తవ్వించి కాల్పించివేసింది.

వైక్లిఫ్ అస్థికలు అపవిత్రము చేయబడినప్పటికీ, అవి తగుల బెట్టబడినప్పటికీ, అతని అభిప్రాయములు మాత్రము చావలేదు. అవి వ్యాపించినవి. అవి బొహీమియా వైతము పోయినవి. (బొహీమి

యానే నేడు జెకోస్లోవాకియా అంటారు). అక్కడ జాన్ హస్ అను వాడు వాటిని మెచ్చుకొన్నాడు. అతడు ప్రేగ్ విశ్వ విద్యాలయా ధ్యక్షుడు. అట్టి అభిప్రాయములు పెట్టుకొన్నందుకు పోపు అతనిని బహిష్కరించాడు. అతని స్వగ్రామంలో అతనికి చాలా పలుకుబడి ఉన్నందువల్ల అతనిని ఏమీ చేయలేకపోయారు. కాబట్టి అతనిని మోసం చేశారు. స్విట్జర్లాండులో కాంస్టన్సుకు రమ్మని అతనిని ఆహ్వానించారు. అక్కడ చర్చిసంఘము సమావేశము జరుగుతోంది. చక్రవర్తి ప్రమాదరహితముగా అతడు ప్రయాణము చేసే ఏర్పాట్లు చేశాడు. హస్ వెళ్ళాడు. తన తప్పును ఒప్పుకోమని వారు కోరారు. తప్పు అని తనకు నమ్మకము కలిగితేతప్ప ఒప్పుకోనని అతడు నిరాకరించాడు. వారు చేసిన వాగ్దానానికి వ్యతిరేకంగా, ప్రమాదరహితంగా ప్రయాణం చేయిస్తానన్న చక్రవర్తి మాటకు వ్యతిరేకంగా, అతనిని తగులబెట్టి చంపారు. ఇది క్రీ. శ. 1415 లో జరిగింది. హస్ చాలా ధైర్యశాలి. తనకు తప్పు అని తోచినదానిని చెప్పడానికి బదులు బాధాకరమైన మృత్యువు నోట్లో ప్రవేశించడమే మంచిదను కొన్నాడు. స్వేచ్ఛగా ఆలోచించుటకు, స్వేచ్ఛగా చెప్పుటకు హక్కునతడు స్థాపించాడు. అతడు మతమునకై ప్రాణము అర్పించాడు. జెకు ప్రజలకు అత డొక వీరుడు. నేడు సైతము జెకోస్లోవాకియాలో అతనిని తలుచుకొని గౌరవిస్తారు.

జాన్ హస్ మరణము ఊరికే పోలేదు. బొహిమియాలో అతని అనుచరుల తిరుగబాటు అనే అగ్నిని అంటించడానికి అది ఒక అగ్ని కణమువలె పనిచేసింది. వారిమీద పోపు క్రూసేడు ప్రకటించాడు. క్రూసేడులు చాలా చౌక. వాటివల్ల ఖర్చులేదు. వాటివల్ల లాభము పొందడానికి సిద్ధంగాఉన్న దుర్మార్గులూ, దుండగీళ్ళూ అనేకమంది ఉంటారు. ఈ క్రూసేడులు అమాయికులగు ప్రజలను దుర్భర

క్రౌర్యము పొందజేశాయని హెచ్. జి. వెల్సు చెప్పుతున్నాడు. కాని హస్ అనుచరుల సైన్యము తమ యుద్ధగీతము పాడుకొంటూ వచ్చి నప్పుడు క్రూసేడరులు పలాయనమయారు. వచ్చిన దారినే వారు త్వరితంగా వెళ్ళారు. అమాయికులగు గ్రామస్థులను చంపుట, కొల్లగొట్టుట సాధ్యమైనప్పుడు క్రూసేడరుల యుద్ధోత్సాహంతో ఉండేవారు. కాని పోరాడుట కేర్పాటు చేసుకొని వచ్చినవారిని చూడడంతోనే వారు పారిపోయారు.

ఈ విధముగా నిరంకుశము, విమూఢము అగు మతముమీద తిరుగుబాట్లు, పితూరీలు పరంపరగా జరగడానికి ప్రారంభమయాయి. ఇవి క్రమంగా యూరోపంతా అలుముకొన్నాయి. యూరోపు రెండు పక్షములుగా చీలిపోయింది. క్రైస్తవము రెండు భాగాలుగా, కాతలిక్కు లనీ, ప్రాటస్టంటు లనీ చీలనైయున్నది.

## 71

## అధికారతత్వముతో పోరాటము

జూన్ 30, 1932.

యూరోపులోని మతకలహములగాథ నీకు విసుగుగా ఉండవచ్చు. కాని ఈ వృత్తాంతము అవసరము. నేటి యూరోపు ఎట్లు అభివృద్ధిచెందినదీ వాటినిబట్టి మనము తెలిసికోవచ్చును. యూరోపును అర్థము చేసుకోవడానికి అవి పనికివస్తవి. 14 వ శతాబ్దిలోనూ, తర్వాతనూ మతస్వాతంత్ర్యమునకై యూరోపులో చెలరేగిన పోరాటమున్నూ, రాజకీయ స్వాతంత్ర్యము కోసము తర్వాత చెలరేగిన పోరాటమున్నూ నిజమునకు ఒకేపోరాటముయొక్క రెండు అంశలు. అధికారము మీదను, అధికార తత్వము మీదను లేవనెత్తిన పోరాటమిది. పవిత్రరోమక సామ్రాజ్యమున్నూ, పోపుమతాధిపత్యమున్నూ

(Papacy) నిరంకుశత్వానికి పెట్టినది పేరు. మానవుని ఉత్సాహమునూ, వీర్యమునూ అణచివేయుట కవి ప్రయత్నించినవి. దైవదత్తాధికారమువల్ల చక్రవర్తి రాజ్యము చేయుచుండెను. పోపుకూడ అంతే. ఇది కాదనడానికి ఎవరికీ అధికారము లేదు. పైనుంచి వచ్చిన ఉత్తరువులను మీరడానికి ఎవరకీ హక్కులేదు. విధేయత గొప్ప సద్గుణమనీ, స్వతంత్రాలోచన పాప హేతువనీ భావించేవారు. కాబట్టి అనాలోచిత విధేయత మంచిదా? స్వాతంత్ర్యము మంచిదా? అనే విషయము తేల్చవలసి ఉండెను. మతాభిప్రాయముల విషయములపై స్వాతంత్ర్యమును పొందుటకూ, రాజకీయ స్వాతంత్ర్యముకొరకూ అనేక శతాబ్దుల కాలము యూరోపులో పోరాటము జరిగెను. అనేక పర్యాయములు కిందా మీదా పడ్డాక, ఎన్నో బాధలు అనుభవించాక కొంత వరకు విజయము వారికి చేకూరింది. ప్రజలు స్వాతంత్ర్య గమ్య స్థానాన్ని చేరామని సంతోషిస్తూన్న సమయములో వారికొక ఊహ పట్టింది. తాము పొరబడ్డామనీ నిజమైన స్వాతంత్ర్యము తమకు రాలేదనీ వారు తెలుసుకొన్నారు. ఆర్థిక స్వాతంత్ర్యము లేనినాడు దారిద్ర్యము దేశములో నిలిచియుండగా నిజమగు స్వాతంత్ర్యముండదు. కడుపు మండి చస్తూన్నవాడిని నీవు స్వతంత్రుడవనడం అతనిని పరిహసించడమే. కాబట్టి తరువాత చేయవలసిన పని ఆర్థికస్వాతంత్ర్యము కోసము పోరాడడమే. నేడు ప్రపంచమందంతటా ఈ పోరాటము జరుగుచునే ఉన్నది. ఒక్కదేశములో మాత్రము ప్రజలు ఆర్థిక స్వాతంత్ర్యము గడించగలిగిరని చెప్పవచ్చును. ఆ దేశము రష్యా. దానినిప్పుడు సోవియట్ యూనియన్ అంటున్నారు.

మత స్వాతంత్ర్యమునకై ఇండియాలో అట్టి పోరాటము జరుగలేదు. ఎందువల్ల ననగా తొలిరోజులనుండి ఈ హక్కు ప్రజలకున్నది. కాదని ఎవ్వరును చెప్పినట్లులేదు. ప్రజలు తమ కిష్టము

వచ్చిన ఏ విషయమునైనను నమ్మకము పెట్టుకోవచ్చును. బల వంతములేదు. ప్రజలను ఒప్పించవానికి సాధనములు చర్చయును, వాదమును, దండనయును, దహనస్తంభములును కావు. అప్పుడప్పుడు బలవంతమును, హింసయును ఉండవచ్చును కాని ప్రాచీన ఆర్యసంప్రదాయము ప్రకారము ప్రతివానికిన్నీ మతవిషయమున స్వేచ్ఛ వహించుటకు హక్కున్నది. దీని ఫలితమంత తృప్తికరముగా లేదన్న వింతగా తోచవచ్చును. మతవిషయములలో స్వేచ్ఛ వహించుటకు వారికి హక్కున్నది కాబట్టి ప్రజలు ఆ విషయమున అప్రమత్తులుగా లేరు. క్రమక్రమముగా వారు నీచస్థితికివచ్చిన మతము యొక్క ఆచారకాండలోను, మూఢవిశ్వాసములలోను తగుల్కొన్నారు. వెనుక కెంతోదూరము పోయిరి. మతాధికారమునకు దాసులైరి.

ఈ యధికారము పోపు గాని మరి ఇతర పురుషుడు గాని చెలాయించేది కాదు. ఈ అధికారము "పవిత్రగ్రంథములు"ది. ఆచారములది, సంప్రదాయములది. కాబట్టి స్వాతంత్ర్యము మనకున్నదని చెప్పుకొని గర్విస్తూన్నప్పటికిన్నీ నిజమునకు మన కది లేదు. ప్రాచీన గ్రంథములును, ఆచారములును, మనకు నచ్చచెప్పిన అభిప్రాయములే మనలను బంధించివేసినవి. అధికారమున్నూ, అధికార తత్వమున్నూ మనలను పాలిస్తున్నాయి. మన మనస్సులను స్వాధీనము చేసుకొన్నాయి. దేహమును బంధించే సంకెళ్ళు చెడ్డవి నిజమే కాని మనస్సును బంధించే అభిప్రాయములు, దురభిమానములు అనే కంటికి కనిపించని సంకెళ్ళు అంతకన్న చెడ్డవి. అవి మనము తగిలించుకొన్నవే. అవి ఉన్నవనే సంగతి తరుచు మనకు తెలియక పోయినా అవి మాత్రము మనలను గట్టిగా పట్టుకొని నలిపివేస్తాయి.

దండెత్తి ఇండియాకు వచ్చిన ముస్లిముల రాకతో మతములో కొంత బలాత్కారము ప్రవేశించింది. విజేతకున్నూ, విజితులకున్నూ

మధ్య జరిగిన పోరాటము రాజకీయమైనదే. కాని దానికి మతవాసన పట్టించారు. అప్పుడప్పుడు మతముపేర హింసకూడా చేస్తూ ఉండే వారు. కాని ఇస్లాం మతము అట్టి హింసను ఒప్పుకొన్నదని అను కొనడము తప్పు.

1610 సంవత్సరములో, మిగత అరబ్బులతో కూడా ఒక స్పానిష్ ముస్లిమ్ పెద్దమనిషి స్పెయినునుంచి తరుముగొట్టబడ్డప్పుడు అతడు చేసిన ఉపన్యాసము చదవడానికి ఇంపుగా ఉన్నది. ఇక్విసిషణ పట్ల అతడు తన అసమ్మతిని తెలుపుతూ ఇట్లన్నాడు—"విజేతలైన మా పూర్వీకు లెన్నడైనా స్పెయినులో క్రైస్తవమును తుదముట్టించ ప్రయత్నించారా? అట్లు చేయగల శక్తి వాళ్ళకున్నదే. మీ పూర్వీ కులు మా వారికి లోబడిఉన్నా వారి కిష్టము వచ్చిన ఆచారకర్మలు యధే చ్ఛగా వారు చేసుకోలేదా? బలవంతాన మతము మార్పించిన సంద ర్భములు కొన్ని కలవు. అయితే అవి చాలా అరుదు కాబట్టి పేర్కొ నవలసిన అవసరము లేదు. బలవంతాన మతము మార్పించిన మనుష్యులు దైవభీతిగాని, ప్రవక్తభీతి గాని లేనివాళ్ళు. అట్లు చేయుట ముస్లిముమత బోధలకుసూ, సిద్ధాంతములకుసూ వ్యతిరేకము. ముసల మాను అను గౌరవభాజనమగుపేరు ధరించడానికి అర్హులైనవాళ్ళెవళ్ళూ ఇస్లాం ఉపదేశములను ఉల్లంఘించరు. అట్లు చేస్తే దైవదూషణ చేసి నట్లే అగును. మతవిషయమున భిన్నాభిప్రాయను లుండుట కారణ ముగా మాలో క్రూరమైన ధర్మవిచారణ సంఘములు —అతిదుష్టమైన మీ ఇంక్విసిషన్ వంటివి— పుట్టవు. మా మతము నవలంబించు వారిని రెండు చేతులతోను ఆహ్వానింతుము. కాని విశ్వాసము లేని వారిని పీడించుటకు పవిత్రమగు మా కురాను సమ్మతించదు."

మతసహనము, నమ్మినదాని ననుసరించుటకు స్వేచ్ఛ ప్రాచీన హిందూసంఘలక్షణములైనప్పటికీ అవి మన చేతులలోనుండి కొంత

వరకు జారిపోయాయి. యూరోపులో ఇవి సాధించుటకు అనేక పోరాటాలు జరిగాయి. యూరోపు మనలను దాటిపోయి వీటిని సాధించుకొన్నది. నేడు, అప్పుడప్పుడు, ఇండియాలో మతకలహాలు జరుగుచున్నాయి, హిందువులూ ముసలమానులూ దెబ్బలాడి ఒకరి నొకరు చంపుకొందురు. కొన్నిస్థలములలో ఇవి అప్పుడప్పుడు సంభవించుననుమాట నిజమే. అయినా చాలావరకు మనము శాంతముగా, స్నేహభావముతో నివసిస్తున్నాము, మన ఆశయములు ఒక్కటే. మతము పేరుచెప్పి ఒక హిందువు కాని. మహమ్మదీయుడు గాని తన సోదరుణ్ణి చంపడం సిగ్గుచేటుకాదా ? మనము ఈ పరిస్థితుల్ని తుద ముట్టించాలి. తుదముట్టిస్తాము కూడా. ముఖ్యమైన విషయ మేమనగా ఆచారము, సంప్రదాయము, మూఢవిశ్వాసములు అను క్లిష్ట భావములనుండి మనము తప్పించుకోవాలి, ఇవి, మతము పేర్న మనకు సంకెళ్ళు తగుల్చుచున్నవి.

మతసహనము విషయమునవలెనే రాజకీయ స్వాతంత్ర్య విషయమున కూడా ఇండియా ముందంజే వేసింది. గ్రామ ప్రజా ప్రభుత్వముల (**Village Republics**) సంగతి జ్ఞాపక మున్నదనుకొంటాను, తొలిరోజులలో రాజుయొక్క అధికారములు పరిమితముగా ఉండెడి వన్నమాట కూడ నీకు జ్ఞాపకముండవచ్చు. యూరోపులో ఉన్నట్లు దైవదత్తాధికారము రాజులకు లేదు. మన రాజ్యాంగపద్ధతి అంతా గ్రామస్వాతంత్ర్యముమీద ఆధారపడి ఉండడంవల్ల రాజు ఎవరైనదీ ప్రజలు తెలుసుకో కుతూహలపడలేదు. స్థానికస్వాతంత్ర్యము చెక్కుచెదరకుండా ఉంటే తమ రాజు ఎవరైనదీ వారి కేం కావాలి ? కాని ఇది ప్రమాదకరమైన తెలివితక్కువ అభిప్రాయము. క్రమక్రమముగా రాజు తన అధికారాన్ని వృద్ధిచేసుకొన్నాడు. గ్రామ స్వాతంత్ర్యానికి భంగం తీసుకువచ్చాడు. ఒక కాలమున పూర్తిగా నిరంకుశులైన

ప్రభువులు మనకు దాపురించారు. గ్రామ ప్రజా ప్రభుత్వం అంతరించింది. పైనుంచి క్రిందివరకూ స్వాతంత్ర్యచిహ్నాలెక్కడా కనిపించకుండా పోయాయి.

## 72

# మధ్యయుగములు గడచిపోవుట

జూలై 1, 1932

13 వ శతాబ్ది మొదలు 15 వ శతాబ్దివరకు ఉన్నకాలమున యూరోపు ఎట్లున్నదో మరొక్కమారు చూతము. తీవ్రముగా అల్లరులూ, హింసా, పోరాటమూ చెలరేగుచుండెను. ఇండియాలో పరిస్థితులుకూడా బాగులేవు. కాని యూరోపుతో పోల్చి చూచినప్పుడు ఇండియా శాంతముగానే ఉన్నదని చెప్పవచ్చును.

మంగోలులు యూరోపుకు తుపాకి మందును తెచ్చిరి. ఇప్పుడు మందుగుండు ఆయుధములు (తుపాకి మొదలైనవి) వాడుకలో నుండెను. రాజులు వీటి సహాయముతో తిరుగబడుచున్న ఫ్యూడల్ కులీనులను అణచివేయుచుండిరి. ఈ కార్యమునకు నగరములలోని వర్తకతరగతులు రాజుకు సహాయము చేయుచుండిరి. కులీనులు తమలో తాము చిన్న చిన్న పోరాటములు సలుపుకొనుచుండిరి. ఇందువల్ల వారు దుర్బలులైరి. ఇందువల్ల గ్రామప్రాంతముల నివసించువారు పీడింపబడుచుండిరి కూడ. రాజు ప్రబలుడు అయినకొలదీ ఈ చిన్న పోరాటములను అణచివేయుచుండెను. కొన్ని ప్రదేశములలో సింహాసనమునకు ప్రతిస్పర్థులిద్దరుండుటచేత అంతఃకలహములు వారిలో వారికి జరుగుచుండెను. ఇంగ్లాండులో రెండు కుటుంబముల కిట్టి పోరాటముండెను. హౌస్ ఆఫ్ యార్కు, హౌస్ ఆఫ్ లంకాస్టరు అనునవి ఈ కుటుంబములు. ఈ రెండు పక్షములవారును చెరియొక రోజా పూవును తమ చిహ్నముగా పెట్టుకొనిరి—ఒకరు తెల్లరోజా, రెండవ

వారు ఎర్రరోజా. ఈ యుద్ధములకందువల్లనే రోజా యుద్ధములు అని పేరు వచ్చెను. ఈ అంతఃకలహములతో ఫూడల్ కులీనులు అనేకులు మరణించిరి. క్రూసేడు యుద్ధములవల్లకూడ వారనేకులు మరణించిరి. ఈ విధముగా క్రమక్రమముగా ఫూడల్ కులీనులు లొంగు బాటులోనికి వచ్చిరి. కులీనుల కైవశమైన అధికారము ప్రజలకు సంక్రమించినదని దీనినిబట్టి మన మూహించరాదు. ప్రబలుడైనవాడు రాజే. ప్రజలు వెనుకటి అవస్థలోనే ఉండిరి. కులీనులలో అంతఃకల హములు అంతరించుటచేత వారి స్థితి కొంతవరకు బాగుపడెను. రాజు మాత్రము నానాటికి ప్రబలుడై నిరంకుశుడాయెను. రాజునకును, కొత్తగావచ్చిన వర్తక తరగతులకును పోరాటము రానైయున్నది.

యుద్ధముకంటెను, హత్యలకంటెను, ఘోరమైన గ్రేటుప్లేగు 1348 ప్రాంతమున యూరోపులో ప్రవేశించెను. అది రష్యా, ఆసియా మైనరులనుండి ఇంగ్లాండువరకునూ యూరోపునందంతటనూ వ్యాపించెను. అది ఈజిప్టుకు, ఉత్తరఆఫ్రికాకు, మధ్యఆసియాకు వెళ్ళి పశ్చిమముగా వ్యాపించెను. దానినే బ్లాకుడెత్తు (Black death) అందురు. జనులు లక్షలుగా దానివాత బడిరి. ఇంగ్లాండు జనసంఖ్యలో మూడవవంతు చనిపోయిరి. చీనాలోను ఇతర ప్రదేశములందును మరణించిన వారిసంఖ్య అపరిమితిముగా నుండెను. అది ఇండియాకు రాకుండుట ఆశ్చర్య కరమే.

దారుణమైన ఈ విపత్తువలన జనసంఖ్య చాలా తగ్గిపోయినది. భూమి దున్నుటకు చాలినంతమంది లేకుండిరి. మనుష్యులు లేకుం డుటవల్ల కూలివాళ్ళకూలి పెరిగినది. ఇదివరలో వారికూలి అసలే తక్కువ. కాని భూమికామందులు, ఆస్తిదారులు పార్లమెంటులను తమ స్వాధీనములో ఉంచుకొనిరి.వారు కొత్తచట్టములు ప్రవేశపెట్టిరి. వెనుకటి చాలీచాలని కూలికే వారు పని చేయవలెను గాని ఎక్కువ కూలి

అడుగరాదు. ఇట్లు వారు బలవంతము చేయబడిరి. వారు అణగ ద్రొక్కబడిరి. స్వప్రయోజనమునకై భాగ్యవంతులు వారిని వాడుకొను చుండిరి. ఇట్టి దుర్భర పరిస్థితులను సహించక కర్షకులునూ, బీద వారునూ తిరుగుబాటు చేసిరి. పడమటి యూరోపునందంతటను ఒక దాని తరువాత నొకటిగా ఈ తిరుగుబాట్లు తలయెత్తెను. ఫ్రాంసులో 1358 సంవత్సరమున కర్షకుల తిరుగుబాటు సంభవించెను (దీనినే జాక్‌రీ అందురు). ఇంగ్లాండులో వాట్ టైలరు తిరుగుబాటు కలిగెను. అప్పుడు 1381 సంవత్సరమున ఇంగ్లీషురాజు మ్రోల టైలరు చంప బడెను. తరుచు ఈ తిరుగుబాట్లు ఎంతో క్రౌర్యముతో అణచివేయ బడినవి. కాని అందరును సమానమనే నూతన భావములు ప్రజలలో మెల్లగా వ్యాపించుచుండెను. మేము ఎందుకు బీదగాఉండి తిండిలేక మాడ వలెను ? ఇతరులు ఎందుకు భాగ్యవంతులుగా ఉండవలెను ? కావల సినదానికి మించిన వస్తువులు సమృద్ధిగా వారి కెందు కుండవలెను ? అని ప్రజలు తమలో తాము ప్రశ్నించుకొనుచుండిరి. కొందరు ప్రభు వులుగా ఉండుట ఏల ? ఇతరులు కమతగాండ్రుగా ఉండనేల ? కొం దరికి ఏల చక్కని బట్టలుండవలెను ? ఇతరులకు ఒళ్లు కప్పుకో డానికి చాలినన్ని గుడ్డపీలికలైనా లేకుండుటకు కారణమేమి ? ఫూడల్ పద్ధతికి ఆధారభూతంగా ఉన్న అధికారానికి లొంగియుండడమనే పాత భావన భగ్నమైపోతోంది. కాన కర్షకులు మళ్లీ మళ్లీ తలయెత్తేవారు. వారు దుర్బలంగా ఉండడంవల్లా, కట్టుగా లేకపోవడంవల్లా అణగగొట్ట బడేవారు. అయినా కొంతకాలానికి మళ్లీ వారు తిరుగుబాటు చేసే వారు.

ఇంగ్లాండును, ఫ్రాంసును అంతరాయం లేకుండా ఒకరితో ఒకరు యుద్ధం చేసుకొంటున్నారు. 14 వ శతాబ్ది మొదటినుంచి 15 వ శతాబ్ది మధ్య వరకూ వారికి "నూరు సంవత్సరముల యుద్ధము"

జరిగింది. ఫ్రాంసుకు తూర్పున బర్గండీ ఉన్నది. ఇది ప్రబలమైన రాజ్యము. ఫ్రాంసు రాజుకింద నామకః ఇది సామంత రాజ్యముగా నుండెను కాని బర్గండీ అల్లరిచేసే పేచీకోరు సామంతరాజ్యము. ఇంగ్లీషువారు దానితోను, ఇతరరాజ్యములతోను ఫ్రాంసుకు వ్యతిరేకంగా కుట్రచేసిరి. కొంతకాలముపాటు ఫ్రాంసు అన్నివైపులా శత్రువులచే చుట్టబడియుండెను. చాలాకాలంపాటు పడమటిఫ్రాంసు చాలా భాగము ఇంగ్లీషువారి స్వాధీనములో ఉండెను. ఇంగ్లీషురాజు తాను ఫ్రాంసు రాజునని కూడా చెప్పుకొనుచుండెను. ఈ విధముగా ఫ్రాంసు నీచస్థితి నందియుండి ఇంక ఆశలేదనుకొనుచున్న కాలమున ఆశ మాత్రమే కాకుండా విజయము కూడా ఒక కర్షకబాలికద్వారా ఫ్రాంసుకు వచ్చింది. జీన్‌డ ఆర్కు (జోన్ ఆఫ్ ఆర్కు) ను గురించి నీకు కొంత తెలుసును. ఆమె ఆర్లియన్సుకు చెందిన కన్యక. ఆమె నీకు నచ్చిన వీర కాంత. నిరుత్సాహులైయున్న తన దేశస్థుల కామె ఆత్మవిశ్వాసము నిచ్చింది. గొప్ప ప్రయత్నములు చేయుటకు వారిని ఆవేశపరచెను. ఆమె నాయకత్వమున ఫ్రెంచివారు ఇంగ్లీషువారిని తమదేశమునుండి తరుముగొట్టారు. ఇంత చేసినందుకు ఆమెకు వచ్చిన బహుమాన మేమో తెలుసునా ? ఇంక్విసిషన్ విచారణా, తీర్పూ, తరువాత స్తంభమునకు కట్టి ఆమెను తగులబెట్టుటా. ఇంగ్లీషువారు ఆమెను స్వాధీనం చేసుకొన్నారు. చర్చిచేత ఆమెను దోషురాలని ఘోషింప జేశారు. పిమ్మట రోన్ (Rouen) బజారులో, 1430 సంవత్సరమున, ఆమెను తగులబెట్టి చంపారు. చాలా సంవత్సరములైన పిమ్మట రోముచర్చి, ఆమెపై దోషురాలని చేసిన తీర్పు రద్దుచేసింది. చాలా సంవత్సరముల తరువాత ఆమెను సేంటునుగా చేశారు.

జీన్ ఫ్రాంసునుగూర్చి ప్రజల కుద్బోధము చేసింది. మాతృ దేశాన్ని విదేశస్థుల పాలననుండి తప్పించాలని చెప్పింది. ఈమాటలు

కొత్తమాటలు. ఆ కాలమున ప్రజలకు ఫ్యూడల్ భావములే ఉండెను. జాతీయత అను భావన వారి తలలలో లేదు. కాన జీన్ చెప్పిన మాటలు వారి కాశ్చర్యమును కలిగించెను. వారి కా మాటలు అర్థము కాలేదు. జీన్ డ ఆర్క్ కాలము మొదలు ఫ్రాంసులో జాతీయభావము అస్పష్టముగా ప్రారంభము కావడం మనము గమనించవచ్చును.

ఇంగ్లీషువారిని తన దేశమునుండి తరిమివేసిన పిమ్మట ఫ్రెంచి రాజు తన కెన్నో కష్టములు కల్పించిన బర్గండీపై తనదృష్టి త్రిప్పెను. ప్రబలుడగు ఈ సామంతరాజు చివరకు లొంగిపోయెను. 1483 ప్రాంతమున బర్గండీ ఫ్రాంసులో భాగమయ్యెను. ఫ్రెంచిరాజప్పుడు ప్రబలుడగు రాజయ్యెను. తన ఫ్యూడల్ కులీనుల నందరినీ అతడు అణచివేసెను లేదా లొంగదీసెను. బర్గండీ ఫ్రాంసులో కలవడంతోనే ఫ్రాంసు జర్మనీదేశములు ఎదురెదురైనవి. వాటి పొలిమేరలు ఒకదాని నొకటి తగులుచుండెను. ఫ్రాంసు ప్రబలమై కేంద్రీకృత ఏకాధిపత్యము (Monarchy) క్రింద నుండెను గాని జర్మనీ దుర్బలముగా అనేక రాష్ట్రములుగా చీలియుండెను.

ఇంగ్లాండు స్కాట్లండును జయించుటకు కూడ ప్రయత్నించుచుండెను. ఈ పోరాటము కూడ దీర్ఘకాలము పట్టెను. స్కాట్లెండు తరుచు ఇంగ్లాండుకు వ్యతిరేకముగా ఫ్రాంసుతో చేరుచుండెను. 1314 సంవత్సరమున రాబర్టుబ్రూసు నాయకత్వమున స్కాటులు ఇంగ్లాండును బానక్ బరన్‌వద్ద ఓడించిరి.

ఇంతకన్న ముందు, 12 వ శతాబ్దిలో ఐర్లాండును జయించవలెనని ఇంగ్లీషువారు ప్రయత్నములు ప్రారంభించిరి. అది 700 సంవత్సరముల పూర్వము. నాటినుండి తరుచు యుద్ధములు, తిరుగుబాట్లు, భయంకరత్వమూ ఐర్లాండులో చెలరేగాయి. ఈ చిన్నదేశము పర ప్రభుత్వమునకు తలయొగ్గ నిరాకరించినది. పరులకు లొంగమని తర తరముల వారు తిరుగుబాటు చేసి చాటించారు.

పదమూడవ శతాబ్దిలో యూరోపులోని మరియొక చిన్న జాతి —స్విట్జర్లాండు,—స్వాతంత్ర్యమునకు తనకు గల హక్కు నిర్ధారణ చేసుకొంది. అది పవిత్ర రోమక సామ్రాజ్య భాగమై యుండెను. ఆస్ట్రియా దానిని పాలించుచుండెను. విలియం టెల్ను అతని కొడుకును గురించినకథ నీవు చదివియుండవచ్చును. బహుశా ఇది నిజము కాదు. ఇంతకన్న ఆశ్చర్యకరమైన విషయము ఆ గొప్ప సామ్రాజ్యముపై స్విస్ కర్షకులు తిరుగబడి దాని పాలనలో నుండనిరాకరించుట. ఉన్న క్యాంటనుల (Cantons—జిల్లాల) లో మూడు మొదట తిరుగబడెను. 1291 సంవత్సరమున వారు ఒక సంఘముగా ఏర్పాటైరి. దానికి "శాశ్వత సంఘము" (Everlasting League) అని పేరు.

1499 లో ఇతర క్యాంటనులు దానితో జేరెను. స్విట్జర్లాండు స్వతంత్ర ప్రజాప్రభుత్వమాయెను. అది వేర్వేరు క్యాంటనుల సంయుక్త సంఘము. దానిని స్విస్ కాంఫెడరేషన్ (Confederation) అందురు. ఆగష్టు మొదటితేదీని స్విట్జర్లాండులో అనేక పర్వత శిఖరములమీద మంటలు మండడం నీకు జ్ఞాపకమున్నదా? అది స్విస్సులకు జాతీయదినము. విప్లవప్రారంభముయొక్క సంవత్సరోత్సవము. ఆస్ట్రియన్ పాలకునిపై తిరుగబడుటకు ఆ మంటలు సంకేతముగా అప్పుడుండెను.

యూరోపులో తూర్పున కాంస్టాంటినోపులులో ఏమి జరుగుచున్నది? క్రీ. వె. 1204 లో లాటిన్ క్రూసేడు వీరులు ఈ పట్టణమును స్వాధీనము చేసుకొన్నారన్నమాట జ్ఞాపకమున్నదా? 1261 లో వీరు గ్రీకులచేత తరుమగొట్టబడిరి. తరువాత గ్రీకులు తూర్పు సామ్రాజ్యమును తిరుగా స్థాపించారు. కాని వేరొక గొప్ప ప్రమాదము వస్తోంది.

ఆసియాగుండా మంగోలుసేనలు ముందుకు వస్తూండగా 50,000

మంది ఆటోమన్ తురుష్కులు వారిని చూచి పారిపోయిరి. వీరు వేరు, సెల్జూకు తురుష్కులు వేరు. ఆటోమన్ తురుష్కుల పూర్వీకుడో, సంస్థాపకుడో ఉత్మన్ లేదా ఆస్మన్ అనువాడు. అందువల్ల వారికి ఆటోమన్ లేదా ఆస్మన్‌లీ తురుష్కులనే పేరు వచ్చెను. పడమటి ఆసియాలోనున్న సెల్జూకులవద్దకు వచ్చి ఈ ఆటోమనులు శరణు వేడుకున్నారు. సెల్జూకులు క్రమక్రమంగా దుర్బలులు కాజొచ్చిరి. ఆటోమనులు ప్రబలులు అయినట్లు తోచును. వారు అన్ని వైపులకు వ్యాపింపదొడగిరి. ఇంతకుముందు అనేకులు కాంస్టాంటినోపులుపై దండెత్తిరి. వీరు మాత్ర మట్లు చేయక దానిని దాటి 1353 లో యూరోపులో ప్రవేశించిరి. వారు త్వరత్వరగా వ్యాపించిరి. బల్గేరియా, సెర్బియాలను వారు స్వాధీనము చేసుకొనిరి. అడ్రియానోపులును తమ రాజధానిగా చేసుకొనిరి. ఈవిధముగా ఆసియాలోను, యూరపులోను కాంస్టాంటినోపులుకు రెండుతట్టులా ఆటోమన్ సామ్రాజ్యము వ్యాపించెను. ఇది కాంస్టాంటినోపులును చుట్టియుండెను. కాని కాంస్టాంటినోపులు సామ్రాజ్యములో చేరియుండలేదు. వేయి సంవత్సరముల కాలము ఉచ్ఛ్రాయోనున్న తూర్పు రోమక సామ్రాజ్యములో నేటికి మిగిలినది ఈ నగరము మాత్రమే. తూర్పు సామ్రాజ్యమును తురుష్కులు త్వరత్వరగా కబళిస్తూన్నప్పటికీ, సుల్తానులున్నూ, చక్రవర్తులున్నూ మిత్రభావముతోనే ఉండిరి. ఆ యా కుటుంబాలు పెళ్లిసంబంధాలుకూడా చేసుకొంటూ ఉండిరి. చివరకు 1453 లో కాంస్టాంటినోపులు తురుష్కుల వశమయ్యెను. ఇక మనము ఆటోమాన్ తురుష్కుల గురించే ప్రసంగించుకొందము. సెల్జూకులు రంగమునుండి నిష్క్రమించిరి.

కాంస్టాంటినోపులు పతనము చాలాకాలంనుంచి అనుకొంటూన్నదే. కాని యూరోపుఅంతా దద్దరిల్లింది. వేయి సంవత్సరముల ప్రాచీన

గ్రీకు తూర్పు సామ్రాజ్యము దీనితో అంతరించిన దన్నమాట. యూరోపుపై వేరొక ముస్లిము దండయాత్ర యన్న మాట. తురుష్కులు వ్యాపించుకొంటూ పోయిరి. ఒకప్పుడు వారు యూరోపంతా జయిస్తారా? అనిపించింది. కాని వియన్నావద్ద వారి గతికి నిరోధం కలిగింది.

సేంటుసోఫియాయొక్క గొప్ప కెతీడ్రలు 6 వ శతాబ్దిలో జస్టీనియన్ చక్రవర్తి నిర్మించాడు. అది ఇప్పుడు మసీదైనది. ఆయాసూఫియా అను పేరు దానికి వచ్చింది. అందలి ధనసంచయము కొంత కొల్లగొట్టబడినది. ఇట్లు జరిగినందుకు యూరోపు ఆవేశ పూరితమైనది కాని అది ఏమీ చేయలేకపోయింది. నిజమునకు తురుష్కసుల్తానులు, ఆర్థొడాక్సు గ్రీకుచర్చి అనిన చాలా సహనము చూపుచుండిరి. కాంస్టాంటినోపులును జయించిన పిమ్మట సుల్తాను మహమ్మదు II తాను గ్రీకుచర్చికి రక్షకుడనని ప్రకటించుకొనెను. తరువాత వచ్చిన ఒక సుల్తాను, ఘనుడగు సులేమాన్ అనేవాడు, తాను తూర్పు చక్రవర్తుల ప్రతినిధినైనట్లు భావించుకొని సీజరు బిరుదమును ధరించెను. పాత సంప్రదాయముయొక్క ప్రాబల్యమంత యుండెను.

కాంస్టాంటినోపులులో, గ్రీకుల దృష్టిలో, ఆటోమన్ తురుష్కులు అంతగా కోరదగనివారు కారని తోస్తుంది. ప్రాచీన సామ్రాజ్యము కూలిపోతూన్నట్లు వారు గమనించారు. పోపుకన్నా, పడమటి క్రైస్తవులకన్నా తురుష్కులు మెరుగు అని వారనుకొన్నారు. లాటిన్ క్రూసేడువీరులు తమపట్ల ఎంత దుర్మార్గముగా ప్రవర్తించారో వారికి అనుభవములో ఉన్నది. 1453 సంవత్సరమున కాంస్టాంటినోపులును తుదిసారి ముట్టడిస్తూన్నప్పుడు ఒక బైజాంటైను కులీనుడిట్లు చెప్పాడు — "పోపు కిరీటముకన్న ప్రవక్త తలపాగాయే ఉత్తమము".

తురుష్క లోకవిధమగు వింతపటాలమును తయారుచేశారు. దానికి జానిసరీస్ అని పేరు. క్రైస్తవులవద్దనుండి కానుకగా క్రైస్తవబాలురను వారు తీసికొనుచుండిరి. వారికే ప్రత్యేక శిక్షణ నిచ్చుచుండిరి. చిన్న బాలురను తల్లిదండ్రులనుండి విడదీయుట క్రూరమే కాని ఈ బాలురకు కొన్ని లాభములు కూడా కలుగుచుండెను. వారు మంచి శిక్షణ నందుచుండిరి. యుద్ధమునకు సంబంధించిన ఒక విధమగు కులీనులశాఖగా వారు తయారగుచుండిరి. జానిసరీస్ పటాలము ఆటోమన్ సుల్తానులకు ప్రాపుగా ఉండెను. జానిసరీ అను పదము—జాన్ అనగా ప్రాణము, నిసార్ అనగా త్యాగము— అను పదములనుండి వచ్చినది. ప్రాణత్యాగము చేయువాడని దానికి అర్థము.

ఇట్టివిధముగానే ఈజిప్టులో జానిసరీస్‌వంటి పటాలము "మామిలూక్సు" అనే పేరుతో నిర్మింపబడినది. ఇది సర్వస్వతంత్రమై ఈజిప్టుకు సుల్తానులనుకూడా సరిఫరా చెస్తూ ఉండెను.

కాంస్టాంటినోపిలును వశము చేసుకొన్నఆటోమన్ సుల్తానులు వారికి ముందున్న బైజాంటైను చక్రవర్తులయొక్క భోగలాల సత్వము నకు సంబంధించిన దురలవాటులను పెక్కింటినీ, దుర్నీతినీ అల వరుచుకొనిరి. బైజాంటైనుల భ్రష్టమైన సామ్రాజ్య పద్ధతి వారిని అలముకొని వారి శక్తిని పీల్చివేసెను. కొంతకాలమువరకు మాత్రము వారు బలముగానే ఉండిరి. క్రైస్తవ యూరోపువారిని చూచి భయ పడుచుండెను. వారు ఈజిప్టును జయించిరి. అప్పుడు కాలీపు బిరుదము అబ్బాసీ ప్రతినిధులవశమై యుండెను. శక్తివిహీనులగు వీరినుండి కాలీపు బిరుదమును వారు గ్రహించిరి. నాటినుండియు ఆటోమన్ సుల్తానులే కాలీపులుగా పేర్కొనబడుచుండిరి. కొద్ది సంవత్సరములకు పూర్వము ముస్తాపా కమల్‌పాషా సుల్తానుపదవినీ, కాలీపుపదవినీకూడ రద్దుచేసెను.

కాంస్టాంటినోపులు పతనమైనదినము చరిత్రలో గొప్పదినము. ఒక శకమంతరించి వేరొక శకప్రారంభము నాటినుండి జరిగినదని చెప్పుదురు. మధ్యయుగములు గడచిపోయినవి. వేయి సంవత్సరముల కాలము నిలిచిన అంధకారయుగములు అంతమునకు వచ్చినవి. యూరోపులో నూతన జీవము నూతన శక్తి కనిపించుచున్నది. దానికి చురుకు పుట్టినది. దీనినే పునరుజ్జీవము (రినేసాన్సు —**Renaissance**) అందురు. విద్యాకళల పునర్జన్మయే ఇది. దీర్ఘ నిద్రనుండి ప్రజలు మేల్కొన్నట్లు కనిపించారు. శతాబ్దులను దాటి వారి చూపు ఉచ్ఛలో నుండిన ప్రాచీన గ్రీకు వైభవముపై వాలినది. అది వారికి మార్గదర్శక మయ్యెను. చర్చి ప్రోత్సహించిన విచార గ్రస్తమగు చీకటిబ్రతుకు అన్నను, మానవుల ఉత్సాహశక్తిని బంధించు సంకెళ్ళు అన్నను వారి మనస్సులకు కిట్టకుండెను. ప్రాచీన గ్రీకుల సౌందర్య పిపాస మరల తలయెత్తెను. చక్కని చిత్రలేఖనముల తోడను, శిల్పముతోడను, వాస్తుపుతోడను యూరోపు ఉత్ఫుల్లమయ్యెను.

కాంస్టాంటినోపులు పతనముగుటతోడనే ఇవన్నియు హఠాత్తుగా కలిగినవని తలచరాదు. అట్లుతలచుట అసంభవము. ఆ నగరమును తురుష్కులు పట్టుకొనుట కారణముగా ప్రజలలో పరివర్తనము చురుకుగా కలిగినది. నగర పతనానంతరము అనేకులు విద్యాధిపులూ, విద్యార్థులూ ఆ నగరమును వదలి పశ్చిమముగా ప్రయాణమై వెళ్ళిరి. ఇటలీకి వారు గ్రీసు సారస్వత సౌభాగ్యమును తీసికొనివెళ్లిరి. దానిని మెచ్చుకొను స్థితిలోకూడ పాశ్చాత్యులుండిరి. ఈ విధముగా చూచిన నగరపతనము, పునరుజ్జీవనమునకు కొద్దిగా దారి తీసెనని భావించ వచ్చును.

కాని అట్టి గొప్పమార్పునకు ఈ కారణము బహు చిన్నకారణమే. ప్రాచీన గ్రీకు సారస్వతమును, భావములును, మధ్యయుగములనాటి

ఇటలీకిని, పాశ్చాత్యులకును క్రొత్తలు కావు. విశ్వవిద్యాలయములలో విద్యార్థులు వాటిని చదువుచుండిరి. విద్యాధికులకు వాటి సంగతి తెలుసును. కాని అవి కొద్దిమందికి మాత్రమే తెలిసియుండెను. నాడు ప్రచారములోనున్న జీవితవిధానములో నది ఇముడకపోవుటచే వ్యాప్తినందలేదు. ప్రజల మనస్సులలో సందేహబీజములు అంకురించుటవల్ల, మెల్లమెల్లగా నూతన జీవితవిధానమునకు దోహదము జరిగింది. ఉన్నవస్తువులతో వారికి సంతుష్టి లేకుండెను. అంతకన్న సంతుష్టినిచ్చే ఏదో ఒకదానికై వెదుక మొదలుపెట్టిరి. వారిట్టి సందేహస్థితిలో నుండగా, ఏదియో క్రొత్తవిషయము తమకు సంతుష్టి నిచ్చునను ఆశతో ఉండగా వారి మనస్సులకు క్రైస్తవేతరులను ప్రాచీన గ్రీకుల తత్వశాస్త్రము పొడగట్టెను. గ్రీకు సారస్వతమును వారు తనివితీర గ్రోలిరి. కోరుకొన్న దిదేయని వారనుకొనిరి. ఈ విషయమును కనుగొన్నప్పుడు వారికి నూతనోత్సాహము కలిగెను.

పునరుజ్జీవనము తొలుదొల్త ఇటలీలో ప్రారంభమయ్యెను. తరువాత అది ఫ్రాంసుకు పాకెను. తరువాత ఇంగ్లాంటుకూ, ఇతర ప్రదేశములకూ వెళ్ళెను. గ్రీకుల భావములును, సారస్వతమును మరల కనుగొనుట మాత్రమే కాదిది. అది అంతకన్న గొప్పది. విశాలమైనది. చాలా కాలమునుంచి యూరోపులో, లోలోపల జరుగుచూ ఉన్న పరివర్తన కది బాహ్యరూపము. ఈ ఆందోళన బహుముఖములుగా విజృంభించ నున్నది. పునర్జీవన మందొక్కటి.

## 73

# సముద్ర మార్గములను కనుగొనుట

జూలై 3, 1932

యూరోపులో మధ్యయుగముల సంప్రదాయములు విచ్ఛిన్నము కాగా నూతన సంప్రదాయములకు త్రోవ యిచ్చిన కాలభాగమును మన మిప్పుడు చేరితిమి. వర్తమాన పరిస్థితులన్న అసంతుష్టి అప్పుడు ప్రబలియుండెను. మార్పునకూ, అభివృద్ధికీ ఈ మన స్థితియే కారణము. ఫూడల్ పద్ధతివల్లను, మతసంస్థలవల్లను స్వార్థోపయోగమునకై బాధపెట్టబడిన అన్ని తరగతుల ప్రజలూ అసంతుష్టితో నుండిరి. కర్షకులు తిరుగుబాటులు చేయుచుండిరి. కాని కర్షకులు వెనుకబడి యున్నారు. దుర్బలులై యున్నారు. తిరుగుబాటులు చేసినప్పటికీ వారికి కలిగిన లాభమేమీ లేదు. వారి కింకను మంచి రోజులు రాలేదు. నిజమైన పోరాటము పాతఫ్యూడల్ తరగతి వారికీ, నానాటికీ బలవంతులగుచు అప్రమత్తులౌతూన్న కొత్త మధ్య తరగతివారికీ మధ్య నుండెను. ఫూడల్ పద్ధతి ప్రకారము ధనము భూమిపై ఆధారపడి యున్నదని— ధనమనగా భూమి అని. కాని ఇప్పుడు వేరొక విధమగు ధనము ప్రోగుపడుచున్నది. అది భూమి నుంచి వచ్చినదికాదు. అది చేతిపనులనుంచీ, వర్తకమునుంచీ వచ్చుచుండెను. దీనివల్ల లాభము పొందుచున్నవారు కొత్త మధ్య తరగతివారు—బూర్జువాజీ. దీనివల్ల వారికి బలము చేకూరింది. ఈ పోరాటము పాతకాలమువంటిదే. ఇప్పుడు మనము చూచేది— రెండు పక్షములవారి యొక్కయు పరస్పరస్థానములలో వచ్చిన మార్పు. ఫ్యూడల్ పద్ధతి ఇంకను జరుగుచునే ఉన్నదికాని అదియిప్పుడు ఆత్మరక్షణకై పాటుపడుచుండెను. బూర్జువాజీ, నూతనముగా సం

పాదించిన బలము ఆత్మవిశ్వాసము నిచ్చుటవల్ల వారిపై కాలు దువ్వు చుండిరి. వందలకొద్ది సంవత్సరములపాటు ఈ పోరాటము జరుగు చునే యుండెను. నానాటికి ఇది బూర్జువాజాకు అనుకూలముగా పరిణమించుచుండెను. యూరోపు ఖండమందలి వివిధ దేశములలో ఈ పోరాటము భిన్నభిన్నరూపములుగా నుండెను. తూర్పు యూర పులో ఈ పోరాటము మిక్కిలి తక్కువ. పడమటి యూరోపులో మొట్టమొదట బూర్జువాజా ప్రసిద్ధికి వచ్చెను.

పాతకట్టుబాట్లు భగ్నమగుటవలన అనేక విధములుగా అభివృద్ధి కనిపించింది. విజ్ఞానశాస్త్రమున కళలలో, సారస్వతమున, వాస్తునిర్మా ణమున, నూతన విషయములు కనుగొను విషయమున ఈ అభివృద్ధి గోచరించింది. నూతనశక్తి కట్లు తెంపుకున్నప్పుడు ఇది ఇట్లే సంభవిస్తుంది. అది విశాలమై వ్యాప్తిని పొందుతుంది. ఇట్లే మన దేశమునకు స్వాతంత్ర్యము చిక్కినప్పుడు మన ప్రజలును, మన ప్రతిభయును విశాలమై అన్ని దిక్కుల వ్యాపించగలవు.

ప్రజలపై చర్చికి గల పట్టు సడలి దుర్బలమగుటచేత ప్రజల "కెతీడ్రలులు" కనీ, "చర్చీలు" కనీ తక్కువ సొమ్ము ఖర్చు చేయ మొదలుపెట్టారు. అందమైన భవనములు లేచినవి గాని అవి పురభవనములును, వాటివంటివిని మాత్రమే. గాతిక్ పద్ధతికూడ వెనుకకు తగ్గినది. కొత్తపద్ధతి తలయెత్తి వృద్ధిలోనికి వచ్చు చున్నది.

ఈ కాలమునందే, పడమటి యూరోపు నూతనశక్తితో నిండి వుండగా తూర్పుదేశములనుండి బంగారు సంపాదనకై ఆకర్షణ వచ్చింది. ఇండియా, చీనాలను దర్శించిన మార్కోపోలో యొక్క ఇతరులయొక్క గాథలు యూరపులోని ప్రజలను ఆశాపూరితులను చేసి నవి. తూర్పుదేశములలో చెప్పరానంత ధనమున్నదనే వార్త విని

పలువురు సముద్ర యానమునకు పూనుకొనిరి. అప్పుడే కాంస్టాంటి నోపుల్ పతనమైనది. తురుష్కులు తూర్పునకు పోయే వర్తకమార్గములను తమ చేతులలో నుంచుకొని వర్తకమును అట్టే ప్రోత్సహించడము లేదు. పెద్ద సాహుకార్లూ, వర్తకులూ కుపితులయ్యారు. తూర్పు దేశముల బంగారును సంపాదించగోరే సాహసికులుకూడా కుపితులయ్యారు. కాబట్టి వారు బంగారుతూర్పును చేరడానికి కొత్తమార్గములను కనిపెట్ట ప్రయత్నించారు.

మన భూమి గుండ్రముగా ఉన్నదనిన్నీ, అది సూర్యునిచుట్టూ తిరుగుతున్నదనిన్నీ నేడు బడికిపోయే ప్రతి బాలికకూ తెలుసును. ఇది మన కందరికీ విస్పష్టముగా తెలిసిన విషయము. కాని వెనుకటి రోజులలో ఈ విషయమంతా స్పష్టముగా ఆనాటివారికి తెలియదు. అట్లు భావించేటట్టినీ, చెప్పేటట్టినీ మనుష్యులు చర్చివల్ల కష్టము లనుభవింపవలసి వచ్చేది. చర్చినిచూస్తే భయంగా వున్నప్పటికీ ఆనాటికానాడు ఎక్కువమంది భూమి గుండ్రముగా నున్నదని భావించ ప్రారంభించారు. భూమి గుండ్రముగానే ఉంటే, పడమటిగాపోతే ఇండియా, చీనాలను చేరవచ్చునుగదా? అని కొందరూహించారు. మరికొందరు ఆఫ్రికాను చుట్టి వెళ్ళి ఇండియాను చేరవచ్చుననుకొన్నారు. ఆకాలమున సూయజ్ కాలువ లేదనేమాట జ్ఞాపకముంచుకో. మధ్యధరా సముద్రమునుండి యెర్ర సముద్రమునకు ఓడలప్పుడు పోలేకుండెను. సామానులూ, వర్తకపు సరుకులూ భూమార్గముగుండా బహుశా ఒంటెలమీదవేసి మధ్యధరా సముద్రమునకు ఎర్ర సముద్రమునకు మధ్యనున్న భూభాగము మీద నుంచి తీసుకుపోయి ఆవలితట్టునవున్న కొత్త ఓడలమీదికి ఎక్కించేవారు. ఇది అట్టే సదుపాయముగా లేదు. ఈజిప్టు, సిరియాలు తురుష్కుల వశమందుండుటచేత ఇట్లు చేయుట మరీ కష్టముగా వుండెను.

కాని ఇండియాలోని ధనము ప్రజలను ఆకర్షించుచునే వుండెను.

స్పెయిను పోర్చుగల్ దేశములు పరిశోధనాయాత్రలు చేయు విషయమున ముందంజవేసినవి. అప్పుడే స్పెయిను, గ్రానడానుండి మిగిలిన మూరులను లేదా సారసునులను తరిమివేయుచుండెను. ఆరాగో్ ఫెర్డినాండు, కాస్టెయిల్ ఇసాబెల్లాను పెళ్ళి చేసుకొనుటవల్ల క్రైస్తవ స్పెయిన్ ఏకమయ్యెను. 1492 లో యూరోపు కావలతట్టున కాంస్టాంటినోపులును తురుష్కులు స్వాధీనము చేసుకొన్న తరువాత సుమారు 50 యేండ్లకు, అరబ్బుల గ్రానడా పతనమయ్యెను. వెంటనే స్పెయిను యూరోపులో ఒక గొప్ప క్రైస్తవ రాజ్యమయ్యెను.

పోర్చుగీసువారు తూర్పుగాను, స్పానియర్డులు పడమటి దిక్కుగాను పోవ ప్రయత్నించిరి. 1445 లో పోర్చుగీసువారు వర్డీ అగ్రమును కనుగొనుటవల్ల ముందుకు పోవుటకొక మార్గమేర్పడినది. ఈ అగ్రము ఆఫ్రికాకు మిక్కిలి పడమరగానున్న ప్రదేశము. ఆఫ్రికా పటమును చూడు. యూరోపునుండి కిందకు ఈ అగ్రముకేసి సముద్రయానము చేయువారు నైరృతి దిక్కుగా పోవలసియున్నట్లు కనుగొందువు. వర్డీ అగ్రమువద్ద మలుపు తిరిగి ఆగ్నేయముగా పోవ మొదలుపెట్టుదురు. ఈ అగ్రమును కనుగొనుట నావికులకు ఆశాజనకముగా ఉండెను. ఆఫ్రికానుచుట్టి ఇండియాతట్టు పోవచ్చుననే ధైర్యము వారికి కలిగింది.

ఆఫ్రికాను చుట్టుటకు మరి నలభై సంవత్సరములకుగాని సాధ్యము కాలేదు. 1486 లో పోర్చుగీసువాడైన బర్తొలోమ్యు డయాజ్ ఆఫ్రికా దక్షిణ అగ్రమును చుట్టివెళ్ళెను. దీనినే గుడ్‌హోపు అగ్రమందురు. మరి కొద్ది సంవత్సరములలో వేరొక పోర్చుగీసువాడు, వాస్కో-డాగామా, గుడ్‌హోప్ అగ్రము మీదుగా ఇండియాకు వచ్చెను. మలబారు తీరమందున్న కళ్ళికోటను వాస్కో-డాగామా 1498 లో చేరెను.

ఇండియాను మొట్టమొదట ఎవరు చేరగలరను పందెములో

పోర్చుగీసువారే గెలిచిరి. ఈ కాలమునందే భూగోళమున కావలి తట్టున గొప్ప విశేషములు జరుగుచుండెను. వాటివల్ల స్పెయిను లాభము నందనుండెను. 1492 లో క్రిస్టొఫర్ కొలంబసు అమెరికా ప్రపంచమును చేరెను. కొలంబసు జినోవాలోని ఒక బీదమనిషి. భూమి గుండ్రముగా వున్నది కాబట్టి అతడు పడమటి దిక్కుగా సముద్రప్రయాణము చేసి జపానును, ఇండియాను చేరదలచుకొనెను. ఈప్రయాణము చేయడముకు ఎంతోకాలము పట్టుతుందని అతడు అనుకోలేదు. కాని పట్టింది. అతడు రాజులను అనేకమందిని తన పరిశోధనా యాత్రకు సహాయము చేయమని కోరెను. చివరకు స్పెయిను నేలు ఫెర్డినండు, ఇసాబెల్లాలు సహాయము చేయడముకు వప్పుకొనిరి. కొలంబసు మూడు చిన్న నావలతోను, 88 గురు మనుష్యులతోను బయలుదేరెను. తెలియని ప్రదేశములకు సముద్రయాత్ర చేయనెంచుట సాహసోద్యమమే. కాని, కొలంబసుకు ఆత్మవిశ్వాసముకలదు. అదియే అతనికి విజయము చేకూర్చెను. 69 దినములు సముద్రయాత్ర చేసినపిమ్మట వారికి భూమి కనిపించినది. కొలంబసు ఈ ప్రదేశము ఇండియా అనుకొనెను. నిజమునకది పశ్చిమ ఇండీసులో ఒకద్వీపము. కొలంబసు అమెరికా ఖండమును చేరలేదు. మరణపర్యంతము అతడు ఆసియాను చేరినట్లే భావించెను. అతడు పడ్డ ఈభ్రమ నేటివరకు నిలిచియున్నది. ఈ ద్వీపములను నేడును పశ్చిమ ఇండీసు అనియే అంటున్నారు. అమెరికా యొక్క ఆదిమ నివాసులను ఇండియనులు లేదా ఎర్ర ఇండియనులు అని నేడుకూడ అంటున్నారు.

కొలంబసు యూరోపుకు తిరిగివచ్చి మరుసటి సంవత్సరము యెక్కువ ఓడలతో మరల ప్రయాణమై వెళ్ళెను. ఇండియాకు నూతన మార్గమును కనిపెట్టినట్లు ప్రచురింపబడ్డవార్త యూరోపులో అలజడి కలిగించెను. దీనికి తరువాతనే వాస్కోడాగామా తూర్పుగా సముద్రయాత్రచేసి కళ్ళికోట చేరుకొనెను. తూర్పునుండియు, పడమరనుండియు

కొత్తమార్గము కనుగొన్నట్లు చెప్పిన వార్తలవల్ల యూరోపులోని అలజడి పెరిగెను. కనిపెట్టబడ్డ కొత్త భూములపై అధికారము చెలాయించవలెనని పోటీపడుచున్న దేశములు స్పెయినును, పోర్చుగలను. పోపు ఈసందర్భమున రంగమున ప్రవేశించెను. పోర్చుగల్ వారికిని, స్పెయిను వారినికి పోరాటము సంభవించకుండ ఆపవలెనను ఉద్దేశముతో అతడు 1493 లో ఒక శ్రీముఖమును జారీచేసెను. దానికి సీమా నిర్ణయశాసనమని పేరు. ఇతరులకు ఇబ్బందిగా పుంటేనేమి పోపుమాత్రం ఉదారంగా ఉండ ప్రయత్నించాడు. అజోర్సుకు పడమరగా నూరు లీగుల దూరమున ఉత్తరమునుండి దక్షిణమునకు అతడొక గీతగీశాడు. ఇది ఊహారేఖ మాత్రమే. ఈగీతకు తూర్పుగావున్న క్రైస్తవేతర దేశములన్నీ పోర్చుగలు తీసుకోవలసిందనిన్నీ, పడమరగా వున్నవన్నీ స్పెయిను తీసుకోవలసిందనిన్నీ నిర్ణయించాడు. యూరోపుమినహా ప్రపంచమంతా ఈవిధంగా పోపు భూవిధానం చేశాడు. అతనికేమి పోయింది? అట్లాంటిక్ మహాసముద్రంలో వున్నవి, ఈ అజోర్సు ద్వీపములు. వాటికి పడమరగా నూరు లీగుల—అనగా 300 మైళ్ళ దూరమున గీసినగీతవల్ల ఉత్తర అమెరికా అంతాను, దక్షిణ అమెరికాలో చాలాభాగమున్నూ ఆగీతకు పడమరగా పడును. అనగా క్రియకు పోపు రెండు అమెరికాలను స్పెయినునకునూ,ఇండియా, చీనా, జపాను, ఇతర తూర్పుదేశములు, ఆఫ్రికా అంతాను పోర్చుగలుకును ధారాదత్త చేసెను.

ఈ విశాల భూములను వశపరుచుకోడానికి పోర్చుగల్ పూనుకొంది. ఇది సులభం కాదు. కాని వారు కొంతవరకు సాధించి ఇంకాతూర్పుగా పోవుచుండిరి. 1510 లో వారు గోవా చేరుకొనిరి. 1511 లో మలయా ద్వీపకల్పములోని మలాకా చేరుకొనిర. వెంటనే జావా చేరిరి. 1576 లో చీనా చేరిరి. వారు చేరిరి అని చెప్పుటవల్ల ఆ ప్రదేశములను వారు వశపరుచుకొన్నారని అర్థము కాదు. కొన్ని

స్థలములలో వారు కాలు నిలువదొక్కుకున్నారు. తరువాత వచ్చు ఒక జాబులో వారి భావిచరిత్ర మనము చర్చించుకోగలము.

తూర్పున నున్న పోర్చుగీసువారిలో ఫెర్డినాండు మగల్లన్ అను వాడొక డుండెను. అతడు తన యజమానులతో కలహించి, యూరోపుకు తిరిగివచ్చి, స్పెయినులో నివాసమేర్పరుచుకొని స్పెయిను దేశ పౌరుడయ్యెను. గుడ్‌హోపు అగ్రముగుండా తూర్పుదారిని వచ్చి అతడు ఇండియాను, తూర్పుదీవులను చేరినవాడౌటచేత అతడు పడమటిదారిని, అమెరికాగుండా సముద్ర ప్రయాణమును చేసి ఇండియాను తూర్పు దీవులను చేరగోరెను. కొలంబసు కనుగొనిన భూమి ఆసియాకు సంబంధించినది కాదని బహుశా అతనికి తెలిసి ఉండును. 1513 లో ఒక స్పానియర్డు, బాల్బా అనువాడు, మధ్య అమెరికాలోని పెనామా పర్వతములను దాటి పసిఫిక్ మహాసముద్రమును చేరెను. ఏ కారణమువల్లనో దాని కతడు దక్షిణ సముద్రమని పేరుపెట్టెను. దాని తీరమున నిలబడి అతడు ఈ కొత్తసముద్రమును, అది తిరుపు దేశములను తన యజమాని అనగా స్పెయినురాజు సొత్తు అని చెప్పెను.

1519 లో మగల్లన్ పశ్చిమ సముద్రయాత్రకు బయలుదేరెను. ఇదియే అన్నిటికన్న గొప్పయాత్రగా పరిణమించనున్నది. అతడు అట్లాంటిక్కును దాటి దక్షిణఅమెరికా చేరెను. ఇంకను దక్షిణముగా అతడు యాత్ర సాగించి ఆ భూఖండముయొక్క చివరభాగమును చేరెను. అతని నౌక ఒకటి భగ్నమైపోయెను. ఒకటి వానిని వదలి పెట్టి పోయెను. ఇక మూడు నావలు మిగిలినవి. వీటితో అతడు దక్షిణ అమెరికాకును, ఒక ద్వీపమునకును మధ్యనున్న ఇరుకు జల సంధిని దాటి రెండివతట్టునున్న సముద్రములో ప్రవేశించెను. ఇదియే పసిఫిక్‌మహాసముద్రము (శాంతమహాసముద్రము). అట్లాంటిక్ మహాసముద్రముతో పోల్చిచూచినప్పుడు ఇది కడుశాంతముగా నుండు

టచే దీనికీ పేరు మగల్లన్ పెట్టెను. పసిఫిక్కును చేరుటకు అతనికి సరిగా 14 మాసములు పట్టినది. అతడు దాటిన జలసంధికి అతని పేరే వచ్చినది. నేడు కూడా దానిని మగల్లన్ జలసంధి అంటారు.

ధైర్యముతో మగల్లన్ ఉత్తరముగాను, పిమ్మట వాయవ్యము గాను అజ్ఞాతసముద్రము మీదుగా ప్రయాణము సాగించెను. అతడు చేసిన సముద్రయాత్రలో ఇది కష్టతమమైనది. అంతకాలము అది పట్టునని ఎవ్వరును అనుకోలేదు. తినుటకు తిండీ త్రాగుటకు నీళ్ళు చాలినన్ని లేకుండా వారు 4 నెలలపాటు (సరిగా 108 రోజులు) నడిసముద్రములో నుండిరి. తిండిలేక ఎన్నో కష్టముల పాలయి తుదకు వారు ఫిలిప్పైను దీవులు చేరుకొనిరి. అక్కడిజనులు వారి నాదరించి భోజనము పెట్టిరి. వీరికి వారూ, వారికి వీరూ కానుక లిచ్చిరి. కాని స్పానియర్డులు కలహశీలులూ, గర్వాంధులూ అయి ఉండిరి. అక్కడి నాయకుల కిద్దరికీ జరిగే చిన్న యుద్ధములో మగల్లన్ ప్రవేశించి అందు మడసెను. తమపట్ల గర్వముతో అధికారభావముతో ప్రవర్తించారన్న కారణముచేత ద్వీపవాసులు స్పానియర్డులను చాలామందిని చంపిరి.

స్పానియర్డులు సైప్రసుద్వీపములకై వెదుకజొచ్చిరి. అచ్చటి నుండియే వంటకు పనికివచ్చు సువాసనద్రవ్యములు వచ్చుచుండెను. వాటిని వెదుకుచు వారు ముందుకు పోయిరి. వేరొక నావ వదలుకో వలసివచ్చెను. దానిని తగులబెట్టవలసివచ్చెను. ఇక వారికి మిగి లినవి రెండే నావలు. అందొక నావ పసిఫిక్కు సముద్రముగుండా స్పెయినుకు పోవునట్లూ, రెండవనావ గుడ్‌హోపు అగ్రమును చుట్టి ఇంటికి పోవునట్లూ వారు నిర్ణయించుకొనిరి. మొదటినావ ఎక్కువ దూరము పోకముందే పోర్చుగీసువారి చేతులలో పడెను. రెండవ నావ—విక్టోరియా అను పేరుగలది, ఆఫ్రికాను చుట్టి మెల్లగా పోయి

స్పెయినులోని సివిల్లేను చేరెను. బయలుదేరిన మూడు సంవత్సరములకు, 1522 లో, 18 మందితో విట్టోరియా ఇల్లు చేరుకొనెను. అది భూమిని చుట్టివచ్చినది. భూప్రదక్షిణము చేసిన ప్రథమనావ అదియే.

విట్టోరియా చేసిన యాత్రను గూర్చి కొంత విపులముగా నేను వ్రాసితిని. అందుకు కారణము అది అద్భుతయాత్ర. ఇప్పుడు మనము సముద్రములు దాటుతున్నాము. మన కన్ని సదుపాయములును జరుగును. పెద్ద నౌకలలో దూరప్రయాణములు కూడా చేయుదుము. మన కెట్టి లోపమును ఉండదు. కాని తొలిరోజులలో చేసిన ఈ సముద్రయాత్రలసంగతి ఆలోచించు. ఎన్ని కష్టములు! ఎంత ప్రమాదము! తెలియని సముద్రమున కడ్డముగా పోయి వారు సముద్రమార్గములను కనిపెట్టిరి. వారి తరువాత వచ్చినవారు ఆ మార్గములను ఉపయోగించి లాభము లందుచున్నారు. ఆనాటి స్పానియర్డులును, పోర్చుగీసులును గర్వాంధులు, క్రూరులు, అధికార భావముతో మెలగేవారు. కాని వారి సాహసము అద్భుతజనకము. సాహసకార్యములుచేయు వారుత్సాహముతో నిండియుండిరి.

మగల్లన్ భూమి చుట్టి వస్తూండగా కార్టెజ్ అనువాడు మెక్సికో నగరమును ప్రవేశించి అజ్టెక్కు సామ్రాజ్యమును, స్పానిషురాజు కొరకై, జయించుచుండెను. దీనినిగురించిన్నీ, అమెరికాలోని మాయా నాగరికతను గురించిన్నీ నీకు కొంత వ్రాసిఉన్నాను. 1519 లో కార్టెజ్ మెక్సికోను చేరెను. 1530 లో పిజారో దక్షిణ అమెరికాలోని "ఇంకా" సామ్రాజ్యమును (ఇప్పుడు పెరూ ఉన్నచోట) చేరెను. ధైర్యముతో, సాహసముతో, ద్రోహముతో, క్రౌర్యముతో, అచ్చటి ప్రజలలోని అంతఃకలహములవల్ల లాభమును పొందుతూ, కార్టెజ్, పిజారోలు రెండు ప్రాచీన సామ్రాజ్యములను తుదముట్టించ గలిగిరి. కాని ఈ రెండు సామ్రాజ్యములూ పాతబడ్డవి. కొన్ని

విధములుగా చూచిన మిక్కిలి మోటుగా ఉన్నవి. ముట్టుకోవడం తోనే అవి పేకముక్కల మేడలవలె కూలిపోయాయి.

సమర్థులైన నూత్న దేశాన్వేషకులు పోయిన మార్గమునుబట్టి గుంపులుగుంపులుగా సాహసులు దోచుకొనుటకూ, కొల్లగొట్టుటకూ వెళ్ళిరి. స్పానిష్‌అమెరికా ఈ గుంపులవల్ల చాలా కష్టములకు లోనయ్యేను. కొలంబసునుకూడ వారు లెక్కచెయ్యక బాధపెట్టిరి. ఈ కాలముననే బంగారమూ, వెండీ ప్రవాహము కట్టి పెరూనుండీ మెక్సికోనుండీ, స్పెయినుకు ఎడతెగకుండా ప్రవహించడం మొదలు పెట్టాయి. ఈ విలువగల లోహములు అపరిమితముగా వచ్చుట చూచి యూరోపు దిగ్భ్రమ చెందింది. యూరోపులో స్పెయిన్ ప్రబలమగు రాజ్యమైనది. ఈ బంగారమూ, వెండీ యూరోపులోని ఇతర దేశములకు వ్యాపించుటవల్ల తూర్పుదేశపు సరుకు కొను క్కొనుటకు కావలసినంత డబ్బు వారికుండెను.

పోర్చుగల్, స్పెయిను దేశములు ఈ విధముగా లాభములు పొందుటవల్ల ఇతర దేశములకుకూడా నోరూరింది. ఇందు ముఖ్య ముగా చెప్పుకోదగ్గవి ఫ్రాంసు, ఇంగ్లాండు, హాలెండు, ఉత్తరజర్మన్ పట్టణములు. నార్వేకు ఉత్తరముగా తూర్పునకునూ, గ్రీన్‌లాండు మీదుగా పశ్చిమమునకునూ ఈ విధముగా ఉత్తరమార్గము ననుసరించి ఆసియా, అమెరికాలను చేరుటకు మార్గమున్నదేమో కనుగొనుటకు వారు చాలా ప్రయత్నించిరి. కాని ఫలితము శూన్యమయ్యేను. కాన వారు తెలిసిన మార్గములనే అనుసరించిరి.

ఆ కాల మెంత దివ్యకాలమో! ప్రపంచము తన స్వరూపాన్ని చూపించ మొదలిడింది. తన అమూల్య నిధులనూ, అద్భుతములనూ చూపించ మొదలిడింది. ఒకదాని తరువాత ఒకటిగా నూతన దేశ ములూ, సముద్రములూ కనుగొనబడినవి. అపరిమిత ధనము అడిగినవారి చేతుల్లో పడడానికి సిద్ధంగా ఉండెను. ఈ సాహస

కార్యముల గూర్చిన అద్భుతవిషయములు ఆ కాలమున విరివిగా వ్యాపించియుండెను.

నేడు ఈ ప్రపంచము వెనుకటికన్న చిన్నదేమో అనిపిస్తుంది. కనుగొనుటకు ఇప్పుడేమీ లేదు అని తోస్తుంది. కాని ఇది నిజము కాదు. ఎందువల్లనంటే విజ్ఞానశాస్త్రము బ్రహ్మాండమైన నూతన దృశ్యములను చూపినది. వాటిని పరిశోధించవలసి ఉన్నది. సాహసకార్యము చేయుటకున్నూ సావకాశములు లేకపోలేదు. ముఖ్యముగా నేడు ఇండియాలో.

# 74

# మంగోలు సామ్రాజ్యముల విచ్ఛిత్తి

జూలై 9, 1932

మధ్యయుగాలు గడచిపోయినవనిన్నీ, యూరోపులో నూతన శక్తి బహుముఖములుగా వ్యక్తమయినదనిన్నీ ఇదివరలో నీకు వ్రాసి ఉన్నాను. యూరోపంతా చురుకుదనము చూపుతూ ఉన్నది. సృష్ట్యాత్మకకార్యాలు చేయడానికి పూనుకుంటోంది. శతాబ్దులకాలముపాటు తమ తమ చిన్నదేశాలలో ముసుగుపెట్టుకొని కూర్చున్న యూరోపు ప్రజలు నేడు కట్లు తెంపుకొని, మహాసముద్రములు దాటి ప్రపంచము నలుమూలలకూ పోయిరి. ఆత్మబలముమీద విశ్వాసము గలవారై వారు విజయములు సాధించుకొంటూ పోయిరి. ఈ విశ్వాసమే వారికి ధైర్యము నిచ్చింది. ఎన్నో అద్భుతకార్యాలు చేయించింది.

హఠాత్తుగా ఇట్టిమార్పు ఎట్లా వచ్చిందని నీవు ఆశ్చర్యపడ వచ్చును. పదమూడవ శతాబ్ది మధ్యభాగములో మంగోలులు ఆసియా, యూరోపులపై అధికారము చెలాయించిరి. తూర్పు యూరోపువారి స్వాధీనములో ఉండెను. పడమటి యూరోపువారిని చూచి గడగడ లాడుచుండెను. మంగోలులు దుర్జయులుగా ఉండిరి. గొప్ప ఖాను

యొక్క ఒక సేనానితో పోల్చి చూస్తే యూరోపు రాజులూ, చక్రవర్తులూ లెక్కలోకి రావడంలేదు.

రెండువందల సంవత్సరముల తరువాత ఆటోమన్ తురుష్కులు, సామ్రాజ్యనగరమైన కాంస్టాంటినోపులును, యూరోపుకు ఆగ్నేయమూలనున్న పెద్ద భూభాగమును తమ వశము చేసుకొనిరి. ముస్లిములును, క్రైస్తవులును 800 ఏండ్లు పోరాడిన తర్వాత, అరబ్బులకును, సెల్జూకులకును దక్కని మహాఫలము (కాంస్టాంటినోపులు) ఆటోమన్ తురుష్కుల కరగతమైనది. దీనితో సంతుష్టి చెందక ఆటోమనులు పడమటివైపు తమ దృష్టిని తిప్పి రోమును సైతము కబళించ నూహించిరి. జర్మను సామ్రాజ్యమునూ (పవిత్ర రోమక సామ్రాజ్యమును), ఇటలీనీ కూడా వారు బెదిరించిరి. వారు హంగరీని గెలుచుకొనిరి. వియన్నా సమీపమునకు పోయిరి. ఇటలీ పొలిమేరలు కూడా చేరిరి. తూర్పున వారు బాగ్దాదును తమ రాజ్యములో కలుపుకొనిరి. దక్షిణమున ఈజిప్టును వశపరుచుకొనిరి. పదహారవ శతాబ్ది మధ్యభాగమున ఘనుడగు సులేమాన్ సుల్తాను ఈ గొప్ప తురుష్క సామ్రాజ్యమును ఏలెను. సముద్రములమీద కూడా అతని నావలు నిరంకుశముగా తిరుగుచుండెను.

ఈ మార్పు మరి ఎట్లా వచ్చినది ? మంగోలుల బారినుండి తప్పించుకొని యూరోపు ఎట్లా బయట పడినది ? తురుష్కుల ప్రమాదమునుండి ఎట్లా తప్పించుకొని జీవించింది ? అంతే కాదు తా నితరులమీది కెట్లా కాలు దువ్వింది ? ఎట్లా ఇతరులకు ప్రమాదకరమయింది ?

మంగోలులు చిరకాలము యూరోపును బెదరించలేదు. వారంతట వారే కొత్తఖానును ఎన్నుకొనుటకుగాను వెళ్ళిపోయి మళ్ళీ తిరిగి రాలేదు. మంగోలియాలోని వారి స్వస్థలములకు, పడమటి యూరోపు చాలా దూరములో ఉండెను. అంతేకాకుండా అది వారిని ఆకర్షించ

లేదు కూడా. అది అడవులతో నిండి ఉండెను. విశాలమైన మైదానములు, పచ్చికబయళ్లు అప్పు డంతటా ఉండేవి. ఏది ఎట్లున్నా పడమటి యూరోపు మంగోలులనుండి తప్పించుకోవడమునకు కారణము వారి స్వప్రయోజకత్వమువల్ల కాదు. మంగోలులు ఉపేక్ష చెయ్యడంవల్లా, ఇతర కార్యాలలో వారు నిమగ్నులై ఉండడంవల్లా అది తప్పించుకొన్నది. తూర్పు యూరోపులో వారు మరికొంతకాలముండిరి. చివరకు క్రమ క్రమంగా మంగోలుల ప్రాబల్యం సన్నగిల్లింది.

1452 వ ఏట కాంస్టాంటినోపులును తురుష్కులు జయించుట యూరోపియన్ చరిత్రలో మార్పు కలిగించిన సంఘటనగా భావిస్తారని ఇదివరలో నీకు చెప్పియుంటిని. మధ్యయుగములు గతించుట, నూతనోత్సాహము ఉదయించుట ఇప్పుడే జరిగినట్లు భావించడం చరిత్రకారులకు అనుకూలము ఈ నూతనోత్సాహమే పునరుజ్జీవనమై పలుముఖముల విజృంభించింది. యూరోపును తురుష్కులు బెదిరించుచున్నకాలమున, తురుష్కులు విజయము సాధించడానికి అనుకూలాలున్నప్పుడు, యూరోపు కాలు నిలువదొక్కకొని ప్రబలమగుట వింతవిషయమే. కొంతకాలమువరకూ పడమటి యూరోపులో తురుష్కులు ముందుకు పోవుచుండిరి. ఆ సమయమునందే యూరోపులోని నూతన దేశాన్వేషకులు నూతన దేశములను, సముద్రములను కనుగొనుచుండిరి. భూప్రదక్షిణము చేయుచుండిరి. ఘనుడగు సులేమాను 1520 మొదలు 1566 వరకూ రాజ్యము చేసెను. అతనకింద తురుష్కసామ్రాజ్యము వియన్నా మొదలుకొని బాగ్దాదు, కైరోలవరకూ విస్తరించి ఉండెను. దానితరువాత తురుష్కులు ముందుకు పోలేదు. గ్రీకుల కాంస్టాంటినోపులు సంప్రదాయములు పాతవి, దుష్టమైనవి. బలహరములు అయిన సంప్రదాయములు తురుష్కులను పీల్చి పిప్పిచేయుచుండెను. యూరోపు

ప్రబలమైనకొద్దీ, తురుష్కులు బలమును, ఉత్సాహమును కోల్పోయి బలహీనులగుచుండిరి.

గత యుగములగుండా మనము చేయు ప్రయాణములలో యూరోపుపై ఆసియా అనేకమారులు దండయాత్రలు చేయుట చూచితిమి. ఆసియాపై యూరోపు కొన్ని దండియాత్రలు చేసెను కాని అవి చెప్పుకోదగ్గవి కావు. అలెగ్జాండరు ఆసియాకు అడ్డుపడి ఇండియాకు వచ్చెను. దానివల్ల కలిగిన గొప్ప ఫలిత మేమీ లేదు. రోమనులు మెసపొటేమియా దాటి ఎన్నడూ వెళ్ళలేదు. తొలికాలమునుండియు యూరోపుమీద అన్ననో ఆసియా తెగలు ఉండుండియు దండయాత్రలు చేసిరి. ఆసియా చేసిన ఈ దండయాత్రలతో తుది దండయాత్ర ఆటోమన్ తురుష్కులు చేసినది. క్రమ క్రమముగా పద్ధతి మారినది. యూరోపు ఆసియాపై కాలు దువ్వ మొదలుపెట్టింది. ఈ మార్పు పదహారవ శతాబ్ది మధ్యలో వచ్చిందని చెప్పవచ్చును. కొత్తగా కనుగొనబడిన అమెరికా యూరోపుకు త్వరలో స్వాధీనమైనది. ఆసియా అంత సులభముగా స్వాధీనము కాకుండెను. 200 సంవత్సరముల పాటు ఆసియా ఖండమున పలుతావులలో యూరోపియనులు కాలూనుటకు తగిన స్థలములు సంపాదించుచుండిరి. పద్దెనిమిదో శతాబ్దిమధ్యభాగమున వారు ఆసియాలో కొన్ని భాగములపై అధికారము చెలాయించ మొదలిడుచుండిరి. ఈ విషయమును మనము గమనించవలెను. ఎందువల్లనంటే చరిత్ర తెలియని కొందరు సర్వకాలముల యందూ యూరోపు ఆసియాపై అధికారము చెలాయించినదని చెప్పుకోవడం కద్దు. ఈ నూతనాధికారము యూరోపుకు దరిమిలాను వచ్చినదే. ఈ సంగతి తెలుసుకుందుము. పరిస్థితు లప్పుడే మారడంవల్ల ఈ అధికారం కూడా కాలానుగుణంగా లేదు. తూర్పుదేశములన్నింటిలోనూ నూతనాభిప్రాయాలు పొడచూపాయి. స్వతంత్రమును

సంపాదించడం కోసం ప్రబలమైన ఉద్యమాలు యూరోపు అధికారాన్ని ఎదిరించి దానిని ఊపుతున్నవి. ఈ జాతీయభావములు ఒకయెత్తు. ఇంతకన్న విశాలమైన గంభీరమైన నూతన సాంఘికభావాలు తల యెత్తినవి. మానవులందరూ సమానమే అనే భావాలివి. సామ్రాజ్య తత్వాన్నీ, స్వార్థపరత్వాన్ని తుదముట్టించవలెనని ఆసిస్తున్నాయివి. భావికాలములో యూరోపు ఆసియాను కాని ఆసియా యూరోపును కాని తన వశంలో పెట్టుకోవడముండదు. ఒక దేశము స్వార్థోపయోగము కొరకు ఇంకొక దేశాన్ని ఉపయోగించుకోవడ ముండదు.

ఇది పెద్ద ఉపోద్ఘాతమే. ఇక మనము మంగోలుల దగ్గరికి వత్తము. కొంతకాలముపాటు వారి అదృష్టము లెట్లున్నవో చూచి చివరకు వారి కేమి సంభవించిందో తెలుసుకొందము. కుబ్లైఖాను గొప్ప ఖానులలో ఆఖరివాడని నీకు జ్ఞాపకముంటుంది. 1292 లో అతడు చనిపోయెను. పిమ్మట అతని విశాల సామ్రాజ్యము— ఆసియాలో కొరియానుండి యూరోపులోని పోలెండు, హంగరీలవరకూ విస్తరించిన సామ్రాజ్యము— 5 భాగములుగా చీలిపోయెను. ఇందు ప్రతి ఒక భాగమూ ఒక పెద్ద సామ్రాజ్యము. వెనుకటి ఒక జాబులో (68) ఈ అయిదింటిపేర్లూ వ్రాసి ఉన్నాను.

ఇందు ప్రధానమైనది చీనా సామ్రాజ్యము. దీనిలో మంచూరియా, మంగోలియా, టిబెట్టు, కొరియా, అన్నాం, టాంకింగ్, బర్మాలో కొంత భాగమూ చేరి ఉన్నవి. కుబ్లైవంశస్థులైన యు-ఆన్ రాజవంశము దీనికి వారసులైరి. కాని వారు చాలాకాలము రాజ్యము చేయలేదు. త్వరలోనే సామ్రాజ్యము దక్షిణమందలి కొన్ని భూభాగములు విడిపోయినవి. నేను ఇదివరలో చెప్పినట్లు 1868 లో —కుబ్లైయ్ చనిపోయిన సరిగా 76 సంవత్సరములకు — అతని రాజవంశము అంతరించింది. మంగోలులు తరుమగొట్టబడ్డారు.

దూరపశ్చిమమున గోల్డెన్‌హోర్డి సామ్రాజ్యము కద్దు. కుబ్లై చనిపోయిన తరువాత 200 సంవత్సరములవరకూ రష్యను కులీనులు దీనికి కప్పము చెల్లించేవారు. పిమ్మట (1480 లో) ఈ సామ్రాజ్యము దుర్బలము కాజొచ్చెను. మాస్కోయొక్క గ్రాండుడ్యూకు రష్యను కులీనులలో ప్రధాన పురుషుడై కప్పము చెల్లించ నిరాకరించాడు. ఈ గ్రాండు డ్యూకును ఘనుడగు ఇవాన్ అందురు. రష్యాకు ఉత్తర భాగమున నొవ్‌గోరాడ్ ప్రజాప్రభుత్వము (Republic) కలదు. వర్తకులూ వ్యాపారులూ దానిని నడిపించుచుండిరి. ఇవాను దీనిని ఓడించి తన రాజ్యములో కలుపుకొన్నాడు. ఈ కాలమున కాంస్టాంటి నోపులు తురుష్కుల వశమైనది. పాత చక్రవర్తుల కుటుంబము తరుమగొట్టబడింది. ఈ సామ్రాజ్య కుటుంబమునకు చెందిన ఒక కన్యను ఇవాన్ పెండ్లిచేసుకొనెను. కాబట్టి తాను రాజ వంశపువాడ ననీ, బైజాంటియంకు తాను వారసుననీ చెప్పుకొన్నాడు. రష్యను సామ్రాజ్యము ఈ విధముగా ఘనుడగు ఇవాన్‌తో ప్రారంభించి 1917 సంవత్సరమున జరిగిన విప్లవముతో అంతరించింది. ఇవాన్ మనుమడు చాలా క్రూరుడు. అతనికి అందువల్ల భయంకరుడగు ఇవాన్ అనే పేరు వచ్చింది. అతడు జార్ అనే బిరుదాన్ని ధరించాడు. జార్ అన్నా, సీజరు అన్నా, చక్రవర్తిఅన్నా ఒకటే.

ఈ విధముగా మంగోలులు యూరోపునుండి నిష్క్రమించారు. గోల్డెన్ హోర్డి, మధ్యఆసియాలోని ఇతర మంగోలు సామ్రాజ్యములు ఏమైనవనే గొడవ మనము పెట్టుకోనక్కరలేదు. అయినా ఆ విషయం నాకాట్టే తెలియదు. కాని ఒక్కపురుషుణ్ణి గురించి మాత్రం మనము తెలుసుకోవాలి.

ఈ పురుషుడు తైమూరు. ఇతడు రెండవ చెంగిజ్‌ఖాన్ అని అనిపించుకొందా మనుకొన్నాడు. చెంగిజ్ వంశమువాడనని అతడు చెప్పుకున్నాడు కాని యదార్థమునకు అతడు తురుష్కుడు. అతడు

కుంటివాడు. అందువల్లనే అతనికి తైమూర్ - ఇ - లాంగ్, టామర్ లేన్ అనగా కుంటివాడగు తైమూరు అనే పేరు వచ్చింది. 1369 లో ఇతడు తన తండ్రి తరువాత సమరఖండమునకు రాజయ్యేను. వెంటనే దండయాత్రలు, క్రౌర్యము ప్రారంభించెను. అతడు ఒక గొప్ప సేనానే కాని వట్టి అనాగరికుడు. ఈ కాలమున మధ్యఆసియా లోని మంగోలులు మస్లిములైరి. తైమూరు కూడా ముస్లిమే. ముస్లిములతో విరోధము పెట్టుకొన్నప్పటికిన్నీ అతడు రవంతైనా దయా దాక్షిణ్యములు చూపినవాడుకాడు. అతడు మెట్టిన చోటులందంతటా ప్రజానాశనమూ, అంటురోగములూ, అమిత దుస్థితీ వ్యాపించినవి. మానవ కపాలములతో పెద్ద పెద్ద పిరమిడ్డులను (Pyramids) నిర్మించుట అతనికి ఎంతో ఇష్టమైనపని. తూర్పున ఢిల్లీనుండి పడమర ఆసియా మైనరువరకూ అతడు లక్షలకొద్ది జనులను హత్యచేయించాడు. వారి కపాలములను పిరమిడ్ల ఆకారముగా పేర్పించాడు.

చెంగిజ్‌ఖానునూ, అతని మంగోలులునూ క్రూరులును, విధ్వంసకులును కాని ఆకాలమున అందరునూ, ఆ విధముగానే ఉండిరి. కాని తైమూరు వారికంటె అన్యాయముగా ఉండెను. హద్దులేని రాక్షస క్రౌర్యమునకు అతనికి అతడే సాటి. ఒక చోట అతడు 2000 మంది సజీవులగు మనుష్యులను గోపురస్తంభముగా పేర్పించి, ఇటుకలతోటీ సున్నముతోటీ పైన కప్పించెనట!

ఈ అనాగరీకుణ్ణి ఇండియా ధనము ఆకర్షించింది. ఇండియాపై దండెత్తవలెనని అతడు తీర్మానించాడు. కాని అతని సేనానులున్నూ కులీనులున్నూ సమ్మతించలేదు. సమరఖండములో ఒక గొప్పసభ ఇందుకొరకై జరిగినది. ఇండియాలో వేడి అధికముగా ఉంటుంది కాబట్టి దండెత్తవద్దని కులీనులు అడ్డుచెప్పారు. ఇండియాలో తాను ఆగననిన్నీ, కొల్లగొట్టి, ధ్వంసముచేసి తిరిగి వస్తాననిన్నీ అతడు వాగ్దానం చేయగా వారు సమ్మతించారు. అతడన్నప్రకారముచేశాడు.

అప్పుడు ఉత్తరహిందూస్థానము మస్లిముల పాలనమందున్న మాట నీకు జ్ఞాపక ముండవచ్చును. ఢిల్లీలో అప్పు డొక సుల్తా నుండెను. కాని అతని మస్లిమురాజ్యము దుర్బలస్థితిలో నుండెను. పొలిమేరలకడ నున్న మంగోలులతో నిరంతరమూ పోరాడుచుండగం వల్ల దాని నడుము విరిగింది. కాబట్టి తన మంగోలుసైన్యముతో తైమూరు వచ్చినప్పుడు అధికనిరోధము లేదు. హత్యలు చేసు కొంటూ, పిరమిడ్డులు కట్టుకొంటూ ఖులాసాగా ముందుకు పోయాడు. హిందువులూ, మస్లిములుకూడా హత్యకు లోనైనారు. అందులో భేదమేమీ అతడు చూపలేదు. యుద్ధఖైదీలసంఖ్య అధికమై భారముగా ఉండుటవల్ల వారినందరినీ చంపమని అతడు ఉత్తరువు చేశాడు. ఈ విధంగా లక్షమంది హత్య చేయబడ్డారు. ఒక స్థలమున హిందువులును, మస్లిములును రాజపుత్ర సంప్రదాయానుసారంగా జౌహరు చేశారని చెప్పుతారు— అనగా యుద్ధములో పోరాడుతూ చనిపోవ సంకల్పించి, రణభూమికి తరలివెళ్ళారు. సరే ఎందుకు ఈ విశాద గాథ అంతా నేను తవ్వుకుంటూ పోవడం? అతడు పోయిన చోటల్లా ఈ విధంగానే జరిగింది. తైమూరు సైన్యము వెనకాలే కాటకమూ, రోగములూ దేశములో ప్రవేశించినవి. అతడు ఢిల్లీలో పదిహేను దినములున్నాడు. ఆ మహానగరాన్ని కసాయి అంగడిగా మార్చా డతడు. తోవలో కాశ్మీరమును కొల్లగొట్టి అతడు సమరఖండము తిరిగివెళ్ళాడు.

అనాగరికుడైనప్పటికీ తైమూరు సమరఖండములోను, ఆసియా మైనరులోను చక్కని కట్టడములను నిర్మించవలెనని సంకల్పించెను. ఇంతకు ఎంతో కాలమునకు ముందు సుల్తాను మహమ్మదు చేసినట్లే ఇతడున్నూ శిల్పులనూ, భవననిర్మాణ ప్రవీణులనూ, నేర్పరులైన పనివాళ్ళనూ పోగుచేసి ఇండియానుండి తన దేశానికి తీసుకొనివెళ్ళాడు. ఇందు ప్రముఖులైన ప్రవీణులనూ, వాస్తుశాస్త్రజ్ఞు

లనూ తనసొంత నౌకరీలోనే ఉంచుకొన్నాడు. మిగతవారిని పడమటి ఆసియాలోని ముఖ్యపట్టణములకు సర్దివేశాడు. ఈ విధముగా ఒక కొత్త వాస్తువిధానము అక్కడ ఆవిర్భవించింది.

తైమూరు వెళ్లినపిమ్మట ఢిల్లీ శ్మశానవాటికవలె ఉండెను. క్షామము, అంటురోగములు నగరములో ప్రబలెను. రెండు నెలల వరకూ పాలకుడు లేడు. పద్ధతిలేదు. క్రమతలేదు. ఉన్నజనులు కూడా చాలా కొద్దిమంది. తన ప్రతినిధిగా ఢిల్లీలో నియమించబడ్డ ఉద్యోగికూడా ముల్టాను వెళ్ళిపోయాడు.

తైమూరు, తరువాత పడమటిదిక్కుగాపర్షియా, మెసపటేమియాల మీదికి వెళ్ళి అక్కడ ప్రజానాశనము చేశాడు. 1402 లో అంగోరా వద్ద అతడు ఆటోమన్ తురుష్కుల పెద్దసైన్యమును ఎదుర్కొన్నాడు. అద్భుతముగా సైన్యమును నడిపి అతడు తురుష్కులను ఓడించాడు. తరువాత అతనికి సముద్రము అడ్డువచ్చెను. బాస్ఫొరసు జలసంధిని అతడు దాటలేకపోయాడు. ఇందువల్ల అతని బారినుండి యూరోపు తప్పించుకొన్నది.

మరి మూడు సంవత్సరములకు, 1405 లో తైమూరు చీనాపైకి పోవుచుండగా మరణించాడు. అతడు మరణించుటతోడనే అతని మహా సామ్రాజ్యమున్నూ చతికిలబడింది. ఈ సామ్రాజ్యము సుమారు పడమటి ఆసియా అంతటా వ్యాపించియుండెను. ఆటో మనులు అతనికి కప్పము చెల్లించిరి. ఈజిప్టు, గోల్డెన్‌హోర్డి కూడా అతనికి కప్పము చెల్లించెను. అతని సామర్థ్యమంతా సేనానాయకత్వ ములో ఉండెను. అది అసాధారణమైనది. సైబీరియా మంచు ప్రదేశములలో అతడు చేసిన యుద్ధములు కొన్ని అసాధారణమైనవి. కాని అతడు స్వతఃసిద్ధముగా అనాగరికుడగు త్రిమ్మరి. అతడు ఎట్టి కట్టుబాట్లూ చేయలేదు. చెంగిజ్‌ఖాన్ చేసినట్లు అతని అనంతరము సామ్రాజ్యపాలనను సాగించుటకు అతడు సమర్థులను తయారు

చెయ్యలేదు. కాబట్టి తైమూరు సామ్రాజ్యము అతనితోనే అంత రించింది. ఇక మిగిలినవి అతడు చేసిన హత్యలూ, విధ్వంసమూ. మధ్య ఆసియా గుండా దండయాత్రలు సాగించినవారు పలువురు సాహసులూ, విజేతలూ గలరు. వారిలో నాలుగు పేళ్ళు మాత్రమే నేటికిని మధ్య ఆసియాలో స్మరింపబడుచున్నవి. వారు సికందరు (అలెగ్జాండరు), సుల్తాను మహమ్మదు, చెంగిజ్‌ఖాను, తైమూరు.

తైమూరు ఆటోమన్ తురుష్కులను ఓడించి వారిని గడగడ లాడించాడు. కాని వారు త్వరలోనే తేరుకొనిరి. మరి యాభై సంవత్సరములలో (1453 లో) వారు కాంస్టాంటినోపులును వశ పరచుకొనిరి.

ఇక మనము మధ్య ఆసియాను వదిలిపెట్టెదము. అది నాగరీ కతలో తగ్గుతున్నది. అజ్ఞాతములోకి పోతున్నది. మనము గమనించ దగ్గ విశేషాలేమి అక్కడ జరగలేదు.

మానవుడు భగ్నముచేసిన ప్రాచీన నాగరికతా స్మృతిమాత్రము అక్కడ మిగిలినది. ప్రకృతికూడా దానిపై క్రూరదృష్టులు ప్రసరిం చింది. ఆ దేశముయొక్క శీతోష్ణస్థితి మారిపోయింది. నీటివసతి తగ్గిపోవుటవల్ల అది జనులకు వాసయోగ్యము కాకుండెను.

మంగోలులనుకూడా మనము వదలిపెట్టుదము. వారిలో ఒక్క శాఖ మాత్రము పిదపకాలములో ఇండియాకు వచ్చి అక్కడ ప్రసిద్ధి కెక్కిన గొప్ప సామ్రాజ్యమును నిర్మించుకొన్నది. చెంగిజ్‌ఖాన్ యొక్కయు, అతని సంతతివారియొక్కయు సామ్రాజ్యము మాత్రము విచ్ఛిన్నమాయెను. మంగోలులు మరల తమ చిన్ననాయకుల ఆధి పత్యములో, తమ పాతసంప్రదాయములతో పూర్వస్థితికి వచ్చిరి.

# 75

# ఇండియా ఒక కఠిన సమస్యను పరిష్కరింప పూనుకొనుట

జూలై 12, 1932

తైమూరును గురించియు, అతని హత్యలను గురించియూ, అతడు నిర్మించిన కపాలముల పిరమిడ్లను గురించియు నీకు వ్రాసి యుంటిని. ఇదంతా ఎంత అనాగరికము; ఎంత విషాదకరము! మన నాగరిక యుగములో అట్టి పనులు జరగడానికి వీలులేదు. కాని అంత నిష్కర్షగా ఆ మాట చెప్పలేము. మన కాలములో కూడా ఎట్టి పనులు జరిగాయో, జరుగ గలవో మనము చూచాము, విన్నాము. చెంగిజ్‌ఖాన్‌గాని, తైమూరుగాని చేసిన వినాశనము - ప్రజానాశము, ధన నాశము ఎంత దారుణంగా ఉన్నా 1914-18 లో జరిగిన మహాయుద్ధంలో జరిగిన వినాశనముతో పోల్చి చూస్తే అంత అవి చెప్పుకో తగ్గవి కావనిపిస్తుంది. మంగోలులు చేసిన ప్రతి క్రూరకార్యమూ, నేటి కాలపు భయంకర కార్యములకు సాటివస్తవి.

అయినా చెంగిజ్, తైమూరుల కాలముకంటె నేడు మనము శతవిధాల అభివృద్ధి చెంది ఉన్నాము. జీవనము ఎంతో క్లిష్టమైనది. కాని సంపద్యుక్తముగా ఉన్నది. ప్రకృతి శక్తులను అనేకము అన్వేషించి ఈకాలమున కనుగొన్నారు. మానవుని కొరకు వాటిని ఉపయోగించు చున్నారు. ప్రపంచము వెనుకటికన్న ఎక్కువ నాగరికమైనది. సంస్కృతి గన్నది. అయితే మన మెందువల్ల యుద్ధకాలములలో అనాగరికులవలె ప్రవర్తించు చున్నాము? ఎందుకంటే — నాగరికతా సంస్కృతుల అభావమే యుద్ధమగుచున్నది. కాని నాగరికత నందినవారి తెలివితేటల సహాయముతో దారుణమైనట్టియు, విధ్వంసకరము

లైనట్టియు ఆయుధములు మాత్రము సృష్టించి యుద్ధములలో వాడుతున్నారు. యుద్ధము తటస్థించడము తోడనే అందుకు సంబంధించిన వారు ఉద్రేకపూరితులై, నాగరికతవల్ల వారు గ్రహించిన విషయములను మరిచిపోయి, సత్యమును మరిచి, జీవితస్వారస్యములను మరిచి, కొద్దివేల సంవత్సరములకు ముందున్న తమ అనాగరికులగు పూర్వులను తలపునకుతెచ్చు చున్నారు. ఎప్పుడు తటస్థించినా యుద్ధము మహాదారుణముగా పరిణమిస్తుందంటే ఆశ్చర్యం ఎందుకు?

మన ప్రపంచమునకు చెందని పరాయివాడు యుద్ధసమయములో మన ప్రపంచమును చూడడం తటస్థిస్తే ఏమంటాడు? అతడు అట్టి సమయములందే మనలను చూచాడనుకొందాము. శాంతి సమయము లందు చూడలేదనుకొందాము. యుద్ధమునుబట్టి మన యోగ్యతను అతడు నిర్ణయిస్తాడు. మనము క్రూరులమనీ, దయా దాక్షిణ్యములులేని అనాగరికులమనీ, అప్పుడప్పుడు సాహసము, త్యాగము చూపినా, మొత్తముమీద మనకేమీ మంచిలక్షణములు లేవనీ, ఒకరినొకరు చంపుకొని నాశనం చేసుకోవడమే మనకు ఉన్నప్రధానగుణమనీ, అతడు అనుకొంటాడు. అతడు మన విషయములో తప్పుడు అభి ప్రాయములు పెట్టుకుంటాడు. మన ప్రపంచమును గురించి సరియైన అభిప్రాయములు అతని కుండవు. ఇందుకు కారణము అతడు మనలను, ఒక ప్రత్యేకకాలమున ఒకసందర్భమున మాత్రము కొంతగా చూడడము.

ఇల్లే గతకాలమంతా యుద్ధములతోనూ, హత్యలతోనూ నిండి వున్నదంటే గతమును మనము సరిగా అర్థము చేసుకోలేదన్నమాట. యుద్ధములూ, హత్యలూ దురదృష్టవశమున మానవుల దృష్టిని ఆకర్షిస్తవి. ప్రజల అనుదిన జీవనము అకర్షణీయముకాదు. చరిత్ర కారుడు దీనిని గురించి ఏమి చెప్పుతాడు? కాబట్టి సంగ్రామములూ, యుద్ధములూ అంటే అతనికిష్టం. వాటిని ఇష్టమువచ్చినట్లు వర్ణిస్తాడు.

యుద్ధములను మనము మరువనూ కూడదు ఉపేక్షించనూ కూడదు. నిజమేకాని వాటికి ఉచితమైన ప్రాముఖ్యమును మాత్రమే ఇయ్యవలెను. గతకాలమును వర్తమానకాలముతో సరిపుచ్చి చూచుకోవలెను. గతకాలమందలి జనులను ఈనాటి మనతో సరిపుచ్చి చూచుకోవలెను. అప్పుడు వారిని గురించి మనము సరియైన, మానవప్రకృతి కనుగుణమైన, అభిప్రాయము కలవారమగుదుము. నిజముగా తెలిసికోవలసినది ప్రజల అనుదిన జీవనమును, వారి ఆలోచనలను మాత్రమే, కాని అప్పుడప్పుడు తటస్థించు యుద్ధములు కావని గ్రహింతుము. మీ చరిత్రగ్రంథములన్నీ యుద్ధములతో నిండియున్నవి కాబట్టి ఈ విషయమును జ్ఞాపకముంచుకొనుట మంచిది. ఈనాజాబులైనా ఒక్కొక్కప్పుడు యుద్ధములవైపు మొగ్గుతూ వుంటవి. ఇందుకు నిజమైన కారణము గతకాలమునాటి ప్రజల అనుదిన జీవితమును గురించి వ్రాయడం కష్టము. దానిని నాకు అట్టే తెలియదు.

ఇండియాకు తటస్థించిన దారుణ విపత్తులలో ఒకటి తైమూరు దండయాత్ర అని తెలిసికొన్నాము. అతడు దర్శించిన ప్రదేశములన్నింటా చేసిన దారుణకృత్యాలు తలుచుకుంటే ఒళ్లు జలదరిస్తుంది. దక్షిణ ఇండియా, తూర్పు, పశ్చిమ, మధ్య ఇండియాలు అతని బారిని పడలేదు. ఉత్తరమున ఢిల్లీ, ముల్తానులవద్ద చిన్నభాగము వినా సంయుక్త రాష్ట్రములుకూడా అతని బారిని పడలేదు. తైమూరు దండయాత్రవలన ఎక్కువగా బాధపడినవి ఢిల్లీ నగరమును, పంజాబును. పంజాబులోనైనా తైమూరుపోయిన మార్గములో ఉన్నవాళ్లే బాధపడ్డారు. పంజాబు ప్రజలు చాలామంది తమ దినకృత్యములు చేసుకొంటూనే ఉండిరి. కాబట్టి యిట్టి యుద్ధములకూ, దండయాత్రలకూ ప్రాముఖ్యమును ఇచ్చి అతిశయోక్తులతో వర్ణించకూడదనీ, జాగ్రత్తగా ఉండాలనీ తేలుతోంది.

14, 15 శతాబ్దులలోని ఇండియాను ఒకమారు చూతము. ఢిల్లీ

సుల్తానుల ప్రభుత్వము నానాటికీ ముడుచుకుపోయి తైమూరు దండయాత్రతో అంతరించింది. ఇండియా అంతటిలోనూ యెన్నో స్వతంత్ర రాజ్యములు, ముఖ్యముగా మస్లిము రాజ్యాలు వుండెను. ప్రబలమైన హిందూరాజ్యము — విజయనగర రాజ్యము దక్షిణమున ఒక్కటి ఉండెను. ఇండియాలో ఇస్లాం పాదుకొనెను. అది కొత్తగా వచ్చినట్లూ, పరాయిమతమైనట్లూ భావింపబడుటలేదు. తొలుత దండయాత్ర చేసిన ఆఫ్ఘనులయొక్కయు, బానిస రాజులయొక్కయు భీకరత్వమూ, క్రౌర్యమూ తగ్గినవి. మస్లింరాజులు హిందూ రాజులవలెనే హిందూ దేశస్థులై పోయిరి. వారికి బాహ్యదేశములతో సంబంధములులేవు. వివిధ రాజ్యములకు యుద్ధములు తటస్థించినా అవి రాజకీయయుద్ధములే కాని మతమునకు సంబంధించినవికావు. ఒక్కొక్కప్పుడు మస్లిం రాజ్యము హిందూ సైన్యములను, హిందూరాజ్యము మస్లిం సైన్యములనూ పెట్టుకొనుచుండెను. మస్లిం రాజులు తరుచు హిందూ స్త్రీలను వివాహమాడుచుండిరి. హిందువులను తరుచు మంత్రులుగాను, ఉన్నతోద్యోగులుగాను మస్లింరాజులు తీసుకొనుచుండిరి. విజేత, విజితుడు, పాలకుడు, పాలితుడు అనేభావము లేకుండెను. మస్లిములలో చాలామంది, కొందరు పాలకులతోసహా, మతాంతరులైన హిందువులే. రాజుగారి అనుగ్రహము సంపాదించవలెననో, లాభకరముగా వుంటుందనో వీరిలో పెక్కుమంది మతాంతరులైరి. మతము మార్చుకొన్నా తమ పాత ఆచారాలు పెక్కింటిని వారనుసరిస్తూనే వుండిరి. కొందరు మస్లిము పాలకులు బలాత్కార పద్ధతుల నుపయోగించి మతము మార్పించేవారు. దీనికైనను ఉద్దేశము రాజకీయమైనదే. మతాంతరులైనవారు స్వామిభక్తితో వుంటారని అనుకొని అట్లా చేశారు. బలాత్కారమువల్ల మతము మార్చుకొనుట సులభముగాజరిగే పనికాదు. ఆర్థికపరిస్థితులే మతము మార్చుకోవడమునకు ప్రధాన కారణము. మహమ్మదీయేతరులు జిజియా అనే తలపన్ను కట్టవలసి వచ్చేది.

అనేకులు హిందువులు పన్ను తప్పించుకోడానికని ముస్లిములయ్యారు.

ఇదంతా నగరములలో జరుగుచుండెను. గ్రామములకు ఈ సౌక్య తగలలేదు. లక్షలకొద్ది గ్రామస్థులు పాతపుంతలలోనే పోవు చుండిరి. రాజుగారి ఉద్యోగస్తులు గ్రామ వ్యవహారాల్లో కలగచేసుకోవడం కద్దు. పంచాయతుల అధికారము వెనుకటికన్న యిప్పుడు తక్కువగానే ఉండెను. అయినా పంచాయతులు పనిచేస్తూనేవున్నవి. గ్రామాలకవి ఆధారభూతంగా ఉన్నవి. గ్రామవ్యవహారాల కవి కేంద్రముగా వుండెను. సాంఘికముగాను, మతవిషయములోను, ఆచారముల లోను గ్రామములలో ఏమి మార్పు రాలేదనే చెప్పవలెను. ఇండియా నేడుకూడా వేలకొద్ది గ్రామములుగల దేశమని నీకు తెలుసును. పట్టణములూ, నగరములూ పైభాగమున ఉన్నప్పటికీ నిజమైన ఇండియా నాటికి నేటికీకూడా గ్రామములతోనైన ఇండియాయే. ఇస్లాంవల్ల ఈ ఇండియాకెట్టి మార్పున్నూ రాలేదు.

ఇస్లాం రాకవల్ల హిందూమతము రెండు విధములుగా మార్పు చెందింది. ఈ రెండు విధములున్నూ పరస్పర విరుద్ధములై యుండుట వింతవిషయమే. ఒకవిధముగా చూచిన అది పూర్వాచార బద్ధమైనది. పైనుంచివచ్చిన దెబ్బను తప్పించుకోవాలని అది తనగుల్లలోకి దూరి కూర్చుంది. వర్ణధర్మాలు బిగిసిపోయినవి. స్త్రీలకు ఘోషా సామాన్యమయినది. రెండవవిధముగా చూచిన వర్ణధర్మాలమీదా, పూజాది కర్మకాండముమీదా ఒక విధమైన తిరుగుబాటు వచ్చింది. దానిని సంస్కరించే ప్రయత్నాలనేకము జరిగినవి.

చరిత్రపొడుగునా, తొలికాలమునుంచీ, హిందూ మతమందలి దోషములను సంస్కరించబూనిన పురుషులు పుట్టుతూనే వున్నారు. ఈ సంస్కర్తలలో అగ్రగణ్యుడు బుద్ధుడు. 8 వ శతాబ్దిలో వుండిన శంకరాచార్యులను గురించి కూడా నేను నీకు చెప్పియున్నాను. మరి మూడు వందల సంవత్సరములైన పిమ్మట, పదకొండవ శతాబ్దిలో,

చోళ సామ్రాజ్యములో వేరొక గొప్ప సంస్కర్త వుండెను. శంకర మతమునకు భిన్నముగానుండు మతమును అతడు స్థాపించెను. అతని పేరు రామానుజుడు. శంకరుడు శైవుడు,* జ్ఞాని. రామానుజుడు వైష్ణవుడు. భక్తుడు. రామానుజుని మతము ఇండియా అంతటా వ్యాపించింది. రాజకీయముగా ఇండియా ఒండొరులతో యుద్ధములు చేసికొను రాజ్యములుగా విభజింపబడివున్నను సంస్కృతి విషయమున మాత్రము కలకాలమునుండియూ ఒక్కటిగా కలిసియే యుండెను. రాజకీయ పొలిమేరలు ఏవిధముగాపున్నా ఒక మహాపురుషుడుగాని, ఒక ఉద్యమముగాని పొడచూపినప్పుడు అది ఇండియా అంతటా వ్యాపించింది.

ఇండియాలో ఇస్లాం కాలు నిలువదొక్కుకున్న పిమ్మట హిందువులలోనుండీ, మస్లిములలోనుండీ ఒక కొత్తమాదిరి సంస్కర్తలు లేచిరి. అతడు ఆ రెండు మతములను సమీపమునకు తేవలెనని ప్రయత్నించాడు. ఆ రెండు మతములందున్న సామాన్య లక్షణములను యెత్తిచూపాడు. కర్మకలాపాన్ని నిరసించాడు. ఈ విధముగా రెండు మతములను సంయోగము చేయుటకు — కలుపుటకు — ప్రయత్నము చేయబడ్డది. అది కష్టసాధ్యమైన కార్యమే. ఉభయ మతస్థులును ఒకరినొకరు ద్వేషించుకొనుచుండిరి. ఒక మతమువారు రెండవ మతమునుచూచి దురభిప్రాయ పడుచుండిరి. ప్రతి శతాబ్దిలోనూ ఇట్టి కృషి జరుగుచున్నట్లే మనము గమనించవచ్చును. కొందరు మస్లిం ప్రభువులు సైతము ఈ సంయోగముకొరకు పాటుపడిరి. వీరిలో ముఖ్యముగా పేర్కొనదగ్గవాడు అక్బరు.

పద్నాలుగో శతాబ్దిలో దక్షిణదేశమున నివసించిన రామానందుడు ఈసంయోగము శ్రేయస్కరమని బోధించిన మొట్టమొదటి ప్రముఖుడు. వర్ణధర్మము మంచిదికాదని అతడు బోధించి, దానిని ఉపేక్షించెను.

---

* శంకరుడు అద్వైతి — అ.

అతని శిష్యులలో కబీరు అను మస్లిము సాలెవాడుండెను. అతడు గురువుకన్నకూడా యెక్కువ కీర్తి గడించెను. కబీరు చాలా ప్రజా రంజకుడయ్యెను. ఉత్తరాదిని నూరునూల గ్రామములలోకూడా అతని హిందీ కీర్తనలు నేడుకూడా పాడుతూ వుంటారని నీకు తెలుసును. అతడు హిందువుకాడు, మస్లిమునుకాడు. అతడు రెండు మతములకును చెందినవాడు. లేదా రెండు మతముల సారమును గ్రహించినవాడు. అతని శిష్యులలో రెండు మతములవారును వున్నారు. అన్నివర్ణముల వారును వున్నారు. అతనిని గురించి ఒక కథ కలదు. అతడు చని పోయిన పిమ్మట అతనిశరీరాన్ని ఒకబట్టతో కప్పారట. అతని హిందూ శిష్యులా దేహమును దహనమునకు తీసుకుపోతామన్నారు. అతని మస్లిం శిష్యులు దానిని ఖననము చేస్తామన్నారు. వారుభయులూ వాదించుకొన్నారు. కొట్లాడుకొన్నారు. కాని కప్పినబట్టను తియ్యడం తోనే అక్కడ ఏదేహముకోసము తాము కొట్లాడుకొంటున్నారో ఆ దేహము అదృశ్యమైనది. ఆ స్థలములో కొన్ని వాడని పువ్వులు కనిపించినవి. ఈకథ కల్పితము గావచ్చును. కాని చక్కగా వున్నది.

కబీరుకు కొంతతరువాత వేరొక గొప్ప సంస్కర్తా, మతనాయ కుడూ ఉత్తరాదిని లేచాడు. ఇతడు నానక్ గురువు. సిక్కుల మత స్థాపకు డితడే. ఇతని తరువాత ఒకరి వెనుక ఒకరు పదిమంది శిక్కు గురువులు వచ్చారు. వీరిలో ఆఖరి గురువు గురుగోవింద సింగు.

ఇండియా మతచరిత్రలోను, సంస్కృతి చరిత్రలోనూ ప్రసిద్ధినందిన వేరొక పురుషుని ఇక్కడ పేర్కొంటాను. అతడు చైతన్యుడు. పదహారవశతాబ్ది తొలిరోజులలో అతడు బెంగాలులో ప్రసిద్ధినందిన పండితుడు. అతడు తన పాండిత్యము కొరగానిదని ఒకనాడు తలచి దానినుండి మనస్సును మరలించాడు. భక్తిమార్గమున ప్రవేశించి అతడు గొప్ప భక్తుడయినాడు. తన శిష్యులతో భజనకీర్తనలు పాడు కుంటూ అతడు బెంగాలు దేశమంతా సంచరించాడు. అతడొక

వైష్ణవ సంప్రదాయమును స్థాపించాడు. నేటికిని బెంగాలులో అతని ప్రభావము అధికముగా వున్నది.

మత సంస్కరణము, మత సంయోగములను గురించి ఇంత వరకూ తెలుసుకొన్నాము. జీవితమునకు సంబంధించిన ఇతర శాఖలలోకూడా ఒక్కొక్కప్పుడు తెలిసిన్నీ, తరుచు తెలియకుండానుకూడా ఈ సంయోగము జరుగుతూనే వుండెను. ఒక కొత్త సంస్కృతీ, ఒక కొత్త వాస్తు నిర్మాణపద్ధతీ, ఒక కొత్తభాషా రూపొందుచుండెను. కాని ఇదంతా నగరములలోనే జరుగుతున్నది కాని పల్లెలలో కాదను సంగతి జ్ఞాపకముంచుకొనుము. ముఖ్యముగా సామ్రాజ్య రాజధానియగు ఢిల్లీలోను, రాజ్యములయొక్కయు రాష్ట్రములయొక్కయు ఇతర గొప్ప రాజధానులలోను ఈ పరివర్తనము జరుగుతుండెను. అధికారపీఠమున కూర్చున్న రాజు ఎప్పటివలెనే నిరంకుశుడుగానే వుండెను. దేశాచార సంప్రదాయములు పూర్వ హిందూరాజుల నిరంకుశత్వమును విజృంభించనీయలేదు. కొత్తగా వచ్చిన ముస్లిం రాజులకీ అడ్డులేవు. మాటవరుసకు ఇస్లాములో సమానత్వము హెచ్చుగా వున్నప్పటికీ, ఒకబానిస, సుల్తాను కాగలిగినప్పటికీ రాజుయొక్క అడ్డులేని నిరంకుశాధికారము పెరిగినది. ఢిల్లీనుండి దౌలతాబాదుకు రాజధానిని మార్చిన పిచ్చి టోగ్లకు చర్య ఇందుకు నిదర్శనము.

బానిసలను ఉంచుకొను ఆచారముకూడ, ముఖ్యముగా సుల్తానులలో, అతిశయించింది. యుద్ధములో బానిసలను పట్టుకొనుటకు ప్రత్యేక ప్రయత్నాలు చేసేవారు. ఇట్టివారిలో శిల్పులకు విలువ యెక్కువ. మగిలినవారు సుల్తానుకు అంగరక్షకులుగా వుండేవారు.

నలందా, తక్షశిలా విశ్వవిద్యాలయా లేమైనట్లు? అవి అంతరించి చాలాకాలమైనది. కాని కొత్తమాదిరి విశ్వవిద్యాలయ కేంద్రములు లేచినవి. అవి సంస్కృత విద్యగరపు పాఠశాలలు. అవి కాలాను గుణముగా లేవు. అవి గతములో జీవించుచుండెను. మార్పునవి

అంగీకరించడములేదు. అట్టి గొప్ప కేంద్రములలో వారణాసి ఒక్కటి నాటినుండియు వున్నది.

కబీరు చెప్పిన హిందీ కీర్తనలను గురించి నీకు పైని చెప్పియుంటిని. 15 వ శతాబ్దిలో హిందీభాష ప్రజాభాషగానే కాకుండా గ్రంథ భాషగాకూడా వుండెను. చాలాకాలమునుంచి సంస్కృతము వ్యవహారిక భాషగాలేదు. కాళిదాసు కాలమందును, గుప్తరాజుల కాలమందునుకూడా సంస్కృతము పండితులకు మాత్రమే సాధ్యముగా వుండెను. సామాన్యజనులు ఒక ప్రాకృతభాషలో మాటాడుకొనుచుండిరి. సంస్కృతము మార్పు చెందగా వచ్చిన భాషే ప్రాకృతము. మెల్లగా సంస్కృత జన్యములైన భాషలు వృద్ధిచెంద జొచ్చినవి. అవి హిందీ, బెంగాలీ, మరాఠీ, గుజరాతీ. ముస్లిము గ్రంథకర్తలూ, కవులూ హిందీలో వ్రాశారు. 15 వ శతాబ్దిలో ఒక ముస్లిము జాన్‌పూరు రాజు మహాభారత, భాగవతములను సంస్కృతమునుండి బెంగాలీకి అనువదింపజేశాడు. దక్షిణమున బిజాపూరు ముస్లిము సుల్తానుల పద్దులన్నీ మహారాష్ట్రభాషలోనే వున్నవి. దీనినిబట్టి, అప్పుడే 15 వ శతాబ్దిలో సంస్కృత జన్యభాషలు యెంతో వృద్ధిచెందినట్లు తెలుసుకోవచ్చును. దక్షిణ ఇండియాలోని ద్రావిడభాషలు-తమిళము, తెలుగు, మలయాళము, కన్నడము - ఇంతకన్న ప్రాచీనభాషలు.

ముస్లిముల రాజభాష పర్షియను. రాచకొలువులతోగాని, ప్రభుత్వోద్యోగములతోగాని సంబంధము కలవారు అనేకులు విద్యాధికులు పర్షియను నేర్చుకొనిరి. ఇట్లు హిందువులనేకులు పర్షియను నేర్చుకొనిరి. క్రమక్రమముగా శిబిరముల (Camps) లోను, బజారులలోను ఒకకొత్త భాష వృద్ధినందుచుండెను. దానిపేరు ఉర్దూ. ఉర్దూ అను పదమునకు శిబిరము అని అర్థము. అది కొద్ది భేదములతో కూడుకొన్న హిందీ భాషయే. ఈ హిందీ, ఉర్దూభాషను హిందూస్తానీ అనికూడా అంటారు. అది ఉత్తర మధ్య ఇండియాలలో అంతటా వ్యాపించింది. కొద్ది

తేడాలతో నేడది 15,00,00,000 మంది ప్రజలచే మాటాడబడుచున్నది. అంతకన్న యెక్కువమంది దానిని అర్థము చేసుకొనుచున్నారు. కాబట్టి సంఖ్యనుబట్టిచూస్తే అది ప్రపంచమందలి పెద్ద భాషలలో ఒకటగుచున్నది.

వాస్తు నిర్మాణమున కొత్త వైఖరులు తలయెత్తి వృద్ధిచెందినవి. దక్షిణమున బీజపూరు, విజయనగరములలోను, గోల్కొండలోను, ఆ కాలమున అందమైన గొప్ప నగరమగు అహమదాబాదులోను, అలహాబాదుకు సమీపమందున్న జాన్‌పూర్‌లోను చక్కని భవనము లనేకము లేచినవి. హైదరాబాదు సమీపమందున్న గోల్కొండ శిధిలములను మనము దర్శించితిమి జ్ఞాపకమున్నదా? మనము ఆపెద్దకోట ఎక్కితిమి. దిగువనున్న ప్రాచీనపట్టణమును చూచితిమి. నగరులతో, మార్కెట్లతో అది అంతయును శిథిలావస్థలో నుండెను.

రాజులొకరితో ఒకరు పోరాడి ఒకరినొకరు చంపుకొంటూన్న కాలంలో నిరంతరాయముగా ఇండియాలో గుప్తశక్తులు సంయోగము కొరకు పనిచేయుచుండెను. ఇండియాదేశ ప్రజలు సామరస్యముతో కలిసిమెలిసి జీవించగలందులకున్నూ, అభివృద్ధికీ - అభ్యుదయమునకూ వారందరూ కలిసి పాటుపడగలందులకున్నూ ఈపని జరుగుచుండెను. ఈకార్యము పూర్తికాకుండానే విఘ్నము వచ్చినది. మనము వచ్చిన దారినే వెనుకను పోవలసివచ్చినది. మళ్ళీ మనము ఆ బాటనే పట్టి పోవలసి వున్నది. మంచి అన్నదంతయు సంయోగము చేయుటకు కృషిచేయవలెను. కాని ఈమారు పునాది దిట్టము చేసికొని పనిచేయవలసి వున్నది. అది స్వేచ్ఛపై, సాంఘికసమత్వముపై ఆధారపడి వుండవలెను. ఇంతకన్న మంచి ప్రపంచపరిస్థితులు సమకూడినప్పుడు వాటికనుగుణముగా ఇది వుండవలెను. అప్పుడే ఇది స్థిరస్థాయిగా నిలువగలదు.

మతమును, సంస్కృతియు సంయోగము కావలెనన్న సమస్యను

పరిష్కరించుటకు ఎన్నోవందల సంవత్సరములపాటు దేశములోని బుద్ధిమంతులు ప్రయత్నించిరి. ఈ కార్యమునందే వారు నిమగ్నులై యుండుటచేత రాజకీయ, సాంఘిక స్వేచ్ఛలను వారు మరచిరి. పలువిధ మార్గములలో యూరోపు ముందుకు త్రోసుకొని పోవుచుండగా ఇండియా వృద్ధి చెందకుండ, వృథా కాలక్షేపముచేయుచు వెనుకనే నిలిచి పోయినది.

ఒకప్పుడు ఇండియా పరదేశ వ్యాపారమును తన చేతులలో పెట్టుకొన్నదని ఇదివరలో చెప్పియుంటిని. రసాయన శాస్త్రమున అభివృద్ధి చెందినది కాబట్టే ఇట్లు చేయగలిగినది. రంగులు తయారు చేయుటలోనూ, ఉక్కును సరియైన పదునుకు తీసుకు వచ్చుటలోనూ అది ప్రావీణ్యముకన్నది. పరదేశ వ్యాపారమును స్వాధీనముచేసికొన గలిగిన కారణములింకా అనేకమున్నవి. ఇండియా ఓడలు దాని వర్తకపు సరుకును దూరప్రాంతములకు తీసుకొని పోవుచుండెను. మనము ప్రసంగించుకొను కాలమునకు యెంతో ముందుగానే ఈ వ్యాపారమును అది పోగొట్టుకొన్నది. 16 వ శతాబ్దిలో తూర్పు దిక్కుగా మరల నది ప్రవహించ మొదలు పెట్టింది. మొట్టమొదట బొట్లుబొట్లుగా ప్రవహించింది. కాని ఇది క్రమంగా వృద్ధిజెంది మహా నదిగా ప్రవహింపనున్నది.

# 76
# దక్షిణ ఇండియా రాజ్యములు

జూలై 14, 1932

ఇంకొకమారు ఇండియాను చూతము. మారుచున్న రాజ్యముల యొక్కయు, సామ్రాజ్యములయొక్కయు దృశ్యములను గమనింతము. ఒకదాని తరువాత ఒకటిగా మాటాడని బొమ్మలు వచ్చు అంతములేని గొప్ప సినీమావలెనిది వున్నది.

పిచ్చి సుల్తాను మహమ్మదు టోగ్లకును గురించిన్నీ, అతడు ఢిల్లీ సామ్రాజ్యమును భగ్నముచేసిన విధమును గురించిన్నీ నీకు చెప్పితిని జ్ఞాపకమున్నదా? దక్షిణముననున్న గొప్ప రాష్ట్రములు కొన్ని సామ్రాజ్యమునుండి తప్పుకొన్నవి. కొత్తరాజ్యములక్కడ తల యెత్తినవి. వీటిలో ముఖ్యముగా పేరొక్కదగ్గవి విజయనగర హిందూ రాజ్యమును, గుల్బర్గా మస్లిము రాజ్యమున్నూ. తూర్పున గౌరు రాష్ట్రము—ఇందు బెంగాలు, బీహారులున్నవి—ఒక మస్లిము పాలకుని కింద స్వతంత్రమైనది.

మహమ్మదు అనంతరము సింహాసన మెక్కినవాడు అతని మేనల్లుడు ఫిరోజ్‌షా. ఇతడు మహమ్మదుకన్న తెలివిగలవాడు. దయా దాక్షిణ్యములు కలవాడు. అయినా అసహనమింకా నిలిచి వున్నది. ఫిరోజ్ సమర్థుడు. అతడు రాజ్యపరిపాలనమున అనేక సంస్కరణములు ప్రవేశపెట్టెను. దక్షిణమున, తూర్పున పోగొట్టు కొన్న రాష్ట్రములను అతడు తిరుగ పొందలేకపోయెను. కాని సామ్రాజ్యమింకా చిదికిపోకుండా వుండేటట్లు అతడు చూచుకొన్నాడు. కొత్త నగరములు నిర్మించుట, నగరులు, మసీదులు నిర్మించుట, తోటలువేయుట అనిన అతనికి ఎక్కువ సరదా. ఢిల్లీ వద్దనున్న ఫిరోజాబాదును, అలహాబాదుకు అనతిదూరములోనున్న జాన్‌పూరును అతడు ప్రతిష్ఠించినవే. యమునానదిమీద అతడొక గొప్ప కాలువను నిర్మించెను. శిథిలమగుచున్న పాత భవనములను బాగుచేయించెను. తానుచేసిన పని కాతడెంతో సంతుష్టి చెందెను. అతడు కట్టించిన భవనములును, బాగుచేయించిన పాత భవనములునూ అనేకము.

ఫిరోజ్‌షా తల్లి రాజపుత్రస్త్రీ. ఆమెపేరు బీబీనైలా. ఒక గొప్ప నాయకుని కూతురు. ఆమెను ఫిరోజ్ తండ్రికిచ్చి పెళ్ళిచేయ డానికి మొట్టమొదట సమ్మతించలేదట. ఆమీదట యుద్ధములోనికి దిగవలసివచ్చినది. నైలా దేశముమీదపడి శత్రువులు దానిని ధ్వంసము

చేశారు. ప్రజల అగచాట్లను గురించి బీబీనైలా విన్నది. చాలా దుఃఖించింది. తనకొరకుగదా ప్రజలింతగా బాధపడవలసివచ్చినదని ఆలోచించి, ప్రజలబాధలు నివారింపదలచి, తానే స్వయముగా ఫిరోజ్ తండ్రి చేతులలో చిక్కింది. ఈ విధముగా ఫిరోజ్ రక్తనాళములలో రాజపుత్ర రక్తము ప్రవేశించింది. మస్లిము రాజులకును రాజపుత్ర స్త్రీలకును ఇట్టి మతాంతర వివాహములు తరుచుగా జరుగుచునే ఉండెను. ఏకజాతి అనే భావన అభివృద్ధి చెందడానికి ఈవివాహములు తోడ్పడి వుండవచ్చు.

37 సంవత్సరములు రాజ్యముచేసి ఫిరోజ్‌షా 1388 లో మరణించెను. వెంటనే అతడు జాగ్రత్తగా చేర్చిపుంచిన ఢిల్లీ సామ్రాజ్యము ముక్కలై పోయింది. కేంద్రప్రభుత్వములేదు. చిల్లర రాజులు ప్రతిచోటా అధికారము చెలాయించుచుండిరి. ఈకాలములోనే, ఫిరోజు చనిపోయిన పది సంవత్సరములకు సరిగా, దుర్బలత్వము, అల్లరులు దేశమున చెలరేగుచున్నప్పుడు తైమూరు ఉత్తరముననుండి వచ్చిపడెను. ఢిల్లీ నాతడు సర్వవినాశము చేసెను. మెల్లగా ఆ నగరము మరల తేరుకొన్నది. 50 సంవత్సరములైన పిమ్మట మరల ఒక సుల్తాను అధికారముకింద కేంద్రప్రభుత్వ స్థానమైనది. అది చిన్న రాజ్యము మాత్రమే. దక్షిణమున, తూర్పున, పడమటవున్న గొప్ప రాజ్యములతో అది తులతూగకుండెను. సుల్తానులు ఆఫ్ఘనులు. వీరు సమర్థులుకారు. వీరినిచూస్తే ఆఫ్ఘను కులీనులకే మొహం మొత్తింది. వీరిని భరించలేక కులీనులు ఒక విదేశస్థుని రాజుగా ఆహ్వానించారు. ఈ విదేశస్థుడే బేబరు. ఇతడు మంగోలు జాతివాడు. ఇండియాలో స్థిరనివాస మేర్పరుచుకొన్న మంగోలులనే మొగలులు అంటారు. అతడు తైమూరు సంతతివాడు. అతని తల్లి చెంగిజ్‌ఖాన్ సంతతిలోనిది. ఆ కాలమున అతడు కాబూలును పరిపాలించుచుండెను. ఇండియాకు రమ్మన్న ఆహ్వానాన్ని అతడు అంగీకరించాడు. బహుశా పిలవక

పోయినా అతడు వచ్చేవాడేమో. 1526 లో ఢిల్లీ వద్దనున్న పాని పట్టువద్ద అతడు హిందూస్థాన సామ్రాజ్యమును గెలుచుకొన్నాడు. మళ్లీ ఇంకొక సామ్రాజ్యము తలయెత్తింది. దీనినే మొగలు సామ్రాజ్య మంటారు. ఢిల్లీ మళ్ళీ ప్రాముఖ్యానికి వచ్చింది. సామ్రాజ్య కేంద్ర మైనది. ఈ విషయమును గురించి ముచ్చటించుకొనుటకు ముందు ఇండియా ఇతర భాగములను చూతము. ఢిల్లీ పతోన్ముఖ మగుచున్న 150 సంవత్సరములలోనూ అచ్చట ఏమి జరుగుచున్నదో చూతము.

ఈకాలమున ఇండియాలో చిన్నవీ, పెద్దవీ రాజ్యములు అనేక ముండెను. నూతనముగా ప్రతిష్ఠింపబడిన జాన్‌పూర్‌లో చిన్న మస్లిము రాజ్యముండెను. దానిని షర్కీరాజులు పాలించుచుండిరి. అది పెద్దరాజ్యము కాదు. ప్రబలమైనదికాదు. రాజకీయముగా అంత ప్రముఖమైనదీకాదు. 15 వ శతాబ్దిలో సుమారు 100 సంవత్సరముల కాలము అది సంస్కృతికి నిలయమైయుండెను. మతసహనమున కాలవాలమై యుండెను. జాన్‌పూర్‌లోని మస్లిము కళాశాలలు మత సహనభావములను వ్యాపింపజేసినవి. ఒక పాలకుడు హిందువులకును మహమ్మదీయులకునుమధ్య సంయోగము కుదుర్చుటకు ప్రయత్నించెను కూడ. ఈ సంయోగమునుగూర్చి కిందటి జాబులో నేను వ్రాసి వుంటిని. కళలున్నూ, చక్కని సౌధనిర్మాణములున్నూ ప్రోత్సహింప బడ్డవి. వృద్ధినందుచున్న హిందీ, బెంగాలీ భాషలుకూడ ప్రోత్సహింప బడినవి. మతముపట్ల అసహనము ప్రబలియున్న రోజులలో జాన్ పూరు పాండిత్యమునకూ, సంస్కృతికీ, సహనమునకూ ఆశ్రయమై వుండెను.

తూర్పున, అలహాబాదు సమీపమున గౌరు రాజ్యముండెను. ఇది గొప్పది. బీహారు, బెంగాలులు ఇందు చేరియుండెను. గౌరు నగరము సముద్రరేవు పట్టణము. ఇండియాలోని తీరస్థపట్టణములతో సముద్రమార్గమున రాకపోకలు జరుగుచుండెను. మధ్య ఇండియాలో

అలహాబాదుకు పడమర, సుమారు గుజరాతువరకూ మాలవ రాజ్యముండెను. దాని రాజధాని "మండు". అది నగరమున్నూ, దుర్గమున్నూకూడా. మండులో అందమయిన దివ్య భవనములు లేచినవి. వాటి శిథిలములు నేడు దర్శకుల నాకర్షించుచుండును.

మాల్వాకు వాయువ్యమున రాజపుత్ర స్థానముండెను. అందు రాజపుత్ర రాజ్యము లనేకముండెను. అందు చిత్తూరు ప్రసిద్ధమయినది. చిత్తూరు, మాల్వా, గుజరాతులు తరుచు తమలోతాము పోరాడుకొనుచుండెను. మిగత రెండు ప్రబలరాజ్యములకన్నను చిత్తూరుచిన్నది. కాని రాజపుత్రులు శౌర్యోపేతులు. సంఖ్యలో తక్కువగా వున్నప్పటికీ ఒక్కొక్కప్పుడు వారు గెలుచుచుండిరి. మాల్వాపై చిత్తూరు రాణా సాధించిన అట్టి విజయమును సూచించుటకే అతడు చిత్తూరులో చక్కని జయస్తంభమును కట్టించెను. మండు సుల్తాను, తాను తక్కువ అనిపించుకో ఇష్టములేక మండులో ఒక స్తంభమును కట్టించెను. చిత్తూరు స్తంభము నిలిచివున్నది. మండు స్తంభము అంతరించినది.

మాల్వాకు పడమర గుజరాతు ఉండెను. ఇక్కడ ప్రబల రాజ్యమొకటి స్థాపించబడెను. సుల్తాను అహమ్మదుచే ప్రతిష్ఠింపబడిన దాని రాజధాని గొప్ప నగరమయ్యెను. దాని జనసంఖ్య సుమారు పదిలక్షలు. ఈ నగరమున చక్కని భవనములు లేచెను. 300 సంవత్సరముల కాలము—15 వ శతాబ్దినుండి 18 వ శతాబ్దివరకూ—అహమ్మదాబాదు ప్రపంచమందలి మిక్కిలి చక్కని నగరములలో ఒక్కటిగా వుండెను. ఆ నగరమునందు కట్టిన గొప్ప జమీ మసీదు, ఆకాలమునందే చిత్తూరు రాణాచే రణపురములో కట్టిన జైనాలయమును పోలివుండెను. ఇది వింత విషయమే. దీనినిబట్టి ప్రాచీన హైందవ వాస్తునిర్మాతలు ఏవిధముగా నూతన భావములను గ్రహించుచున్నారో, కొత్త వాస్తుపద్ధతిని అమలులోకి తెస్తున్నారో స్పష్టమౌతుంది. ఇక్కడ మళ్ళీ కళావిషయమున నేను చెప్పిన సంయోగము మనము చూడ

వచ్చును. నేటికికూడా ఈ చక్కని ప్రాచీన భవనము లనేకము చక్కని చెక్కడములతో అహమ్మదాబాదులో నిలిచి వున్నవి. వాటి చుట్టూ పెరిగిన నేటి పారిశ్రామిక నగరము అందముగా లేదు.

సుమారు ఈ కాలమునందే పోర్చుగీసులు ఇండియాకు వచ్చిరి. గుడ్‌హోపు అగ్రమునుచుట్టి వచ్చిన ప్రథముడు వాస్కోడాగామా అని జ్ఞాపకమున్నదా? 1498 లో అతడు దక్షిణముననున్న కళ్ళికోట చేరెను. యూరోపియనులు పెక్కుడు అంతకుముందు ఇండియాకు వచ్చినమాట నిజమే. కాని వారు వర్తకులుగానో, ధర్మికులుగానో వచ్చిరి. ఇప్పుడు పోర్చుగీసులు వేరు అభిప్రాయములతో వచ్చిరి. గర్వమూ, ఆత్మవిశ్వాసమూ వారి కమితముగా వుండెను. పోపు వారికి తూర్పు ప్రపంచము ధారాదత్తము చేసెను. వారు దేశమును జయించవలెననే ఉద్దేశముతో వచ్చిరి. మొట్టమొదట వారి సంఖ్య తక్కువగానే వుండెను. కాని వారి ఓడలు ఒకదానివెనుక ఒకటి వచ్చినవి. వారు కొన్ని తీరస్థ పట్టణముల వశము చేసికొనిరి. అందు ప్రధానమైనది గోవా. పోర్చుగీసువారు ఇండియాలో చేసినదేమిలేదు. వారు దేశము లోపలికి పోనేలేదు. కాని ఇండియామీద పడుటకు సముద్రమార్గమున వచ్చిన యూరోపియనులలో వారు ప్రథములు. చాలాకాలమైన పిమ్మట ఫ్రెంచివారును, ఇంగ్లీషువారును వారి వెనుక వచ్చిరి. సముద్రమార్గములు తెరువబడ్డ తరువాత సముద్రముమీద ఇండియా దుర్బలత్వము బయటపడినది. దక్షిణ ఇండియాలోని ప్రాచీన రాజ్యములు క్షీణించినవి. వారి దృష్టి అంతయు నాటు ప్రాంతముల నుండి వచ్చు ప్రమాదములమీదనే వుండెను.

గుజరాతు సుల్తానులు సముద్రముమీద సైతము పోర్చుగీసుల నెదిరించిరి. ఆటోమన్ తురుష్కులతో వారు స్నేహము చేసికొని పోర్చుగీసు నౌకాదళము నొకటి ఓడించిరి. కాని తరువాత కొన్నాళ్లకు పోర్చుగీసులు విజయము సాధించిరి. సముద్రము వారి స్వాధీన

మయ్యెను. ఢిల్లీలోని మొగలులకు భయపడి గుజరాతు సుల్తానులు పోర్చుగీసులతో సంధి చేసుకొనిరి. కాని పోర్చుగీసులు వారిని మోసగించిరి.

14 వ శతాబ్ది మొదటి రోజులలో దక్షిణ హిందూస్థానమున రెండు గొప్పరాజ్యములు తలయెత్తినవి. ఒకటి గుల్బర్గా. దీనినే భామినీ రాజ్యమంటారు. రెండవది దీనికి దక్షిణముగావున్న విజయ నగరము. మహారాష్ట్ర దేశమందంతటా, కర్ణాటమున కొంతభాగమున, భామినీ రాజ్యము విస్తరించినది. అది 150 సంవత్సరములుపైగా నిలిచినది. దాని పరిపాలన అంతా తుచ్ఛముగా వుండెను. అసహనము, హింసలు, హత్యలు చెలరేగుచుండెను. సుల్తానుయొక్కయు, కులీనుల యొక్కయు భోగము లొకవంక, ప్రజల కటిక దరిద్రమొకవంక. శుద్ధ అప్రయోజకత్వమువల్ల భామినీరాజ్యము, 16 వ శతాబ్ది తొలిరోజులలో పతనమైనది. అది అయిదు చిన్నరాజ్యములుగా చీలిపోయి ఒక్కొక్క రాజ్యమునకు ఒక సుల్తాను పాలకుడుగా నుండెను. అవి బీజపూరు, అహమదు నగరము, గోల్కొండ, బీదరు, బేరారు. విజయనగర రాజ్యము 200 సంవత్సరములనుండి జరుగుచు ఇంకను ఈ కాలము నాటికి వృద్ధిలోనే వుండెను. ఈ ఆరు రాజ్యములును ఒకదానితో ఒకటి తరుచు పోరాడుకొనుచుండెను. ప్రతియొక రాజ్యమును దక్షిణ దేశమునంతను స్వాధీనము చేసుకొనవలెనని ప్రయత్నించుచుండెను. ఇందుకొరకై ఒకరాజ్యము ఇంకో రాజ్యముతో కలియుచుండెను. ఈ కలియుటలు వుండుండియు మారుచుండెను. ఒక్కొక్కమారు ఒక హిందూరాజ్యము, మస్లిము రాజ్యముతో పోరాడుచుండెను. ఒక్కొక్క మారు ఒక హిందూరాజ్యము ఒక మస్లిము రాజ్యముతోచేరి వేరొక మస్లిము రాజ్యముతో పోరాడుచుండెను. ఈ పోరాటములు పూర్తిగా రాజకీయ సంబంధమైనవి. ఏ ఒక్క రాజ్యమైనను మిక్కిలి ప్రబల మైనట్లయితే మిగిలిన రాజ్యములుచేరి దానిని ప్రతిఘటించేవి. విజయ

నగర రాజ్య ప్రాబల్యమూ, దాని భాగ్యమూచూచి మస్లిము రాజ్యము లన్నీ యేకమై 1565 లో తల్లికోటవద్ద దానిని పూర్తిగా ఓడించినవి. 250 సంవత్సరములేలిన పిమ్మట విజయనగర సామ్రాజ్య మస్తమించి నది. వైభవోపేతమైన మహానగరము పూర్తిగా ధ్వంసము చేయ బడినది.

విజయము సాధించిన మిత్రరాజ్యములు వెంటనే కలహించి తమలో తాము పోరాడుకొనిరి. అచిరకాలముననే ఢిల్లీలోని మొగలు సామ్రాజ్యచ్ఛాయ ఈరాజ్యములపైపడెను. వారి కష్టములలో వేరొకటి పోర్చుగీసుల ప్రవేశము. 1510 లో వారు గోవాను స్వాధీనము చేసి కొనిరి. ఇది బీజపూరు రాజ్యములోనున్నది. వారి నచ్చటినుండి తరిమి వేయుటకు ఎన్ని ప్రయత్నములు చేసిననూ పోర్చుగీసులు గోవాను వదలిపెట్టలేదు. వారి నాయకుడు అల్బూకర్క్, "ప్రాచ్యరాజప్రతినిధి'' అనే చక్కని బిరుదు ధరించాడు. అతడు అసహ్యకరమగు క్రూర కృత్యము లనేకము చేసెను. పోర్చుగీసులు ఒకమారు ప్రజలను, స్త్రీ బాలాదిగా హత్యచేసిరి. నాటినుండి నేటివరకూ పోర్చుగీసులు గోవా లోనే వుండిరి.

దక్షిణరాజ్యములలో, ముఖ్యముగా విజయనగరము, గోల్కొండ, బీజపూరులలో చక్కని భవనములు కట్టబడినవి. గోల్కొండ నేడు శిథిలావస్థలో వున్నది. బీజపూరులో చక్కని భవనములింకను నిలిచి ఉన్నవి. విజయనగరము నేల పాలాయెను. ఇప్పుడదిలేదు. ఈ కాలముసందే గోల్కొండ సమీపమున హైదరాబాదు నగరము స్థాపింప బడెను. తరువాత కొంతకాలమునకు దక్షిణాది భవననిర్మాణ ప్రవీణు లున్నూ, శిల్పులున్నూ ఉత్తరాదికి వెళ్ళినట్లున్నూ, ఆగ్రాలో తాజ్ మహాల్ నిర్మాణమునకు సహాయము చేసినట్లున్నూ చెప్పుదురు.

సాధారణముగా మతవిషయమున సహనమున్నప్పటికినీ అప్పు డప్పుడు మతమౌఢ్యము, అసహనము తలయెత్తుచుండెను. వీటికి

ఫలముగా భయంకరమగు హత్యలు వినాశము జరుగుచుండెను. కాని గమనించవలసిన విషయమేమనగా బీజపూరు మస్లిం రాజ్యముక్రింద హిందువుల రౌతుదళము పనిచేయుచుండెను. విజయనగర హిందూ రాజ్యముక్రింద మస్లిము పటాలములు పనిచేయుచుండెను. ఆకాలమున నాగరికత ఉన్నతస్థాయిలో వున్నట్లే చెప్పవచ్చును. కాని అది అంతయు భాగ్యవంతుల ముచ్చట. రైతుకందు ప్రసక్తిలేదు. అతడు దరిద్రుడే. అయినా అతడే భాగ్యవంతుల భోగభారమును వహించు చుండెను. ఇట్లే గదా ఎప్పుడూ జరిగేది!

# 77

# విజయనగరము

జూలై 15, 1932

వెనుకటి జాబులో మనము చర్చించిన రాజ్యము లన్నటిలోను చిరకాలము నిలిచినది విజయనగర రాజ్యము. విదేశీయు లనేకులు దానిని దర్శించుట తటస్థించినది. వారా రాజ్యమును గురించీ, నగరమును గురించీ వృత్తాంతములు వ్రాసివుంచిరి. 1420 లో ఇటలీ దేశస్థుడు నికొలొ కాంటే అనువాడు వచ్చెను. 1443 లో మధ్యఆసియా లోని గొప్ప ఖాను కొలువునుండి హీరట్ పట్టణవాసి అబ్దుల్ రజాక్ వచ్చెను. 1522 లో పాస్ అను పోర్చుగీసువాడు విజయనగరమును దర్శించెను. ఇంకా ఇతరులు అనేకులు వచ్చిరి. దక్షిణ ఇండియన్ రాజ్యములను—అందు ముఖ్యముగా బీజపూరును గురించి వ్రాసిన హిందూదేశ చరిత్రకూడ ఒకటున్నది. ఇది అక్బరుకాలమున పర్షియన్ భాషలో ఫరిస్టాచే వ్రాయబడినది. మనము ప్రసంగించుకొను కాలమునకు కొంచెము తరువాత అది వ్రాయబడినది. సమకాలమున వ్రాయబడిన చరిత్రలు తరుచుగా అతిశయోక్తులతో నిండి పక్షపాత సహితముగా వుంటవి. కాని అవి చాలా ప్రయోజనకరములు. మస్లిముల

కాలమునకు ముందు ఇట్టిగ్రంధములేవీ వున్నట్లు మనకు . తెలియదు. కాశ్మీరమును గురించివ్రాసిన ఒక్క రాజతరంగిణి అను గ్రంధముతప్ప. అందుచే ఫరిస్టా చరిత్ర విశిష్టమైనది. అతని తరువాత అట్టి చరిత్రలు పలువురు వ్రాశారు.

విజయనగరమును దర్శించిన విదేశీయులు చేసినవర్ణనములు సరిగా నిష్పక్షపాతముగా వున్నవి. వీటినిబట్టి విజయనగరముయొక్క స్వస్వరూపము మనము తెలుసుకోవచ్చును. తరుచు జరుగుచున్న పాడుయుద్ధములను గురించిగాక అంతకన్న అతిశయముగా వారు చెప్పిరి. కాబట్టి వీరు చెప్పిన విషయములను గురించి నీకు కొంత వ్రాస్తాను.

విజయనగరము 1336 ప్రాంతమున స్థాపించబడినది. దక్షిణ ఇండియాలో కర్ణాటక దేశమున అదివున్నది. హిందూ రాజ్యముగాన చుట్టుపట్టులనున్న మస్లిము రాజ్యములనుండి హిందూ ప్రజలు వచ్చుట సహజమే. అది త్వరత్వరగా వృద్ధినందినది. కొద్ది సంవత్సరములలో అది దక్షిణమున ప్రబలమయ్యెను. రాజధానీ నగరము భాగ్యముతో తులతూగుచుండెను. అందముగా వుండెను. దక్కనులో విజయనగరము ప్రబల రాజ్యమయ్యెను.

ఫెరిస్టా విజయనగరముయొక్క భాగ్యాతిశయమును వర్ణించెను. గుల్బర్గానుండి ఒక మస్లిం భామినీరాజు విజయనగర రాచపుత్రికను వివాహమాడ 1406 లో విజయనగరము వెళ్ళెను. ఆనాటి నగర వైభవను నాతడు వర్ణించెను. ఆరుమైళ్ళదూరము రాచబాట పొడుగునా బంగారు జలతారుగల మొహమల్ మొదలగు వస్త్రములు పరపబడిన వట. ఎంతటి దారుణమైన, అకీర్తికరమయిన దుర్వ్యయమో!

1420 లో ఇటలీ దేశస్థుడు నికొలొకాంటి వచ్చెను. ఆనగరము చుట్టుకొలత 60 మైళ్ళని అతడు చెప్పెను. ఈ విస్తీర్ణము చాలాపెద్దది. అనేకమగు తోటలు అందుండుట కారణము. విజయనగర భూపాలుడు,

రాయలనువాడు, ఆకాలమున ఇండియాలో మిక్కిలి ప్రబలుడగు రాజని కొంటీ అభిప్రాయపడెను.

మధ్య ఆసియానుండి తరువాత అబ్దుల్ రజాకు వచ్చెను. విజయనగరమునకు పోవుదారిలో, మంగళూరువద్ద అతడొక అద్భుతమగు దేవళమును చూచెను. మంచి ఇత్తడి కరిగించి దేవళమును నిర్మించిరట. అది 15 అడుగుల యెత్తు, నేల మట్టమువద్ద 30 అడుగులు పొడుగు 30 అడుగులు వెడల్పు వుండెను. ముందుకు పోగా బేలూరువద్ద వేరొక దేవళము అతనిని ఆశ్చర్యమున ముంచినది. అతడు దానిని వర్ణించుటకు ప్రయత్నించలేదు. వర్ణించి వున్నట్లయితే "అతిశయోక్తి చెప్పావని" అంటారని అతడు భయపడెనట. తరువాత అతడు విజయనగరమును చేరెను. దానినిచూచి అతడు ఆనందముతో పారవశ్యము నందెను. అతడు చెప్పినమాట లేమనగా: "భూలోకమున దానికి సాటివచ్చునగరము కన్ను చూడలేదు, చెవి వినలేదు. అట్టిదా నగరము!" అచ్చటనున్న బజారులనేకము. వాటినతడు వర్ణించెను: "ప్రతిబజారు మొగను అత్యున్నతమయిన ముఖద్వారము లుండెను. పైకప్పుగల మార్గములుండెను. కాని రాజుగారి నగరు వీటి అన్నిటికన్న యెత్తుగా వుండెను. బజారులు మిక్కిలి పొడుగుగాను, విశాలముగాను వుండెను. సౌరభముతో కూడుకొన్న పుష్పము లన్నివేళలయందు ఆనగరమున లభ్యమగుచుండెను. ప్రాణాధారములుగా వాటిని గణించెడువారు. పువ్వులు లేనిదే వారు బ్రదుకలేరు. ప్రతి సంఘమునకు, వృత్తికిని సంబంధించిన వ్యాపారస్థులు తమ అంగళ్ళను ఒకదానికొకటి సమీపముగా పెట్టుకొనుచుండిరి. నగల నమ్ము షరాబులు బజారులో బహిరంగముగా మాణిక్యములు, ముత్యములు, వజ్రములు, పచ్చలు అమ్ముచుండిరి." అబ్దుల్ రజాక్ ఇంకను వర్ణిస్తున్నాడు: "రాజుగారి ప్రాసాదమున్న ఈమనోహర ప్రదేశమున యెన్నో పిల్లనదులు, ప్రవాహములు మలచిన నున్నని రాతి

కాలువలగుండా ప్రవహించుచుండెను.................దేశము జనసంకీర్ణమై వుండెను. జనసంఖ్య ఇంత అని నిర్ణయించుట కష్టము.'' ఈ విధముగా అతడు వర్ణించుకొంటూ పోయెను—15 వ శతాబ్ది మధ్యలో మధ్య ఆసియానుండి వచ్చిన ఈ పరదేశి విజయనగర వైభవములను చూచి పరవశుడై వర్ణించుకొంటూ పోయెను.

అబ్దుల్ రజాక్ పెద్దనగరము లనేకము చూడనికారణముచేత విజయనగరమునుచూచి పరవశుడయ్యెనని తలంచవచ్చును. తరువాత దర్శించినవాడు బహుదేశములు చూచినవాడే. అతడు పాస్ అను పేరుగల పోర్చుగీసువాడు. అతడు 1522 లో వచ్చెను. సరిగా ఈ సమయమునందే ఇటలీలో పునరుజ్జీవనము తలయెత్తినది. ఇటలీ నగరములలో చక్కని భవనములు లేచుచుండెను. పాస్ ఆనగరములను చూచియుండును. కాబట్టి అతని సాక్ష్యము నమ్మదగినది. అతడు చెప్పినమాటలు: "విజయనగరము రోము నగరమంత పెద్దది. చూచుట కెంతో చక్కగా వుండెను.'' అతడు నగరమునందలి అద్భుతములనూ, లెక్కపెట్టలేనన్ని చెరువులు, కాలువలు ఫలారామములవల్ల కలుగు అందములనూ విపులముగా వర్ణించాడు. "విజయనగరము ప్రపంచమందెల్ల సుభిక్షమగు నగరముగా వుండెను. అది యితర నగరములవలె లేదు. ఇతర నగరములలో సరకులు, ఆహారపదార్థములు తరుచు తక్కువ పడవచ్చును. కాని ఈనగరమున సర్వపదార్థములను పుష్కలముగా వుండెను." రాజుగారి ప్రాసాదములో అతడొక గదిని చూచెను. "అది అంతా దంతముతో నిర్మింపబడినది. పైనుండి క్రిందివరకూ గోడలు దంతముతో నైనవే. దూలములక్రిందనున్న స్తంభములపై గులాబీపువ్వులు, పద్మములు రమణీయముగా చెక్కబడి వున్నవి. అంతా దంతముతోనైనవే. అందు లోపము లేమియులేవు. ఇంతకన్న చక్కగా తయారుచేయుట యెవరికీ సాధ్యముకాదు. విలువయందుకాని, అందము విషయమునగాని దానికి సాటి వచ్చునది మరి

యొకటి యెచ్చటా లేదు.

తాను దర్శించినప్పుడు విజయనగర భూపాలు డెట్లుండెనో పాస్ వర్ణించెను. దక్షిణ హిందూదేశ చరిత్రలో పేరొ్కన్న మహారాజులలో ఇతడొక్కడు. మహావీరుడనిన్నీ, శత్రువులపట్ల ఔదార్యబుద్ధి కలవాడనిన్నీ, విద్యాపోషకుడనిన్నీ, ప్రజారంజకుడనిన్నీ, దయాశీలుడనిన్నీ నేటివరకు అతనిపేరు దక్షిణమున ప్రసిద్ధముగా వున్నది. అతనిపేరు కృష్ణదేవరాయలు. 1509 మొదలు 1529 వరకూ అతడు ఇరువై సంవత్సరములు రాజ్యమేలెను. అతడు ఎంత ఎత్తో, అతని విగ్రహ మెట్టిదో, అతని దేహచ్ఛాయ ఎట్టిదోకూడా పాస్ చెప్పెను. కృష్ణదేవ రాయలు పచ్చగా ఉండేవాడట. "శత్రువులకతని పేరు సింహ స్వప్నము. అతడు ఆదర్శప్రాయుడగు రాజు. మందహాసము అతని ముఖమున తాండవమాడు చుండును. ఎప్పుడును ఉల్లాసముగా వుండే వాడు. పరదేశుల నతడు దయతో ఆహ్వానించి, గౌరవించేవాడు. వారెట్టి స్థితిలోనున్నా వారిని పలుకరించి వారి వ్యవహారములన్నీ కనుక్కొనేవాడు. రాజుకున్న బిరుదము లన్నిటినీ చెప్పిన తరువాత పాస్ ఇట్లంటున్నాడు: "అతని హోదాలు నున్నవాని కుండవలసినవేమీ అతనికున్నట్లు తోచదు. అన్ని విషయములలోనూ అతడంతటి ఉదారుడు, ఆదర్శప్రాయుడు."

ఇది గొప్పస్తుతియే! ఈకాలమున విజయనగర సామ్రాజ్యము దక్షిణమునంతనూ, తూర్పు తీరమునూ వ్యాపించెను. మైసూరు, తిరువాంకూరు, నేటి మద్రాసు రాజధాని అంతయూ అందు చేరివుండెను.

ఇంకో విషయము నేను చెప్పవలసియున్నది. నగరమునకు మంచినీటివసతి వుండుటకై క్రీ. వె. 1400 లో గొప్ప పారుదల కట్టడములు నిర్మింపబడ్డవి. నదికి అడ్డముగా పెద్ద కట్టకట్టి ఆనీటిని నిలువ వుంచుటకు ఒక జలాశయము కట్టబడ్డది. దీనినుండి 15 మైళ్ళ పొడుగు గల రాయిమలచిన గొట్టముగుండా నీరు నగరమునకు పోవుచుండెను.

విజయనగర మట్లుండెను. తన భాగ్యమును చూచుకొని, అందమును చూచుకొని గర్వముతో వుండెను. తన బలమును చూచుకొని అతిధైర్యముతో వుండెను. నగరముయొక్కయు, సామ్రాజ్యముయొక్కయు అవసానకాలము సమీపిస్తున్నదని ఎవ్వరూ అనుకొనలేదు. పాస్ దర్శించివెళ్ళిన 43 సంవత్సరముల తరువాత హఠాత్తుగా ప్రమాదము పొడచూపింది. దక్కనులోని యితర రాజ్యములకు విజయనగరమును చూచ కన్నుకుట్టినది. వారందరునుచేరి విజయగరమును తుదముట్టించ తీర్మానించుకొనిరి. అప్పుడుకూడా విజయనగరము తెలివి తక్కువవల్ల ఆత్మవిశ్వాసముతో వుండెను. అవసానకాలము త్వరలోనే వచ్చినది. అది దారుణమైన పతనము.

1565 లో దక్కను రాజ్యములుచేరి విజయనగరమును ఓడించెనని చెప్పియుంటిని. హత్య లమితముగా జరిగెను. తరువాత నగరము కొల్లగొట్టబడ్డది. అందమగు భవనములన్నియు, దేవాలయములు, ప్రాసాదములు నాశనము చేయబడ్డవి. నిరుపమానమగు చెక్కడపు పనులు, శిల్పములు ధ్వంసము చేయబడ్డవి. సమస్తమును పెద్దమంటలు వెలిగించి తగులబెట్టబడెను. పట్టెడు శిథిలములు మిగులువరకు వినాశనము జరుగుచునే వుండెను. ఒక ఇంగ్లీషు చరిత్రకారుడిట్లు చెప్పెను: "ప్రపంచ చరిత్రలో ఎన్నడును ఇంతహఠాత్తుగా ఇట్టి వైభవోపేతమైన నగరము, ఇట్టి వినాశనమునకు గురికాలేదు. ఆ నగరము ఒక దినమున ఐశ్వర్య సమృద్ధితో తులతూగుచు కష్టపడి పనిచేయు ప్రజలచే కిటకిటలాడుచుండెను. మరుసటి దినమున అది శత్రువశమయ్యెను. కొల్లగొట్టబడెను. క్రూరహత్యలు జరిగెను. వర్ణించ నలవికాని దారుణములు జరిగెను. చివరకది వినాశనము చేయబడెను."

# 78

# మలేసియా సామ్రాజ్యములు : మజపహిత్ ; మలాకా

జూలై 17, 1932

మలేసియాను గురించియు, తూర్పు ద్వీపములను గురించియు నీకు వ్రాసి చాలాకాలమైనది. ఈమధ్య వాటిని ఉపేక్షించితిని. 46 వ జాబులో వాటిని గురించి వ్రాసితిని. నాటినుండి 31 జాబులు వ్రాసితిని. 78 వ జాబు వ్రాయుచుంటిని. అన్నిదేశములను గురించియు వరుస తప్పకుండ చెప్పడము కష్టము.

నేటికి రెండునెలలై నీకు వ్రాసిన అంశము లేమయినా జ్ఞాపక మున్నవా ? కాంబోడియా, అంగ్‌కోరు, సుమిత్రా, శ్రీవిజయలను గురించి జ్ఞాపకమున్నదా ? ప్రాచీన హైందవ అధినివేశములు ఇండో-చీనాలో అనేకవందల సంవత్సరములలో ఒక పెద్ద రాజ్యమయ్యెననీ అది కంబోడియా సామ్రాజ్యమనీ జ్ఞాపకమున్నదా ? అప్పుడు ప్రకృతి ఆగ్రహించి నగరమును సామ్రాజ్యమునుకూడ తుడిచివేసెను. ఇది జరిగినది క్రీ. వె. 1300 లో.

కంబోడియా రాజ్యమున్న కాలమునందే వేరొక గొప్ప రాజ్యము సుమిత్రాద్వీపమున నుండెను. కాని శ్రీవిజయ సామ్రాజ్యస్థాపనకు కొంతవెనుక ప్రారంభమైనప్పటికీ కంబోడియాకన్న చిరకాలము నిలిచి యుండెను. దాని అవసానముకూడ హఠాత్తుగానే వచ్చెను. దీనికి కారణము ప్రకృతికాదు, మానవుడే. 300 సంవత్సరములపాటు బౌద్ధ సామ్రాజ్యమయిన శ్రీవిజయ వర్ధిల్లెను. తూర్పు ద్వీపముల నన్నింటి పైని తన ఆధిపత్యము నెరపుచుండెను. కొంతకాలముపాటు ఇండియాలోను, సింహళములోను, చీనాలోను కాలూనెను. అది వర్తకసామ్రాజ్యము. దాని ప్రధానవ్యాపారము వర్తకము. కాని వేరొక వర్తక

రాజ్యము జావాద్వీపమునకు తూర్పు భాగమున తలయెత్తెను. అది హిందూరాజ్యము. శ్రీవిజయ కది లొంగలేదు.

9 వ శతాబ్ది ప్రారంభమునుండి 400 సంవత్సరములవరకు వృద్ధి నందుచున్న శ్రీవిజయచే ఈ జావారాజ్యము బెదరింపబడుచుండెను. అయినను అది తన స్వాతంత్ర్యమును నిలువపెట్టుకో గలిగెను. అంతే కాకుండా అది అసంఖ్యాకములగు రాతిదేవాలయములనుకూడ నిర్మించెను. ఇందు మరీ గొప్పవి బొరోబోదూరు ఆలయములు. నేటికిని వాటిని మనము చూడవచ్చును. వానిని చూచుటకెందరో పరదేశముల నుండి వస్తూవుంటారు. శ్రీవిజయ చేతులలో పడకుండ తప్పించు కొన్న తూర్పుజావా ప్రబలమై శ్రీవిజయపై కాలుదువ్వుచూ, బెదరించు చుండెను. రెండును వర్తకరాజ్యములే. రెండును వర్తకమునకై సముద్రములు దాటవలసి వచ్చుచుండెను. ఆకారణమున రెంటికిని వివాదములు సంభవించుచుండెను.

జావా సుమిత్రాలకుండే స్పర్ధను నేటి జాతులస్పర్ధతో పోల్చ బుద్ధి పుట్టుతున్నది. అది జర్మనీ, ఇంగ్లాండులకున్న స్పర్ధవంటిది. శ్రీవిజయను ప్రతిఘటించుటకును, తన వర్తకమును వృద్ధిచేసి కొనుట కును ఒక్కటే మార్గమున్నదని జావా తలచి తన నౌకాబలమును వృద్ధి చేయ మొదలుపెట్టెను. తన సముద్రాధికారమును అమితముగా వృద్ధి చేసికొనెను. పెద్ద నౌకాదండయాత్రలు పంపబడ్డవి. కాని కొన్ని సంవత్సరములపాటు అవి శత్రువులతో చేతులు కలపలేదు. జావా నానాటికి శ్రీవిజయాపై కాలుదువ్వుతూ వుండెను. పదమూడవ శతాబ్దాంతమున ఒక నగరము వారిచే స్థాపించబడెను. దానిపేరు మజ పహిత్. వృద్ధినందుచున్న జావా రాజ్యమున కది రాజధాని అయ్యెను.

ఈ జావారాజ్యము మిక్కిలి గర్వించుచుండెను. ఒకమారు కుబ్లైయ్‌ఖాను తన రాయబారులను కప్పము వసూలుచేయుటకు జావాకు పంపెను. గొప్పఖాను రాయబారులనది అవమానించెను. కప్పము

చెల్లించలేదు సరిగదా ఒకరాయబారి నుదుటిమీద అవమానకరమగు సందేశము పచ్చబొట్టుగా పొడిపించబడెను. మంగోలు ఖాను విషయమున ఇట్లు ప్రవర్తించుట తెలివితక్కువ. ప్రమాదకరమగు విషయము కూడా. ఇటువంటి అవమానమునకే ఫలితముగా చెంగిజ్ మధ్య ఆసియాను నాశనము చేసెను. హులగూ, బాగ్గాదును నాశనముచేసెను. అయినప్పటికీ చిన్నద్వీపము యిన జావా ఇట్టి అవమానము చేయుటకు సాహసించెను. అదృష్టవశాత్తు చాలావరకు మంగోలులు తగ్గివుండిరి. దేశములను జయించవలెననే కోరిక వారికిలేదు. మరిన్ని సముద్రము మీద యుద్ధముచేయుట వారికిష్టము లేనిపని. భూమిమీద యుద్ధమంటే వారికెంతో ధైర్యము. అయినా నేరస్థుడగు రాజును శిక్షించుటకు కుబ్లె ఖాను ఒక దండయాత్రను జావాపైకి పంపించెను. చీనా సైనికులు జావావారిని ఓడించి రాజును చంపిరి. కాని వారు యెక్కువ నష్టము కలిగించినట్లు తోచదు. చీనావారితో సహవాసము చేయుటవల్ల మంగోలులు ఎంతగా మారిరో!

చైనా దండయాత్రవలన జావా, అనగా మజపహిత్ సామ్రాజ్యము చివరకు ప్రబలమైనట్లు తోచును. దీనికి కారణము చీనావారు తుపాకులను జావాలో ప్రవేశపెట్టుట. తరువాతి యుద్ధములలో మజపహిత్ విజయములు సాధించుటకు ఈ తుపాకులే కారణమై వుండవచ్చు.

మజపహిత్ సామ్రాజ్యము విస్తరించుచు పోయెను. ఇది యాదృచ్ఛికముగా జరుగలేదు. అకస్మాత్తుగానూ జరుగలేదు. ఆ సామ్రాజ్యము, సమర్థమగు సైన్యము సహాయముతోనూ, నౌకాబలము సహాయముతోనూ కావలెనని పన్ని సాధించిన సామ్రాజ్య విస్తరణము. అది విస్తరించుచున్న కాలములో ఒకస్త్రీ, సుహితరాణి అను పేరుగలది రాజ్యమును ఏలుచుండెను. ప్రభుత్వము చక్కగా కేంద్రీకృతమై, సమర్థమయి వుండెను. పన్నులు వేయుపద్ధతి, ఎగుమతి సరకులపై సుంకమువేయు పద్ధతి, ఆసీళ్లు వసూలుచేయు పద్ధతి, రాజ్యములో

ప్రభుత్వపు రాబడి వసూలు చేయుపద్ధతి సర్వోత్తమముగా వుండెనని పాశ్చాత్య చరిత్రకారులు వ్రాసియుండిరి. ప్రభుత్వ ప్రత్యేక శాఖలలో ఈ క్రిందివి కలవు—అధినివేశశాఖ, వర్తకశాఖ, ప్రజల ఆరోగ్యమునకు సౌఖ్యమునకు సంబంధించినశాఖ, రాజ్యాంగశాఖ, పరన్యాయస్థానము (Supreme Court) కూడ ఒకటి వుండెను. అందు ఏడ్గురు న్యాయమూర్తులును, ఇద్దరు ప్రధాన న్యాయమూర్తులును వుండిరి. బ్రాహ్మణ పురోహితులకు పలుకుబడి యెక్కువగా వున్నట్లు తోచును. కాని వారు రాజుగారి అదుపాజ్ఞలలో వుండిరి.

ఈశాఖలును, వాటిపేళ్లు కొన్నియు అర్థశాస్త్రము (కౌటిల్యుని)ను తలపునకు తెచ్చుచున్నవి. అధినివేశ శాఖమాత్రము కొత్తది. రాజ్యాంగ శాఖను నడిపించు మంత్రిని "మంత్రి" అనెడివారు. అతడు స్వస్థానముకు సంబంధించిన వ్యవహారములను చూచుచుండెను, దక్షిణ ఇండియానుండివెళ్ళి పల్లవులు మొదటిసారి అధినివేశము లేర్పరచుకొన్నది మొదలు 1200 సంవత్సరములవరకూ హైందవ సంప్రదాయములూ, సంస్కృతీ ఈ ద్వీపములలో అవిచ్ఛిన్నముగా సాగుచున్నట్లు దీనినిబట్టి తెలిసికోవచ్చును. సంబంధ బాంధవ్యములు తెగిపోకుండడమువల్లనే ఇది సాధ్యమయినది. ఇట్టి సంబంధములు వర్తకము కారణముగా నిలిచినవనుటకు సందేహములేదు.

మజపహిత్ సామ్రాజ్యము వర్తక సామ్రాజ్యము కాబట్టి దిగుమతి వర్తకమూ, ఎగుమతి వర్తకమూ—అనగా ఇతర దేశములకు పంపు సరకుకూ,ఇతర దేశములనుండిదిగిన సరకుకూ సంబంధించిన వర్తకము, కట్టు దిట్టముగా వుండవలెగదా! ఈ వర్తకములు సామాన్యముగా ఇండియా, చీనాలతోనూ, దాని సొంత అధినివేశములతోనూ జరుగుచుండెను. శ్రీవిజయతో పోరాటము చేయుచున్నంతకాలమూ దానితో గాని, దాని అధినివేశములతోగాని శాంతముగా వర్తకము చేసికొనుటకు సాధ్యము కాకుండెను.

జావారాజ్యము అనేకవందల సంవత్సరములు సాగినది. సామ్రాజ్యము ఉచ్ఛస్థితిలో నున్నది 1355 మొదలు 1380 వరకూ, అనగా సరిగా 45 సంవత్సరములు. ఈ కాలములోనే, 1377 లో, శ్రీవిజయ జయింపబడి నాశనము చేయబడినది. దీనికి అన్నాం, సయాం, కంబోడియా దేశములతో మైత్రి వుండెను.

రాజధానీ నగరమయిన మజపహిత్ చక్కని ఐశ్వర్యవంతమైన నగరము. దానికి మధ్య బ్రహ్మాండమయిన శివాలయముండెను. అనేక దివ్యభవనములుం దుండెను. మలేసియాలోని హైందవ అధినివేశ రాజ్యములన్నీ చక్కని భవనములు నిర్మించుటలో ఆరితేరినవి. జావాలో ఇంకను అనేక మహానగరములును, అనేక రేవు పట్టణములును వుండెను.

శ్రీవిజయను జయించిన పిమ్మట ఈ సామ్రాజ్యనగరము చిరకాలము జీవించలేదు. అంతఃకలహము రాజ్యములలో తలయెత్తెను. చీనాతో కలహము సంభవించెను. దీనికి ఫలితముగా చీనావారి గొప్ప నౌకాదళము జావాకు వచ్చినది. అధినివేశములు క్రమక్రమముగా జారిపోయెను. 1426 లో గొప్ప క్షామమువచ్చెను. రెండు సంవత్సరముల అనంతరము మజపహిత్ సామ్రాజ్యము అంతరించెను. మరి నలభై సంవత్సరములపాటు స్వతంత్ర రాజ్యముగా అది నిలిచియుండెను. కాని మలాకాలోని మస్లిము రాజ్యము దానిని స్వాధీనము చేసుకొనెను.

మలేసియాలోని ప్రాచీన హైందవ అధినివేశములు వృద్ధిజెంది స్థాపించుకొన్న సామ్రాజ్యములలో మూడవ సామ్రాజ్య మీవిధముగా అంతరించినది. మన చిన్న జాబులలో దీర్ఘకాలముల చరిత్ర పరామర్శించితిమి. క్రైస్తవశకము ప్రారంభమందే మొట్టమొదటి వలస ప్రజలు వచ్చియుండిరి. ఇప్పుడు మనము పదిహేనవశతాబ్దిలో వున్నాము. అనగా ఈ అధినివేశములయొక్క 1400 సంవత్సరముల చరిత్ర

మనము పరామర్శించితి మన్నమాట. మనము ముఖ్యముగా పరామర్శించిన ఈమూడు సామ్రాజ్యములలోను—కంబోడియా, శ్రీవిజయ, మజపహిత్—ప్రతి ఒక్కటియు వందలకొద్ది సంవత్సరములపాటు సాగినది. ఈ దీర్ఘ కాలమునుబట్టి ఆరాజ్యములు ఎంత స్థిరమయినవో, ఎంత సామర్థ్యముతో ప్రభుత్వము చేసినవో మనము గ్రహించవచ్చును. చక్కని కట్టడముల కట్టుటయన్న వారికెంతో ఇష్టము. వారి ముఖ్య వృత్తి వర్తకము. హైందవ సంస్కృతి సంప్రదాయములూ వారు నడపించిరి. చీనా సంస్కృతిలోని ప్రధానాంశము లనేకము హిందూ సంస్కృతితో సామరస్యము చెందునట్లుగా మిశ్రము చేసిరి.

నేను ముఖ్యముగా పేర్కొన్న మూడు అధినివేశములూగాక ఇంకా అనేక మున్నవని నీకు జ్ఞాపక ముండవచ్చును. కాని వాటిలో ప్రతియొక్కదానిని గురించీ ముచ్చటించుటకు సాధ్యముకాదు. నాటికి సమీపమందేవున్న బర్మా, సయాం దేశములగూర్చి నేను అట్టే చెప్ప జాలను. ఈ రెండు దేశములందును ప్రబల రాజ్యములు తలయెత్తినవి. కళాసృష్టి అధికముగా జరిగినది. రెంటియందును బౌద్ధము వ్యాపించినది. బర్మాపై మంగోలులు ఒకసారి దాడి వెడలిరి. కాని సయాంపై చీనా యెన్నడూ దండెత్తలేదు. బర్మా, సయాంలు రెంటును చీనాకు మాత్రము కప్పము చెల్లించుచుండిరి. భక్తితో తమ్ముడు అన్నకు చేసిన అర్పణము వంటిది ఆకప్పము. దీనికి ప్రతిఫలముగా తమ్మునకు చీనానుండి అమూల్యమగు కానుకలు వచ్చుచుండెను.

మంగోలుల దండయాత్రకు పూర్వము బర్మాకు రాజధాని ఉత్తర బర్మాలోవున్న పాగన్ నగరము. 200 సంవత్సరములుపైగా ఈ నగరము రాజధానిగా వుండెను. అది చాలా అందమయిన నగరమని చెప్పుదురు. దానికి సాటివచ్చునది అంగ్‌కోరు ఒక్కటే. అందలి మిక్కిలి చక్కని ప్రాసాదము ఆనంద దేవాలయము. ప్రపంచములో బౌద్ధ వాస్తుపద్ధతికి మిక్కిలి చక్కని నిదర్శనముగా అది వుండెను.

ఇంకా గొప్ప భవనము లనేకము అందుండెను. నేడు దాని శిథిలము లను చూచినను ఎంతో అందముగా వుండును. 11 వ శతాబ్ది మొదలు 13 వ శతాబ్దివరకు పాగన్ ఉచ్ఛలో నుండెను. తరువాత కొంత కాలమువరకూ కొన్నిచిక్కులు దానిని చుట్టుకొనెను. ఉత్తర దక్షిణ బర్మాలు విడివిడిగా వుండెను. 16 వ శతాబ్దిని ఒక గొప్పరాజు దక్షిణ మున తలయెత్తి వాటిని మరల యేకముచేసెను. అతని రాజధాని దక్షిణమునవున్న పెగూ నగరము.

బర్మా, సయాంల గూర్చిన ఈసంక్షిప్త వివరణము నీకు తెలిసిం దనుకొంటాను. మలెయా, ఇండోనేసియాల చరిత్ర ముగించబోవు చున్నాను కాబట్టి వాటిని గురించి చెప్పితిని. రాజకీయముగాగాని, సంస్కృతి పరంగాగాని ఈదేశములలో పరివర్తన తీసుకువచ్చిన దేశ ములు ఇండియా, చీనాలు. నేను నీకిదివరలో చెప్పినట్లు ఆసియాకు ఆగ్నేయముగావున్న దేశములు—బర్మా, సయాం, ఇండో–చీనాల వంటివి అధికముగా చీనా ప్రభావమువల్ల మార్పు చెందినవి. ద్వీపము లును, మలయా ద్వీపకల్పమును అధికముగా ఇండియా ప్రభావమువల్ల మార్పు చెందినవి.

ఇప్పుడు ఒక నూతన ప్రభావమువల్ల మార్పురానున్నది. అది అరబ్బులద్వారా ప్రవేశించినది. బర్మా, సయాంలకు దీని సంపర్కము తగలలేదు. మలయాయును, ద్వీపములును దానికి లోనైనవి. త్వరలో అచ్చట ఒక మస్లిము సామ్రాజ్యము వృద్ధినందెను.

అరబ్బీ వర్తకులు వేయి సంవత్సరములు పైగా ఈ ద్వీపములకు వచ్చి అక్కడ స్థిరనివాస మేర్పరచుకొనిరి. కాని వారు వర్తక వ్యాపారములందే నిమగ్నులై యుండిరి. ప్రభుత్వములతో ఎట్టి జోక్య మును కలుగజేసికొనుట లేదు. 14 వ శతాబ్దిలో అరబ్బీ మతప్రచార కులు వచ్చిరి. స్థానిక పాలకులను ముఖ్యముగా వారు తమ మతము లోనికి త్రిప్పుకో గలిగిరి.

ఇంతలో రాజకీయ పరివర్తనములు సంభవించుచుండెను. మజపహిత్ విస్తరించుచుండెను. శ్రీవిజయను అణచివేయుచుండెను. శ్రీవిజయ పతనమయిన పిమ్మట అచ్చటి ప్రజలు అధిక సంఖ్యాకులు మలయా ద్వీపకల్పమునకు దక్షిణముగావెళ్ళి మలాకా నగరమును స్థాపించుకొనిరి. ఈ నగరమును, రాజ్యమును త్వరలో వృద్ధి నందెను. 1400 లో అది మహానగరమయ్యెను. మజపహిత్‌లోని జావా ప్రజలన్న దాని సామంతరాజ్యములు ఇష్టపడకుండెను. సామ్రాజ్యవాదులు సామాన్యముగా నిరంకుశముగా ప్రభుత్వము సాగింతురు. వీరును అట్లుండుటచే ప్రజలలో అనేకులు క్రొత్తరాజ్యమయిన మలాకాకు పోవ నుద్యోగించిరి. ఆకాలమున సయాంకూడా నిరంకుశముగా వుండెను. కాన మలాకా ఇట్టివారికి పలువురకు ఆశ్రయమై వుండెను. అచ్చట బౌద్ధులును, ముస్లిములునుకూడా వుండిరి. పాలకులు తొలుత బౌద్ధులేకాని తరువాత ముస్లిము మతము నవలంబించిరి.

నూతనముగా తలయెత్తిన మలాకా రాజ్యమునకు జావా ఒక తట్టునా, సయాం వేరొకతట్టునా పక్కలో బల్లెములవలె వుండెను. కాన ద్వీపములలోని ఇతర ముస్లిమ్ రాజ్యములతో స్నేహమునుచేయ అది ప్రయత్నించెను. అది చీనాను సైతము రక్షణ చేయమనికోరెను. అప్పుడు చీనాలో మంగోలుల స్థానేవచ్చిన మింగులు పరిపాలన సాగించుచుండిరి. ఒకేమారు మలేసియాలోవున్న ముస్లిమురాజ్యములన్నీ చీనా రక్షణకోరడము అసాధారణ విషయమే. దీనినిబట్టి ప్రబలులగు శత్రువులెవరో వాటిని బెదరిస్తున్నారని తోస్తున్నది.

మలేసియా దేశములపట్ల చీనా స్నేహముగానూ, గంభీరముగాను, తటస్థ్యభావముతోనూ వుండెను. విజయముల సాధించడానికిచ్చలేదు. వాటినుండి తాను పొందదగ్గ లాభములేమీ లేవని అది ఊహించెను. కాని తన నాగరికతను వారికి నేర్పుటకు సిద్ధముగా వుండెను. ఇట్టి రాజనీతికి భిన్నముగా మింగ్ చక్రవర్తి ప్రవర్తించ

దలచినట్లు తోస్తుంది. ఈదేశముల వ్యవహారములు అతడు కనిపెట్టి చూస్తుండెను. జావా, సయాంలు నిరంకుశముగా ప్రవర్తించడము అతడు సమ్మతించలేదు. కాబట్టి వీటిని అరికట్టడమునకునూ, చీనా శక్తి ఇతరులకు చవిచూపుటకునూ అతడు చెంగ్-హో అను నౌకా సేనాని (admiral) క్రింద ఒక గొప్ప నౌకాదళమును పంపెను. అందు కొన్ని నావలు 400 అడుగులు పొడుగున్నవట.

చెంగ్-హో అనేకమారులు వెళ్ళి ఆ ద్వీపముల నన్నింటిని దర్శించెను—ఫిలిప్పైనులు, జావా, సుమిత్రా, మలయా ద్వీపకల్పము మొదలైనవి. అతడు సింహళమునకు సైతమువచ్చి దానిని జయించి రాజును చీనాకు తీసుకుపోయెను. కడపటి దండయాత్రలో అతడు పర్షియన్ గల్ఫువరకూ పోయెను. 15 వ శతాబ్ది తొలి సంవత్సరములలో అతడు చేసిన సముద్రయాత్రలవల్ల అతడు దర్శించిన దేశములన్నియు చీనాపట్ల గొప్ప అభిప్రాయము కలిగివుండినవి. హిందూ సామ్రాజ్యమగు మజపహిత్‌ను, బౌద్ధ రాజ్యమగు సయాంను అరికట్టుటకై చెంగ్-హో కావలెనని ఇస్లామును ప్రోత్సహించెను. మలాకా రాజ్యము ఈగొప్ప నౌకాదళము సహాయముతో సుస్థిరమైనది. చెంగ్-హో ఇట్లు చేయుటలో అభిప్రాయము రాజకీయ సంబంధమైనదే. మతముతో దీనికెట్టి సంబంధములేదు. అతడు అసలు బౌద్ధుడు.

మలాకా రాజ్యము మజపహిత్‌కు ఎదురు పక్షమున నాయకత్వము వహించెను. దాని ప్రాబల్యము వృద్ధియైనది. క్రమముగా అది జావా అధినివేశములను ఆక్రమించ మొదలుపెట్టెను. 1478 లో మజపహిత్ నగరమే పట్టుకోబడెను. పిమ్మట ఇస్లాము రాజమతమయ్యెను. నగరవాసులుకూడ ఆ మతమునే అవలంబించిరి. కాని గ్రామాదులందుమాత్రము, ఇండియాలో వలెనే, వెనుకటి మతమూ, వెనుకటి గాథలూ, ఆచారములూ సాగుచునే వుండెను.

మలాకా సామ్రాజ్యముకూడ శ్రీవిజయ, మజపహిత్ సామ్రాజ్య

ములవలెనే మహోన్నతదశనంది చిరకాలము నిలువవలసినదేకాని అట్టి సావకాశము దానికి చిక్కలేదు. ఇంతలోనే పోర్చుగీసులు వచ్చిరి. కొద్ది సంవత్సరములలో, 1511 లో, మలాకా వారి వశమయ్యెను. ఇట్లు ఈ సామ్రాజ్యములలో నాల్గవ దానిస్థానము నైదవది ఆక్రమించెను గాని అది చిరకాలము జీవించ వలనుపడదయ్యెను. చరిత్రలో మొట్ట మొదటి పర్యాయము యూరోపు ముందుకువచ్చి ఈ తూర్పు సముద్ర మున ప్రబలమయ్యెను.

## 79

# తూర్పుఆసియాను గ్రహించుటకు యూరోపు ప్రారంభించుట

జూలై 19, 1932

మలేసియాకు పోర్చుగీసులు వచ్చిరని చెప్పి వెనుకటి లేఖ ముగించితిమి. సముద్రమార్గములు కనిపెట్టబడ్డట్లున్నూ, పోర్చుగీసు లున్నూ, స్పెయిను వాసులున్నూ మొట్టమొదట తూర్పుదేశములను చేర డానికి పోటీ పడ్డట్లున్నూ ఇదివరలో నీకు చెప్పివున్నాను. పోర్చుగల్ తూర్పు మార్గమును పట్టెను. స్పెయిను పడమటి మార్గమును పట్టెను. ఆఫ్రికాను చుట్టి పోర్చుగల్ ఇండియాకు రాగలిగెను. స్పెయిను, తలవని తలంపుగా పొరపాటున అమెరికాకు వెళ్లెను. తరువాత దక్షిణ అమెరికాను చుట్టి మలేసియాకు వచ్చెను. ఇప్పుడు మన కథాసూత్ర ములను కలుపుకొని మలేసియా చరిత్ర సాగింతము.

సంబారు వస్తువులు (మిరియములు మొదలైనవి) భూమధ్య రేఖకు సమీపమందున్న ఉష్ణదేశములలో పండును. యూరోపులో అవి అసలు పండవు. దక్షిణ ఇండియా, సింహళములలో కొన్ని పండును. కాని ఈ సంబారు వస్తువులు విశేషముగా మొలూకస్

అనబడు మలేసియా ద్వీపములనుండి వచ్చుచుండెను. ఈ ద్వీపములకు సంబారువస్తు ద్వీపము లందురు **(Spice Islands)**. తొలికాలము నుండీ ఈ వస్తువులకు యూరోపులో యెక్కువ గిరాకీ వుండెను. యూరోపుకు వీటిని నిత్యమూ యెగుమతిచేస్తూ వుండేవారు. అవి యూరోపు చేరుసరికి చాలా విలువగల వస్తువులయేవి. రోమన్ కాలమున మిరియములకు ఎత్తుకు ఎత్తు బంగారము వచ్చుచుండెను. సంబారవస్తువులంత విలువగలవైనప్పటికీ, పాశ్చాత్య దేశములలో వాటికంత గిరాకీ వున్నప్పటికీ యూరోపు వాటిని స్వయముగా తెచ్చుకోవాలని అనుకోలేదు. చాలాకాలమువరకూ సంబారు వస్తువుల వర్తకము హిందూదేశస్థుల చేతులలో వుండెను. తరువాత అరబ్బులు దానిని నడిపించ మొదలుపెట్టిరి. ఈ సంబారు వస్తువులపైగల ఆశయే పోర్చుగీసులను, స్పానియర్డులను వేర్వేరు మార్గముల ప్రయాణము చేయించి మలేసియాలో వారిని చేర్చినది. ఈ అన్వేషణలో పోర్చుగీసు వారిది పైచెయ్యి అయినది. స్పానిష్వారీలోపుగా అమెరికాలో ధనార్జన తత్పరులై వుండిరి. అందువల్ల వారువచ్చుట ఆలస్యమైనది.

గుడ్‌హోపు అగ్రముచుట్టి వాస్కోడాగామా ఇండియాను చేరిన పిమ్మట పోర్చుగీసు నావలనేకము ఆదారినే వచ్చినవి. అవి ఇంకను తూర్పుగా ప్రయాణము చేసినవి. సరిగా ఆకాలమున సంబారు ద్రవ్యాదుల వర్తకము కొత్త మలాకా సామ్రాజ్యము వశములో వుండెను. కాబట్టి వెంటనే పోర్చుగీసులకు, మలాకా సామ్రాజ్యముతోను, అరబ్బీ వర్తకులతోను కలహము ప్రాప్తించెను. పోర్చుగీసుల రాజప్రతినిధి అల్బూకర్కు 1511 లో మలాకాను స్వాధీనము చేసుకొని, మస్లిము వర్తకమును తుదముట్టించెను. ఇప్పుడు పోర్చుగీసుల చేతులలో యూరోపు వర్తకము పడెను. యూరోపులోని వారి రాజధానియగు లిస్బన్ పట్టణము వర్తక కేంద్రమయ్యెను. సంబార వస్తువులనూ, ఇతర రకముల తూర్పుదేశపు సరకు లనేకమునూ యూరోపు నాలుగు

నోట్లద్వారా కట్టవచ్చును.

ఇంతకన్న ప్రశస్తమైన విషయము—ఈకాలమునకు సంబంధించిన సంస్కృతి చరిత్ర. యుగముల కాలము చీనాప్రజలు సంస్కారప్రియులు. లలిత కళోపాసకులు. మింగ్‌లు రాజ్యముచేయు కాలమున ప్రభుత్వము చక్కగా నుండుటచేతను, లలితకళలు ప్రోత్సహింపబడుటచేతను, ప్రజల ఉపజ్ఞ ప్రకటితమైనది. దివ్యభవనము లాకాలమున లేచినవి. గొప్పచిత్రములు రచింపబడినవి. మింగుల పింగాణి పాత్రలు అందమగు ఆకారముతో, చక్కని పనివానితనముతో ప్రసిద్ధిగాంచినవి. పునరుజ్జీవన ప్రభావమున ఇటలీలో తయారగుచున్న చిత్రములతో ఈ చిత్రములు తులతూగుచుండెను.

15 వ శతాబ్దాంతమున చీనాదేశము యూరోపుకన్న భాగ్యములో, పరిశ్రమలలో, సంస్కృతిలో మించియుండెను. మింగులు రాజ్యము చేసిన కాలములో ప్రజలు సౌఖ్యముగా వుండిరి. లలితకళా ప్రవిష్టులై వుండిరి. ఈ విషయమున యూరోపులో ఏదేశముగాని, ఇతరదేశము కాని దానికి సాటిరావు. ఈకాలము యూరోపులో పునరుజ్జీవన కాలముతో సరివచ్చెనన్నమాట జ్ఞాపకముంచుకో.

కళావిషయమున మింగుల కాలము సుప్రసిద్ధమగుటకు ఒక కారణము—ఆ కాలమునకుచెందిన వస్తువులనేకము మనవరకూ వచ్చినవి. పెద్దజ్ఞాపక భవనములు, దారువుమీదను, దంతముమీదను, మణులమీదను చక్కని చెక్కడములు, కంచుపాత్రలు, పింగాణీ పాత్రలు నేడు మనము చూడవచ్చును. మింగులకాలము చివరభాగములో శిల్పచిత్రాదు లత్యధికవివరణతో రచించుటవలన చెక్కడములూ చిత్రములూ మనోహరత్వమును కోల్పోయినవి.

ఈ కాలములోనే పోర్చుగీసు ఓడలు మొదటి తడవ చీనాకు వచ్చెను. 1516 లో అవి కాంటన్‌చేరెను. తనకు ఎదురైన చైనీయులనందరినీ అల్బూకర్కు గౌరవముగా చూచుటచేత అతనిని గురించి

మంచివార్తలు చీనాకుచేరెను. కాబట్టి వారు గౌరవముగా ఆహ్వానింప బడిరి. కాని కొద్దికాలములోనే వారు సరిగాప్రవర్తించక అనేక స్థలములలో కోటలు కట్టుకొనిరి. ఇట్టి అనాగరిక కార్యముచేసిన పోర్చుగీసులనుచూచి చీనా ప్రభుత్వము ఆశ్చర్యమందెను. అది తొందరపడి పనిచేయలేదు కాని చివరకు వారినందరినీ చీనానుండి తరిమివేసెను. తమ సామాన్యపద్ధతులు చీనాలో చెల్లవని పోర్చుగీసులప్పుడు తెలుసుకొనిరి. వారటుపిమ్మట శాంతులై వినమ్రులైరి. 1557 లో కాంటను వద్ద నివాసమేర్పరచుకొనుటకు ప్రభుత్వానుమతిని పొందిరి. "మాకో" అధినివేశమును వారప్పుడు స్థాపించుకొనిరి.

పోర్చుగీసులుతోకూడా క్రైస్తవ మిషనరీలు వచ్చిరి. వారిలో మిక్కిలి ప్రసిద్ధినందినవాడు సేంటు ఫ్రాంసిస్ జావియర్. అతడు చాలాకాలము ఇండియాలో గడపెను. మిషనరీ కాలేజీలు అనేకము అతనిపేరనున్నవి. అతను జపానుకుకూడా వెళ్లెను. ఓడనుండి దిగుటకు అనుమతి వచ్చేలోపుగానే అతడు ఒక చీనారేవు పట్టణములో మృతినందెను. చైనీయులు క్రైస్తవ మిషనరీల రాకను ప్రోత్సహించలేదు. ఇద్దరు జెస్యూటు పురోహితులు మాత్రము బౌద్ధ విద్యార్థులవలె మారువేషములు వేసుకొని చాలాసంవత్సరములు చీనాభాషను అభ్యసించిరి. కంప్యూసియస్ గ్రంథములచదివి వారు గొప్ప ప్రావీణ్యమును సంపాదించిరి. శాస్త్రజ్ఞులను పేరుకూడా సంపాదించిరి. వారిలో ఒకనిపేరు "మాటియోరిట్చి". అతడు సమర్థుడగు గొప్ప పండితుడు. చక్రవర్తి అనుగ్రహము సంపాదించగలిగినంత నేర్పుకూడ కలవాడు. తరువాత తన మారువేషము నతడు విసర్జించెను. అతని పలుకుబడివల్ల చీనాలో క్రైస్తవము గౌరవపాత్రమయ్యెను.

17 వ శతాబ్ది తొలిభాగములో డచ్చివారు మాకోకువచ్చిరి. వర్తకము చేసికొనుటకు అనుమతిని వారు కోరిరి. కాని వారికిని పోర్చుగీసు వారికిని కిట్టదు. ఆ కారణమున పోర్చుగీసులు చీనావారికి

కాల్చుట అన్నాడు.

1577 లో డ్రేకు అయిదు ఓడలతో స్పానిష్ అధినివేశనములను కొల్లగొట్టుటకు బయలుదేరెను. అతడు ఆపనిని జయప్రదముగా నిర్వ హించ గలిగెనుగాని నాలుగు ఓడలను పోగొట్టుకొనెను. అతని ఓడలలో ఒక్కటి మాత్రమే, గోల్డెన్ హైండు అనునది, ఫసిఫిక్కును చేరెను. గుడ్ హోపు అగ్రమునుచుట్టి డ్రేకు ఈఓడలో ఇంగ్లాండుకు తిరిగివచ్చెను. ఇట్లాతడు భూమినిచుట్టి వచ్చెను. భూమిని చుట్టిన రెండవయోడ గోల్డెన్ హైండు. మొదటిది మగెల్లన్ యొక్క విక్టోరియా.

స్పానిషురాజు గడ్డమును కాల్చుట అనుకార్యము దీర్ఘకాలము సాగకముందే చిక్కులువచ్చెను. త్వరలోనే ఇంగ్లాండుకును స్పెయిను కును యుద్ధము తటస్థించెను. డచ్చి వారప్పటికే స్పెయినుతో పోరాడు చుండిరి. పోర్చుగల్ కూడా ఈ యుద్ధములో చిక్కుకొనెను. ఇందుకు కారణము ఒకేరాజు స్పెయినును, పోర్చుగలును కొన్ని సంవత్సరముల నుండి ఏలుచుండెను. అదృష్టమూ, పట్టుదలా కారణముగా ఇంగ్లాండు ఈ యుద్ధములో నెగ్గెను. యూరోపు ఆశ్చర్యమందెను. బ్రిటనును జయించుటకు స్పెయినుపంపిన "అజేయమగు నౌకాదళము" భగ్నమై పోయెను. కాని మనమిప్పుడు తూర్పుదేశముల గురించియే ప్రసం గించు కొందము.

ఇంగ్లీషువారును, డచ్చివారును దూరప్రాచ్యముపై దండయాత్ర చేసి స్పానిష్‌వారిని పోర్చుగీసువారిని యెదిరించిరి. స్పానిష్ వారందరూ ఫిలిప్పైను దీవులలో గుమిగూడి యుండుటచేత వాటిని తాము సులభముగా సంరక్షించుకో గలిగిరి. కాని పోర్చు గీసువారికి మాత్రము గట్టిదెబ్బ తగిలెను. వారి తూర్పు సామ్రాజ్యము ఎర్ర సముద్రము మొదలు సంబారవస్తు ద్వీపములగు మొలకసువరకూ 6000 మైళ్ళదూరము విస్తరించియుండెను. వారు ఏడెన్‌లో, పర్షియన్ గల్ఫులో, సింహళములో, ఇండియాతీర భూములనేకములో, తూర్పు

దీవు లంతటిలోనూ, మలయాలోనూ స్థిరవాసులై వుండిరి. క్రమముగా వారు తమ తూర్పు సామ్రాజ్యమును పోగొట్టుకొనిరి. పట్టణము తరువాత పట్టణము, అధినివేశము తరువాత అధినివేశము డచ్చివారో, ఇంగ్లీషువారో స్వాధీనము చేసికొనిరి. 1641 లో మలాకా సహితము శత్రువశమయ్యెను. ఇక మిగిలినది ఇండియాలోనూ ఇతర ప్రదేశములందునూవున్న కొద్దిపట్టణములు మాత్రమే. పడమటి ఇండియాలోని గోవా ఇట్టిది. నేడుకూడా పోర్చుగీసులు అక్కడవున్నారు. కొన్ని సంవత్సరములకు పూర్వము స్థాపించబడ్డ ప్రజాప్రభుత్వ రాజ్యములో గోవా చేరివున్నది. అక్బరు మహారాజు గోవాను స్వాధీనము చేసుకొన ప్రయత్నించెనుకాని అతడు సైతము కృతకృత్యుడు కాలేదు.

ఇట్లు పోర్చుగల్ తూర్పుదేశ చరిత్రనుండి నిష్క్రమించెను. ఈ చిన్నదేశము నోరు పట్టనంత ముద్ద మింగవలె ననుకొన్నది. కాని సాధ్యపడలేదు. ఆప్రయత్నములో దానికి అలసట వచ్చినది. స్పెయిను, ఫిలిప్పైనులలోనే వుండిపోయెను. తూర్పు వ్యవహారములలో అది కలుగజేసి కొనడము లేదు. లాభకారియగు తూర్పు వర్తకమిప్పుడు హాలెండు, ఇంగ్లాండు దేశములకు సంక్రమించెను. ఈ దేశములు రెండును వర్తకసంఘముల స్థాపించుకొని అందుకు సిద్ధమైయే వుండెను. 1600 సంవత్సరమున ఇంగ్లాండు రాణియగు ఎలిజబెత్తు తూర్పు ఇండియా సంఘమునకు వర్తకము చేసికొన నధికార పత్రమిచ్చెను. రెండు సంవత్సరము లైనపిమ్మట డచ్చివారొక తూర్పుఇండియా సంఘమును స్థాపించుకొనిరి. ఈ రెండు సంఘములును ముఖ్యముగా వర్తకము కొరకే ఉద్దేశింపబడ్డవి. అవి ప్రయివేటు కంపెనీలే కాని వారివారి ప్రభుత్వములు వాటికి తరుచు సహాయము చేయుచుండెను. అవి ముఖ్యముగా మలేసియాలోని సంబారవస్తు వర్తకము చేయడమందే మనస్సు పెట్టుకొన్నవి. ఆ కాలమున ఇండియా మొగలు చక్రవర్తులక్రింద ప్రబలదేశమై వుండెను. కాన దానికి కోపము తెప్పించు

పనిచేయుట శ్రేయస్కరము కాదు.

డచ్చివారు, ఇంగ్లీషువారు తరుచు తమలోతాము కలహించుకొను చుండిరి. చివరకు ఇంగ్లీషువారు తూర్పుదీవులనుండి తప్పుకొని ఇండియాపై కన్నువేసిరి. మొగలుల మహాసామ్రాజ్యమప్పుడు దుర్బల మగుచుండెను. పరాయి దేశములనుండివచ్చిన సాహసికులకిది మంచి తరుణముగా వుండెను. ఇట్టి సాహసికులు ఇంగ్లాండునుంచీ, ఫ్రాంసు నుంచీవచ్చి, కుట్రల సహాయముతోను, పోరాడియు పతనమగుచున్న ఈ సామ్రాజ్యభాగముల తీసుకొనుటకు ఎట్లు ప్రయత్నించారో ముందు ముందు తెలిసికొందము.

## ৪০

## శాంతి శ్రేయస్సులు చీనాలో నెలకొన్న కాలము

జూలై 22, 1932

ఆలాగా, నీకు జబ్బుచేసిందాతల్లీ! బహుశా నీకింకా సుస్తీగానే వుందిగాబోలు. జైలులోపలికి వార్తలు చేరడానికి కొంతకాలం పట్టు తుంది. నీకేమీ నేను సహాయం చెయ్యలేను. నీ తంటాలు నువ్వే పడాలి. కాని నామనస్సు నీమీదే వుంటుంది. మనమందరమూ ఏ విధంగా చెదిరిపోయి వున్నామో—నీవేమో దూరంగా పూనాలో వున్నావు. అమ్మ అలహాబాదులో జబ్బుతో వుంది. మిగిలిన వాళ్ళము వేరువేరు చెరసాలలలో వున్నాము.

ఈ ఉత్తరాలు నీకు వ్రాయడం కొన్నాళ్ళబట్టి నాకు కష్టమని పిస్తోంది. నీవు నా పక్కనే వున్నావనీ, నీతో నేను ప్రసంగిస్తూ వున్నా నని తలుచుకొంటున్నా. మళ్ళీ నిన్నెప్పుడు చూడగలనో? మనము కలుసుకోడానికి ముందు యెన్నినెలలు, యెన్ని సంవత్సరాలు గడపవలసి

ఉంటుందో? ఈ కాలములో నీవెంత పెరిగి వుంటావో?

కాని దీర్ఘాలోచనలు చేసుకుంటూ కూచోవడం—ముఖ్యంగా జైల్లో కూచోవడం మంచిదికాదు. ఇది నిగ్రహించుకోవాలి. నేటి సంగతులు మరిచిపోవాలి. గతమును గురించి ఆలోచించాలి.

మనమును మలేసియాలో నుంటిమికాదూ? ఒకవింత విశేషము జరుగుట చూచితివి. ఆసియాలో యూరోపు కాలూను కొనుచున్నది. పోర్చుగీసులు వచ్చిరి; స్పానిషువారు వచ్చిరి; తరువాత ఇంగ్లీషువారూ, డచ్చివారూ వచ్చిరి. చాలా కాలమువరకూ ఈ యూరోపియనులు మలేసియాలోనూ, ద్వీపములలోనూ తమ తమ కార్యములలో మునిగి వుండిరి. పడమర, మొగలులకింద ప్రబలమైన ఇండియా వుండెను. ఉత్తరమున చీనా వుండెను. అది తన క్షేమమును చూచుకొనుటకు సమర్థముగానే వుండెను. కాబట్టి యూరోపియనులు ఇండియా చీనా లతో జోక్యము పెట్టుకొనుటలేదు.

మలేసియానుండి చీనాకు ఒక అంగ. అక్కడికి మనమిప్పుడు వెడదాము. మంగోలు జాతివాడైన కుబ్లెయ్‌ఖాన్ స్థాపించిన యు-ఆన్ రాజవంశము అంతరించింది. ప్రజలు తిరుగుబాటుచేసి మంగోలుసైన్య ములను, 1368 లో గొప్ప గోడ దాటువరకు తరిమిరి. తిరుగుబాటుకు నాయకుడు హుంగ్-వూ. అతడు కూలివాని కొడుకు. చదువులేదు. అతడు జీవితమున అనుభవము సంపాదించెను. అతడు మంచి నాయకు డయ్యెను. పిదప మంచి పాలకుడయ్యెను. చక్రవర్తి పదమాక్ర మించియు అతడు గర్వముపాలుకాలేదు. దురహంకారి కాలేదు. జీవితకాలమంతయు అతడు ప్రజలలో ఒక్కడనే భావముతో వుండెను. అతడు 30 సంవత్సరములు రాజ్యమేలెను. సామాన్య ప్రజలను బాగుచేయుట కతడు నిరంతరమూ పాటుపడుచుండెను. అతడు సామాన్య ప్రజనుండి వచ్చినవాడేగదా. నేడుకూడ ఈ విషయ మున అతనిని తలచుకొనుచుందురు. చివరవరకు అతడు నిరాడంబర

ముగానే వుండెను.

కొత్తమింగ్ రాజవంశములో ప్రథమ చక్రవర్తి హుంగ్-వూ. అతని కొడుకు యుంగ్-లో కూడ గొప్పపాలకుడే. 1403 నుండి 1424 వరకు అతడు చక్రవర్తిగా వుండెను. చీనావారి పేళ్ళతో నిన్ను బాధ పెట్టను. చాలామంది మంచి పాలకులు వారిలో వున్నారు. పిమ్మట క్షీణత ప్రవేశించడం సహజమేకదా. మనమీ చక్రవర్తుల నెత్తుకొనకుండ ఈకాలమునకు చీనా చరిత్రలో యెట్టి స్థానమున్నదో చూతము. ఇది తేజోవంతమైనకాలము. దీనిలో ఏదో మనస్సును హరించే అందమున్నది. మింగ్ అను పదమునకే "ప్రకాశవంతమైన" అనే అర్థమున్నది. మింగ్ రాజవంశము 1368 మొదలు 1644 వరకు 276 సంవత్సరములకాలము సాగినది. చీనా నేలిన రాజవంశము లన్నిటివలె గాక ఇది అచ్చముగా కలగలపులేని చైనీయ రాజవంశ మనిపించుకొన్నది. వీరి రాజ్యకాలమున చైనీయుల ప్రతిభ మిన్నుముట్టినది. ఇది శాంతికాలము. ఇంటను, బయటనుకూడ శాంతి. ఇతరదేశముల మీద పడి వాటిని జయించవలెననే ఇచ్ఛలేదు. సామ్రాజ్యము విస్తరింపజేసుకొనవలెననే తలంపులేదు. పొరుగు దేశములతో అది స్నేహముగా వుండెను. ఉత్తరమున మాత్రము దేశద్రిమ్మరులగు తార్తారు తెగలనుండి కొంత ప్రమాదముండెను. తూర్పు ప్రపంచములోని ఇతర దేశములకు, చీనా, జ్యేష్ఠసోదరునివలె వుండెను. ఈజ్యేష్ఠసోదరుడు తెలివికలవాడు, సంపత్సమేతుడు, సంస్కారము కలవాడు, తన ఔన్నత్యమును గుర్తెరిగినవాడు. తనతమ్ములు సుఖముగా వుండవలననే కోరిక గలవాడు. తన సంస్కృతినీ, తన నాగరికతనూ వారికి నేర్పవలెననీ, వారితో సరిగా పంచుకోవలెననీ కోరేవాడు. తమ్ములు కూడా అతని అండచూచుకొని పనిచేసేవారు. కొంతకాలము పాటు జపాను పైతము చీనా అధిపత్యమును అంగీకరించెను. జపాను నేలుచున్న షోగన్, మింగ్ చక్రవర్తి సామంతుడనని చెప్పుకొనెను.

కొరియానుండీ, ఇండొనేసియన్ ద్వీపములగు జావా, సుమిత్రా మున్నగు వాటినుండీ, ఇండో-చీనానుండీ చీనాకు కప్పము చెల్లింపబడు చుండెను.

"యుంగ్‌లో" పరిపాలన చేయుకాలమందే అడ్మిరల్ చెంగ్-హో నాయకత్వమున గొప్ప నౌకాదళ దండయాత్ర మలేసియా పైకి పోయెను. 30 సంవత్సరముల కాలము అతడు పర్షియన్ గల్ఫు వరకూ తూర్పు సముద్రములలో సంచరించెను. ద్వీప రాజ్యములను భయపెట్టుటకు చేసిన సామ్రాజ్య ఉద్యమముగా ఇది కనిపించుట కాని, దేశమును జయించవలెననిగాని, లాభము పొందవలెననిగాని ఉద్దేశము చీనాకు లేదు. సయాం, మజపహిత్ రాజ్యములు వృద్ధినందుచున్నవి కాన బహుశా యుంగ్-లో ఈ దండాయాత్రను చేయించివుండును. కారణమేమైనను దానివల్ల గొప్పఫలితములు కలిగినవి. మజపహిత్‌ను, సయాంను విజృభించకుండ అది అరికట్టెను. నూతన మస్లిమ్ రాజ్యమగు మలాకాకు ప్రోత్సాహమిచ్చెను. ఇండోచీనా అంతటిలోనూ, తూర్పునా చీనావారి సంస్కృతి వ్యాపింపజేసెను.

చీనాకును, పొరుగు దేశములకును స్నేహమును, తత్కారణమున శాంతియు వుండుటచే రాజ్యవ్యవహారములు చక్కజేసికొనుటకు ఎక్కువ సావకాశము చిక్కెను. ప్రభుత్వము చక్కగా వుండెను. పన్నులు తగ్గించుటవల్ల కర్షకులపై భారముతగ్గెను. రాజబాటలు, జలమార్గములు (Water-ways), కాలువలు, చెరువులు బాగుచేయబడెను. పంటలు పండనప్పుడును, కాలము విపరీతముగా వున్నప్పుడును ప్రజలకు పనికివచ్చుటకై ధాన్యపు కొట్టులలో ధాన్యము నిలువజేయబడెను. ప్రభుత్వము నోట్లను (Paper-money) ప్రచారములో పెట్టెను. ఈ విధముగా పరపతిని (credit) వృద్ధిచేసెను. వర్తకమున కనుకూలత కల్పించెను. సరుకులు మార్చుకొనుటకు సదుపాయములు కలుగజేసెను. అప్పుడు నోట్లను విరివిగా వాడుచుండిరి. నూటికి 70 వంతు పన్నులు

మూలలకు అది పంపుచుండెను.

అరబ్బుల విషయమున అల్బూకర్కు కఠినముగానూ, క్రూరము గానూ ప్రవర్తించినప్పటికీ తూర్పుదేశములతో వర్తకముచేయు సాటి వర్తకులతో స్నేహముగా నుండెనన్న విషయము గమనించతగ్గది. ముఖ్యముగా అతడు, తారసిల్లిన చీనావారి సందరిసీ ప్రత్యేక గౌరవ ముతో చూచుచుండెను. దీనికి ఫలితము పోర్చుగీసులను గురించి సద్భావము చీనాలో కలుగ దొడగెను. అరబ్బులపై విరోధభావమునకు కారణము వారు విరివిగా తూర్పుదేశములతో వర్తకము సాగించుటయే అని తోచుచున్నది.

సంబారవస్తు ద్వీపముల అన్వేషణ ఇంకను జరుగుచునే వుండెను. తరువాత కాలమున పసిఫిక్కు మహాసముద్రమును దాటి భూమిచుట్టును తిరిగివచ్చిన మగెల్లన్ అనువాడు మొలకసు కనుగొనిన యాత్రికులలో ఒకడు. సంబారవస్తు వ్యాపారము యూరోపుతో పోర్చుగీవారు పోటీ లేకుండ 60 సంవత్సరముల కాలము చేసిరి. అప్పుడు 1565 లో స్పెయిను ఫిలిప్పైను దీవులను ఆక్రమించుకొనెను. ఇట్లు రెండవ యూరోపియన్ జాతి తూర్పు సముద్రమున పొడచూపెను. స్పానిషు వారు ప్రధానముగా వర్తకజాతి కానందువల్ల స్పెయిను రాకవల్ల పోర్చు గీసు వర్తకమునకు ఎట్టి ఇబ్బందీ కలుగలేదు. వారు సైనికులను, మత ప్రచారకులను తూర్పుదేశములకు పంపిరి. సంబారవస్తు వ్యాపారము ఎంతగా పోర్చుగీసువారి అధీనమైనదంటే, పర్షియా ఈజిప్టులుకూడా వారిద్వారానే సంబారవస్తువుల కొనుక్కోవలసి వచ్చెను. ఈదీవులతో పోర్చుగీసులుతప్ప ఇంకెవరూ వర్తకము చెయ్యకుండ వారు చేసిరి. ఈ కారణమున పోర్చుగలు భాగ్యవంతమయ్యెను. కాని అది అధి నివేశముల నేర్పరచ ప్రయత్నించలేదు. ఇంతకీ అది చాలా చిన్న దేశమని నీకు తెలుసును. ఈ చిన్నదేశము తూర్పున 100 సంవత్సర ములపాటు—16 శతాబ్దిఅంతా—ఎంత పని చెయ్యగలిగిందో చూస్తే

ఆశ్చర్యకరంగా వుంటుంది.

ఈకాలమున స్పానిష్‌వారు ఫిలిప్పైనుల నంటి పెట్టుకొనియుండి ఆ దీవులనుండి ఎంతధనము సంపాదించుటకు వీలుండునో అంత ధనమూ సంపాదించుచుండిరి. కప్పము బలవంతాన వసూలుచేయుట తప్ప వారుచేసిన దేమీలేదు. తూర్పు సముద్రములో పోరాటములు లేకుండ వారు పోర్చుగీసులతో సంధిచేసికొనిరి. స్పానిష్ అమెరికాతో ఫిలిప్పైనులు వర్తకము చేయరాదని స్పానిష్ ప్రభుత్వము నిషేధించెను. అట్లు నిషేధించకుంటే మెక్సికో పెరూలనుండి బంగారు తూర్పుదేశములకు ప్రవహించునని వారు భయపడిరి. సంవత్సరమునకు ఒకేఒక ఓడ వచ్చి పోవుచుండెను. ఆ ఓడపేరు "మానిల్లా గాలియన్" ఫిలిప్పైను దీవులలోని స్పానిష్‌వారు ఈఓడ రాకకు సాలీనా ఎంతగా కాచుకొని వుండేవారో ఊహించవచ్చును. ఈ దీవులకును అమెరికాకును మధ్య ఈ "మానిల్లా గాలియన్" 240 సంవత్సరముల కాలము పసిఫిక్కు మహాసముద్రమును దాటెను.

స్పెయిను, పోర్చుగీసు దేశములు సాధించిన విజయములను చూచి యూరోపులోని ఇతర దేశములు ఈర్ష్యాగ్రస్తములైనవి. ఆకాలమున యూరోపులో స్పెయిను చాలా ప్రబలమై వుండెను. ఇంగ్లాండు మొదటి తరగతి రాజ్యముగాలేదు. నెదర్లాండులలో-అనగా హాలెండులోను, బెల్జియం కొంతభాగములోను—స్పానిష్ పరిపాలనపై తిరుగుబాటు జరిగెను. స్పెయినుపై ఈర్ష్య, డచ్చివారిపై సానుభూతి పురిగొల్ప ఇంగ్లీషువారు రహస్యముగా డచ్చివారికి సహాయము చేసిరి. ఇంగ్లీషు నావికులలో కొందరు, అమెరికానుండి తిరిగివచ్చు స్పానిష్ వారి బంగారు నింపిన నావలను, పట్టుకొనుచుండిరి. ఈ విధముగా వారు ఓడ దొంగతనములు చేసినట్లు భావించవచ్చును. ప్రమాదకరమైనట్టిన్నీ, లాభకరమైనట్టిన్నీ ఈకార్యము సాధించుటలో ప్రముఖుడు సర్ ఫ్రాంసిస్ డ్రేకు. ఈ కార్యము నతడు స్పెయినురాజు గడ్డమును

డచ్చివారిపై సద్భావము కలుగకుండ శాయశక్తులా ప్రయత్నించిరి. డచ్చిజాతి భీకరులగు ఓడదొంగలజాతి అని చీనావారితో వారు చెప్పిరి. కాబట్టి చైనీయులు అనుమతి ఇయ్యలేదు. కొద్ది సంవత్సరములైన పిమ్మట డచ్చివారు జావాలోని వారినగరమగు బటేవియానుండి మాకోకు ఒక పెద్ద నౌకాదళమును పంపిరి. బలవంతాన మాకోను స్వాధీనము చేసుకో వారు తలచిరి. అది అవివేకకార్యము. చైనీయులును, పోర్చుగీసులును వారికంటె చాలా బలముగా వుండిరి.

డచ్చివారి వెనుకనే ఇంగ్లీషువారు దిగిరి. కాని వారు కృతార్థులు కాలేదు. మింగుల కాలమైన పిమ్మటనే చీనా వర్తకములో కొంత భాగము వారికి కరగతమయ్యెను.

మంచి పదార్థములూ, చెడ్డవీ అంతమగునట్లే మింగుల రాజ్య కాలముకూడా 17 వ శతాబ్దిమధ్యలో తుదముట్టెను. ఉత్తరమందు లేచిన చిన్నతార్తారు మేఘము పెద్దదై చీనాను క్రమ్ముకొన నుండెను. కిన్నులు, లేదా గోల్డెన్‌తార్తారుల సంగతి జ్ఞాపకమున్నదా ? వారు సుంగులను, చీనా దక్షిణమునకు తరిమివేసిరి. వారిని మంగోలులు బయటకు తరిమివేసిరి. ఒక కొత్తతెగ, కిన్నులజ్ఞాతులు, ఉత్తరచీనాలో, ఇప్పుడు మంచూరియా ఉన్నచోట, ప్రాముఖ్యమునకు వచ్చుచుండిరి. "మంచూ" లని వారిపేరు. ఈ మంచూలే చివరకు మింగులస్థానే రాజ్యమునకు వచ్చిరి.

కక్షలతో చీనా చీలిపోకుండా వున్నట్లయితే మంచూలు సులభముగా చీనాను జయించలేక పోయేవారు. ప్రతీదేశములోనూ—చీనా కానీ, ఇండియాకానీ మరి యే ఇతరదేశముకానీ—విదేశీయ దండయాత్రలు జయప్రదముగా జరుగుటకు కారణము ఆదేశము దుర్బలముగా వుండుటకాని, ప్రజలు కక్షలతో కలహించుచుండుటకాని చీనా అంతటను అల్లరులు చెలరేగుచుండెను. బహుశా చివరవచ్చిన మింగు చక్రవర్తులు [illegible] శాసనురులును అయివుండవచ్చును. లేదా ఆర్థిక పరిస్థితులు

బాగుండక పోవుటచేత సాంఘిక విప్లవము రానై యుండవచ్చును. మంచూలతో పోరాటమువల్ల ధననష్ట మెక్కువయ్యెను. పోరాటము కష్టసాధ్యముగానూ వుండెను. ప్రతిచోటా దొంగల నాయకులు తల యెత్తిరి. వీరిలో గొప్పవాడు కొద్దికాలముపాటు చక్రవర్తికూడ అయ్యెను. మంచూలమీదకు సైన్యముల నడిపించు మింగులనాయకుల పేరు వూ-సాన్-క్వై. ఈదొంగ చక్రవర్తితోను, ఈ మంచూలతోనూ ఎట్లా ప్రవర్తించవలెనో అతనికి తోచలేదు. మిక్కిలి తెలివితక్కువగా లేదా బహుశా ద్రోహబుద్ధితో అతడు దొంగల నాయకుని అణచుటకు మంచూల సహాయము కోరెను. సంతోషముతో మంచూలు సహాయము చేసిరి. కాని వారు పీకింగులోనే నిలిచిపోయిరి. వూ-సాన్-కై మింగులకు పరాజయము తప్పదని వూహించి, వారిని వదలిపెట్టి, విదేశ దండయాత్రికులగు మంచూలతో చేరెను.

చీనాలో వూ-సాన్ క్వైను నేడుకూడ ద్వేషింతురు. గొప్ప రాజద్రోహిగా అతనిని భావింతురు. ఇందాశ్చర్యమేమున్నది? దేశరక్షణకు నియమింపబడ్డ అతడు శత్రుపక్షమునచేరి, దక్షిణ రాష్ట్రములు శత్రుపశమగుటకు సహాయముచేసెను. తాను మంచూలకొరకై జయించిన రాష్ట్రములకే రాజప్రతినిధిగా అతడు నియమింపబడెను. ఈ విధముగా అతనికి బహుమానము వచ్చెను.

1650 సంవత్సరమునకు కాంటన్ మంచూల వశమయ్యెను. దీనితో చీనా అంతా మంచూల వశమైనట్లే. మంచూలకు విజయము దక్కుటకు కారణము బహుశావారు చైనీయులకన్న యుద్ధనిపుణులై వుండవచ్చును. బాహుశా చిరకాలము శాంతిశ్రేయస్సులు అనుభవించుట వల్ల చైనీయులు యుద్ధవిషయమున దుర్బలులై యుండవచ్చును. మంచూల శీఘ్రవిజయమునకు ఇతర కారణములుకూడా వున్నవి. అందు ముఖ్యమైనది—చైనీయులను మంచూలు మంచి చేసుకొనిరి. వెనుకటి రోజులలో తార్తారుల దండయాత్రలు క్రౌర్యముతోను హా...

తోను కూడివుండెను. ఈమారు చీనా ఉద్యోగులతో మంచి చేసుకొనుటకు గట్టి ప్రయత్నములు చేయబడెను. ఈ వుద్యోగస్థులకే మరల ఉద్యోగము లీయబడినవి. చైనీయ ఉద్యోగులే ఉన్నతపదవుల నాక్రమించిరి. వెనుకటి మింగుల రాజ్యాంగ పద్ధతులే ఇప్పుడుకూడ మార్పు లేకుండ సాగింపబడుచుండెను. రాజ్యాంగమదే. పైనుండి దానిని నడిపించు వ్యక్తులుమాత్రము మారిరి.

కాని రెండు ప్రధాన విషయములనుబట్టి చైనీయులు విదేశీయుల పరిపాలనలో వున్నారని చెప్పవచ్చును. ప్రధానకేంద్రములలో మంచూ సేనలు నిలుపబడెను. తనవెనుక జడవేసికొను మంచూల ఆచారము చైనీయులపై విధింబడినది. ఇది లొంగుబాటుకు చిహ్నము. మనలో పలువురము ఈజడలు వేసికొను అచారము చైనీయులకే ముడిపెట్టితిమి. కాని ఇది చైనీయుల ఆచారముకాదు. అది బానిసత్వ చిహ్నము. సిగ్గు అని అనుకోకుండా, నీచమని అనుకోకుండా మన ఇండియనులు కొందరు ఈ బానిసత్వ చిహ్నము లనేకము అవలంబించారు. చైనీయులు నేడు జడవేసికొను ఆచారమును వదలిపెట్టిరి.

ఇట్లు చీనాలో కాంతివంతమగు మింగులపాలన మంతరించెను. మూడు శతాబ్దులకాలము చక్కగా పరిపాలనచేసిన అది అంత శీఘ్రముగా ఏల పతనము కావలెనో తెలియదు. ప్రభుత్వము అంతమంచి దైనట్లయితే తిరుగుబాట్లు అల్లరులు ఎందుకు కలుగవలెను? మంచూరియా నుండి వచ్చిన విదేశీయులనేల అది ఆపలేదు? బహుశా చివరరోజులలో ప్రభుత్వము నిరంకుశముగా నుండెను కాబోలు. తల్లిదండ్రుల వలె శ్రద్ధగా ప్రజలను పోషించు దొరతనమే వారి దౌర్బల్యమునకు కారణమేమో. చెమ్చాలతో ఆహార మందించుటకు పిల్లలకూ మంచిది కాదు, జాతులకూ మంచిదికాదు.

మంచి సంస్కార మందినప్పటికీ చీనా ఎందువల్ల ఈరోజులలో ఇతర మార్గములలో వృద్ధిచెందలేదో తెలియదు—విజ్ఞానశాస్త్రము, దేశా

న్వేషణము మొదలైన మార్గములలో, యూరోపులోని ప్రజలు వారి కెంతో వెనుకనుండిరి. కాని పునరుజ్జీవనకాలములో వారెంతో ఉత్సాహము, శక్తి, సాహసము, పదారతత్వ విచారణేచ్ఛ చూపుచుండిరి. ఈరెండు దేశములను, ఇద్దరు పురుషులతో పోల్చవచ్చును. ఒకడు సంస్కృతి కలవాడు; మధ్యవయస్సులో ఉన్నాడు. శాంతజీవనమన్న ఇష్టము; కొత్తగా సాహసకార్యములుచేయుట కిష్టములేదు; దైనందిన చర్యలలో మునిగివుండును. ప్రాచీన కావ్యములతోను, కళావిషయముతోను కాలక్షేపము చేయుచుండును. రెండవవాడు వయస్సులోనున్న బాలుడు; కొంత మొరటుతనముకద్దు; కాని చురుకుదనము, పరిశీలన కలవాడు. సాహసకార్యములన్న ఇష్టము. చీనాలో గొప్పసౌందర్యము కలదు. కాని అది అపరాహ్న కాలమందలిగాని, సాయంకాలమందలి గాని శాంత సౌందర్యమువంటిది.

## 81

# ఇతరదేశములతో సంబంధము లేకుండా జపాను ముడిచిపెట్టుకొని వుండుట

జూలై 23, 1932

చీనానుండి మనము జపాను పోవుదము. తోవలో కొంచెము సేపు కొరియాలో ఆగుదము. మంగోలులు కొరియాలో ఆధిపత్యము నెరపుచుండిరి. వారు జపానుపై బడుటకుకూడా ప్రయత్నించిరి కాని లాభము లేకపోయెను. కుబ్లైఖాను అనేక దండయాత్రలను జపానుపై పంపెను. అవి అన్నియు వెనుకకు కొట్టబడ్డవి. సముద్రమవిన వారికి కొంత కష్టముగా వున్నట్లు తోచును. . ముఖ్యముగా వారు భూమిమీద పోరాటములు సలుపవలసినవారే. ద్వీపము కాబట్టి జపాను వారి బారిని పడకుండా తప్పించుకొన్నది.

చీనానుండి మంగోలులు తరుమగొట్ట బడుటతోడనే కొరియాలో విప్లవము సంభవించెను. మంగోలులకు వశులై వుండిన పాలకులు తరుమగొట్టబడిరి. ఈ విప్లవమునకు నాయకుడు దేశభక్తుడైన కొరియా దేశస్థుడు. ఈ తాయ్-జో అనే పేరు గలవాడు. అతడు పాలకుడై ఒక కొత్త రాజవంశమును స్థాపించెను. ఇది 1392 నుండి మొన్న మొన్నటివరకూ—అనగా జపాను కొరియాను ఆక్రమించు వరకూ— 500 సంవత్సరముల కాలము రాజ్యముచేసెను. సీయోల్ పట్టణము కొరియాకు రాజధాని అయ్యెను. నాటినుండియు అది రాజధానిగానే వుండెను. ఈ 500 సంవత్సరముల చరిత్ర మనమిప్పుడు ఎత్తుకోలేము. కొరియాను మరల చోజన్ అనేవారు. స్వతంత్ర రాజ్యముగానే కొరియా కాలక్షేపముచేసెను. కాని అది చీనాకు భయపడుతూ తరుచు కప్పము చెల్లిస్తూ వుండెను. జపానుతో అనేకమార్లు యుద్ధము సంభవించెను. కొన్ని యుద్ధములలో కొరియాదే విజయము. నేడన్ననో కొరియా, జపానులకు పోలికేలేదు. జపాను ప్రబలమైన ఒక మహా సామ్రాజ్యమై యుండెను. సామ్రాజ్యవాద రాజ్యముల దోషములన్నియు దానికుండెను. ఈ సామ్రాజ్యములో కొరియా ఒకముక్క. జపానీయులచే పాలింపబడుచూ, వారి ప్రయోజనములకై ఉపయోగింపబడుచూ, స్వాతంత్రముకోసమై ధైర్యముతో పెనగులాడుచూ కొరియా వుండెను. కాని ఇది నేటిచరిత్ర. మనమింకను దూరముగా భూతకాలములోనే వుంటిమి.

12 వ శతాబ్దాంతమున జపానులో షోగన్ నిజమైన పాలకుడయ్యె నన్నమాట నీకు జ్ఞాపక మున్నదనుకొందును. చక్రవర్తి ఒక కీలుబొమ్మమాదిరిగా వుండెను. మొదటి షోగనేటు 150 సంవత్సరములుండెను. దానిని కామకూర షోగనేటు అందురు. ఈ కాలమున సమర్థమగు పరిపాలనమూ, శాంతీ దేశమున వుండెను. పాలక రాజవంశము క్షీణించదొడగెను. దానితో అసమర్థత, భోగలాలసత్వము,

అంతఃకలహములు తలయెత్తెను. తన అధికారమును నిలుపుకోబూవిన చక్రవర్తికిని, షోగనులకును కలహములు పుట్టెను. చక్రవర్తి విఫలుడాయెను. పాత షోగనేటుకుకూడ ఫలము దక్కలేదు. 1328 నుండి కొత్త షోగను పరంపర అధికారమునకు వచ్చెను. దీనిని అషికగ షోగనేటు అందురు. ఇది 235 సంవత్సరములు ఉద్యోగములో వుండెను. కాని ఈకాలభాగమున కలహములు, యుద్ధములు తటస్థించెను. చీనాలో మింగులురాజ్యము చేస్తూన్నదీకాలమందే. ఈ షోగనులలో ఒక్కడు మింగుల అనుగ్రహము సంపాదించుటకు ఉత్సాహపడుచుండెను. మింగు చక్రవర్తికి తాను సామంతుడని ఒప్పుకున్నాడు కూడా. జపాను చరిత్రకారులు జపానుకు జరిగిన ఈ పరాభవమునకు చాలా నొచ్చుకొన్నారు. ఈ షోగనును వారు కఠినముగా నిందించారు.

జపాను చీనాతో స్నేహముగా నుండెను. మింగుల పాలనమున చీనా సంస్కృతి వికసించుచుండుట జపాను కనిపెట్టెను. చీనావారికి సంబంధించిన ప్రతివిషయము జపానువారు జాగ్రత్తగా తెలిసికొనుచుండిరి. మెచ్చుకొనుచుండిరి—చిత్రలేఖనము, కవిత్వము, వాస్తువిద్య, తత్త్వశాస్త్రము, యుద్ధకళసైతము వారు తెలిసికొని మెచ్చుకొనుచుండిరి. రెండు ప్రసిద్ధభవనములు ఈ కాలమున జపానులో నిర్మింపబడెను. ఒకటి కింకకుజి (బంగారు భవనము), రెండవది గింకకుజి (వెండి భవనము).

కళావికాసముతోపాటు, భోగములతోపాటు రైతులెంతో కష్టపడుచుండిరి. రైతులపై వేసిన పన్నులు మిక్కిలి భారముగావుండెను. అంతఃకలహముల భారముకూడ అధికముగా వారిమీదనే పడెను. నానాటికి పరిస్థితులు విషమించుచుండెను. చివరకు కేంద్రప్రభుత్వము, రాజధానిలోతప్ప బయట తనయధికారమును చూపలేకుండెను.

ఈ యుద్ధములు జరుగుచుండగానే 1542 లో పోర్చుగీసులు వచ్చిరి. వీరే మొట్టమొదట మందుగుండు ఆయుధములను జపానుకు

తెచ్చిరి. ఇది వింతవిషయమే. చీనాకీ ఆయుధములు ఎంతకాలము నుండియో తెలుసును. చీనానుండియే మంగోలులద్వారా యూరోపు ఈవిద్య గ్రహించెను.

నూరు సంవత్సరములనుండి జరుగుచున్న అంతఃకలహముల నుండి జపానును రక్షించినవారు ముగ్గురు పురుషులు. వారు—నర్బునాగ అనువాడొకకుడు. అతడొక డైమ్యో, అనగా కులీనుడు. హిడియోషి అను కర్షకుడొకడు. టొకుగావా—ఇయెయాసు అనువాడొకడు. ఇతడు గొప్పకులీనులలో ఒకడు. పదహారవ శతాబ్దాంతమునకు జపానంతయు మరల ఏకమయ్యెను. కర్షకుడగు హిడియోషి మిక్కిలి సమర్థుడగు రాజనీతి నిపుణుడు. అతడు చాలా కురూపి అని చెప్పుదురు. పొట్టిగా కుది మట్టముగా వుండేవాడట. ముఖము కోతిముఖము.

జపానును ఏకముచేసిపిమ్మట వారికున్న గొప్ప సేనతో ఏమి చెయ్యవలెనో తోచలేదు. వేరేపని యేమిన్నిలేదు కాబట్టి వారు కొరియామీదకు దండయాత్రచేశారు. కాని వెంటనే వారికి పశ్చాత్తాపము కలిగింది. కొరియనులు జపానువారి నౌకాదళమును ఓడించి రెండు దేశములకు మధ్యనున్న జపాను సముద్రమును తమస్వాధీనములో ఉంచుకొనిరి. కొరియనులు విజయమందుటకు కారణము వా రుప యోగించిన ఓడలు. అవి కొత్తరకము ఓడలు. వాటికప్పు తాబేలు చిప్పవలె వుండును. ఇనుప రేకులతో పొదుగబడి వుండును. వీటిని "తాబేలు ఓడలు" అనేవారు. ఇష్టము వచ్చినట్లు వెనుకకును ముందు కునుకూడా వాటిని నడిపించవచ్చును. ఈ యోడలు జపానువారి యుద్ధ నావలను నాశముచేసెను.

ఈ అంతఃకలహములవల్ల చాలా లాభము సంపాదించినవాడు పైని పేర్కొన్న ముగ్గురిలోనూ మూడవవాడగు టొకుగావా—ఇయె యాసు అనువాడు. ఇందువల్ల అతడు ఎంతో భాగ్యవంతుడయ్యెను. జపానుదేశములో ఏడవవంతు భూభాగముకు అతడు యజమాని

అయ్యెను. అతని భూములమధ్య యేడో అనునగరమును అతడు నిర్మించెను. ఈ నగరమే తరువాత టోకియో అయినది. ఇయెయాసు 1603 లో షోగనయ్యెను. ఈ విధముగా మూడవ షోగనేటు ప్రారంభ మయ్యెను. ఇదే ఆఖరుది. దీనికి టొకుగావా షోగనేటందురు. ఇది 250 సంవత్సరములుపైగా రాజ్యమేలెను.

ఈ కాలములో కొద్దికొద్దిగా పోర్చుగీసులు తమ వర్తకమును సాగించుచుండిరి. 50 ఏండ్లవరకూ వారితో పోటీచేసే యూరోపియను లెవరూ లేరు. 1592 లో స్పానిష్‌వారువచ్చిరి. వారి తరువాత ఫ్రెంచి వారును, ఇంగ్లీషువారును వచ్చిరి. 1549 లో సెంటు ఫ్రాంసిస్ జావియర్ క్రైస్తవమతమును ప్రవేశపెట్టినట్లు తోచును. మతబోధ చేసికొనుటకు జెస్యూటులకు అనుమతి వుండుటయేకాదు, వారికి ప్రోత్సాహముకూడా వుండెను. ఇట్లా చేయుటకు రాజకీయ కారణములుండెను. బౌద్ధ మతసులు కుట్రలకు పుట్టినిండ్లయి ఉండెను. ఈ కారణమున బౌద్ధ సన్యాసులను అణచివేసి క్రైస్తవ మిషనరీలపై అనుగ్రహము చూప బడెను. కాని ఈ మిషనరీలవల్ల అపాయము సంభవించునని జపా నీయులు వెంటనే గ్రహించిరి. వెంటనే వారు తమపద్ధతిని మార్చుకొని మిషనరీలను తరిమివేయుటకు ప్రయత్నించిరి. 1587 సంవత్సరము లోనే క్రైస్తవులకు వ్యతిరేకముగా ఒక శాసనము పుట్టెను. దీని ప్రకారము 20 రోజులలో మిషనరీలంతరూ జపానునువిడిచి పోవలెను. పోనివారికి మరణదండన. ఈశాసనము విదేశవర్తకుల నుద్దేశించినది కాదు. వర్తకులు జపానులో ఉండవచ్చును. వర్తకము చేసుకోవచ్చును. కానివారు వారి ఓడలలో మిషనరీలను తీసికొని వచ్చినట్లయితే అట్టి ఓడలూ, అందలి సరుకూ జపానువారు వశము చేసికొందురు. ఈ శాసనము రాజకీయ కారణముల వల్లనే పుట్టినది. హిడియోషి అపాయ మును ముందుగా కనిపెట్టెను. మిషనరీలును, మతము మార్చుకొన్న వారను రాజకీయముగా దేశమున కపాయము తెత్తురని అతడు భయ

పడెను. అతడు ఆ విషయమునులో పొరపాటు పడలేదు.

ఇంతలోనే ఒక విశేషము జరిగెను. తానను కొన్నమాట నిజమే నని హిడియోషి గ్రహించి కుపితుడయ్యెను. మానిల్లా గాలియర్ సంగతి జ్ఞాపకమున్నదా? ఈనావ ఫిలిప్పైను దీవులకు స్పానిష్ అమెరికాకుమధ్య సంవత్సరమున కొకమారు తిరుగును. అది తైపూను వాయువుచే కొట్టబడి ఒకమారు జపానుతీరమును చేరుకొనెను. ఆనావ లోని స్పానిష్కప్తాన్ ప్రపంచపటమును జపానువారికిచూపి, అందు స్పానిష్ రాజువశమందున్న పెద్ద భూభాగములను వారికిచూపి, ఆ విధ ముగా వారిని బెదరగొట్టవలెనని ప్రయత్నించెను. స్పెయినుకింత పెద్ద సామ్రాజ్యం ఎట్లా వచ్చిందని కప్తానును అడిగిరి. అతడు చెప్పిన మాటలు ఏమనగా—అదెంత కష్టము. మిషనరీలు ముందుగా వెళ్లుదురు. వారు చాలామందిని తమ మతములోనికి తిప్పుకున్న తరువాత సైనికులు దిగి మతము పుచ్చుకొన్నవారితో కలిసి ప్రభుత్వమును వశము చేసు కొందురు. హిడియోషి ఈ వృత్తాంతమును వినెను. ఈ వ్యవహార మతని కిష్టముగాలేదు. మిషనరీలన్న అతనికి మంట ఎక్కువ అయ్యెను. అతడు మానిల్లా గాలియనును తీరమువదలి పోనిచ్చెను కాని కొందరు మిషనరీలనూ, మతము పుచ్చుకొన్నవారినీ అతడు చరపించెను.

ఇయెయాసు, షోగను అయినప్పుడు విదేశీయులతో అతడెక్కువ స్నేహముగా వుండెను. విదేశీయ వర్తకము, ముఖ్యముగా తన నగరమగు యేడుతో, వృద్ధినందింప అతడు కుతూహలము చూపెను. కాని ఇతడు మరణించిన పిమ్మట క్రైస్తవులను హింసపెట్టుట మరల ప్రారంభమాయెను. బలవంతముగా మిషనరీలు తరిమివేయబడిరి. క్రైస్తవమతావలంబులగు జపానీయులు క్రైస్తవమును వదలుకోవలసి వచ్చెను. వర్తకవు నరళికూడ మారినది. విదేశీయుల రాజకీయ తంత్రములన్న జపానీయులంత భయపడిరి. ఏమైనాసరే విదేశీయులు

దూరముగా వుండవలసినదే అని వారి తలంపు.

విదేశీయులపై జపానీయులకింత విముఖత్వము కలగడానికి కారణము మన మూహించుకోవచ్చును. యూరోపియనులతో ఆట్టే సంపర్కము లేకున్నా వారు, మతమనే గొర్రెతోలు కప్పుకొన్న సామ్రాజ్యతత్వమనే తోడేలును సూక్ష్మబుద్ధితో గ్రహించిరనుట ఆశ్చర్యకరమగు విషయము. పిదప కాలములో ఇతరదేశములలో యూరోపియన్ జాతులు మతము సహాయముతో స్వలాభమునకెట్లు పాటుపడిరో మనకు బాగాతెలిసిన విషయమే.

ఇప్పుడు జపానులో ఒకవింతపని ప్రారంభమాయెను. చరిత్రలో ఇదియొక వింత. విదేశీయులు ఎవ్వరును రాకుండ జపాను తలుపులు మూసుకొనెను. తనమట్టుకుతాను ప్రత్యేకముగా వుండిపోవుట, ఇతరులను తన దేశమునకు రాకుండాచేయుట, అనేపద్ధతిని జపాను కావలసి అవలంబించెను. అవలంబించుట తడవుగా దానిని క్షుణ్ణముగా అసులులో పెట్టెను. 1623 లో ఇంగ్లీషువారు, జపాను అనిష్టమును గ్రహించి అక్కడికి వెళ్లుట మానుకొనిరి. మరుసటి సంవత్సరము స్పానియర్డులు బహిష్కరింపబడిరి. వీరిని చూస్తేనే జపానుకు ఎక్కువ బెదురుగా వుండెను. క్రైస్తవేతరులే ఇతర దేశములతో వర్తకములు చేయవచ్చునని ఉత్తరువు పుట్టెను. వారుసైతము ఫిలిప్పైను దీవులకు పోరాదు. చివరకు 12 సంవత్సరముల తరువాత, 1636 లో జపాను తలుపులు బిగించుకొనెను. పోర్చుగీసులుకూడా బహిష్కరింపబడిరి. జపానీయులెవ్వరును, క్రైస్తవులుకానీ, క్రైస్తవేతరులుకానీ, యెందుకొరకును అన్యదేశములకు పోరాదు. అన్యదేశములలోవున్న జపానీయులు జపానుకుతిరిగి రారాదు. వస్తే మరణదండన; కొద్దిమంది డచ్చివారు మాత్రము మిగిలిరి. వారైనా రేవుపట్టణములను విడువరాదు. జపానుదేశములోనికి పోరాదు. 1641 లో ఈ డచ్చివారు సైతము నాగసాకీ నౌకాశ్రయములోని చిన్న ద్వీపమునకు పంపబడిరి. అచ్చట

వారు ఖైదీలవలె వుంచబడిరి. ఇట్లు, పోర్చుగీసులు అడుగుపెట్టిన తొంభై తొమ్మిది సంవత్సరములకు జపాను అన్యదేశములతో యెట్టి సంసర్గా పెట్టుకోకుండా ముడిచిపెట్టుకొని కూర్చుండెను.

1640 లో ఒక పోర్చుగీసు నావలో రాయబారులువచ్చి వెనుకటి వలె వర్తకము సాగించుకొనుటకు అనుమతి కోరిరి. కాని లాభములేక పోయెను. జపానువారీ రాయబారులను, నావికులను పెక్కురను చంపి కొందరు నావికులను స్వదేశమునకుపోయి చెప్పుకొనుటకై వదలి పెట్టిరి.

200 సంవత్సరముల కాలముపాటు పొరుగువారితో సంబంధము లేకుండా, ప్రపంచముతో సంబంధము లేకుండా జపాను కాలక్షేపము చేసెను. చీనా, కొరియాలతోకూడా సంబంధము పెట్టుకోలేదు. ద్వీపములోవున్న కొద్ది డచ్చివారూ, ఎప్పుడయినా తటస్థపడే ఒకచీనావాడూ మాత్రమే బాహ్యప్రపంచముతో సంబంధం కలిపేవారు. ఇదైనా ఎంతో తనిఖీతో జరిగేది. ఇట్టి సంబంధ విచ్ఛేదము చాలా అసాధారణమైన విషయము. తెలిసినంతవరకు చరిత్రలోగాని, ఏదేశములోగాని ఇట్టి నిదర్శనము కానరాదు. గూఢమగు టిబెట్టు దేశమును, మధ్య ఆఫ్రికాయును సైతము పొరుగు వారితో సంబంధములు పెట్టుకొనెను. ఎవరికివారు ప్రత్యేకముగా నిలుచుట ప్రమాదకరమైన విషయము. ఇది వ్యక్తులకేకాదు, జాతులకున్నూ అపాయకరమే. కానీ జపాను ఇట్లు చేసిన్నీ నిలిచింది. దేశములోశాంతి ఉండెను. దీర్ఘయుద్ధముల నుండి తేరుకొన్నది. 1853 లో అది తన తలుపులూ, కిటికీలూ పార తెరచినప్పుడు అది వేరొక అసాధారణ కార్యము చేయగలిగెను. మిక్కిలి వడిగా అది ముందుకుపోయెను. ఇదివరలో పోగొట్టుకొన్న కాలమును కూడదీసుకొనెను. యూరోపు జాతులనువచ్చి కలుసుకొనెను. వారి విద్యలోనే వారిని ఓడించెను.

చరిత్రయొక్క వట్టి సంగ్రహరూపము రుచికరముగా వుండదు.

చరిత్రలో విహరించువ్యక్తులు చిన్నగా, జీవములేనట్లు కనిపిస్తారు. కాని ఒక్కొక్కప్పుడు వెనుకటి కాలములో వ్రాసిన ఒక గ్రంథమును చదువుతూన్నప్పుడు అందు జీవముట్టిపడుతూన్నట్లు వుండును. గతము మనకు సమీపమునకువచ్చును. అందు జీవించుచున్న, ప్రేమించుచున్న, ద్వేషించుచున్న మానవులు మనకు గోచరిస్తారు. ఈమధ్య నేనొక పుస్తకము చదివియుంటిని. మురసాకీ అనే జపానుస్త్రీ పూర్వకాలమున జపానులో వుండేది. ఎన్నోవందల సంవత్సరములకు పూర్వము, ఈజాబులో వర్ణించిన అంతఃకలహములకు పూర్వము, ఆమె జపాను చక్రవర్తి కొలువులో వుండేది. ఆమె తన జీవితాన్ని విపులంగా వ్రాసినది. ఈగ్రంథములోని కొన్నిభాగాలు నేను చదివేటప్పుడు ఆవిడ నా కళ్ళకుకట్టినట్లు కనుపించింది. ఆమె స్వీయచరిత్ర ఎంత అందముగా వున్నది? సున్నితముగా చెప్పిన విషయములు, తన పరిచయములు, కొలువులోని నిరర్థకకార్యములు ఇవన్నీ ఎంతో నిజముగా కనిపించినవి. ప్రాచీన జపానురాజు కొలువుకూటమునకు సంబంధించిన కళామయమగు పరిమిత ప్రపంచము నాకన్నులకు కట్టినట్లు కనిపించినది.

## 82

# యూరోపులో సంక్షోభము

అగస్టు 4, 1932

చాలా దినములనుండి నీకు ఉత్తరములు వ్రాయడంలేదు. నీకు వ్రాసి రెండు వారములైన దనుకుంటాను. బాహ్యప్రపంచములో ఉన్నట్లే చెరసాలలోకూడా ప్రతివాడికీ మనస్థితిలో మార్పులు వుంటూ వుంటవి. ఈమధ్య ఈజాబులు వ్రాయడానికి నాకు మనస్కరించడంలేదు. ఈజాబులు నేను తప్ప ఇంకెవరూ చూడరు. ఈజాబులన్నీకుట్టి ఒకచోట పడవేస్తున్నాను. తరుణము వచ్చినప్పుడు, అవచ్చేది యెన్ని

మాసాలో, సంవత్సరాలో గడచిన పిమ్మట మనము మళ్ళీ కలుసుకొన్నప్పుడు, నీవు వాటిని చదువవచ్చును. ఎన్ని మాసాలో, సంవత్సరాలో గడచిన పిమ్మట మనము కలుసుకుంటాము. ఒకరినొకరు చూచుకొంటాము. నీవు ఎంత ఎదిగావో! ఎంత మారావో! అని నేను ఆశ్చర్యపోతాను. అప్పుడు మనమెన్నో విషయాలు మాట్లాడుకోవాలి. ఎన్నోపనులు చేయాలి. ఈ జాబులమీది కప్పుడు నీమనస్సుపోదు. అప్పటికి ఈజాబులు కొండ ఎత్తు పెరుగుతాయి. వాటిలో నాచెరసాల జీవితములోని ఎన్నివందల గంటలో యిమిడివుంటవి!

అయినా ఈ ప్రత్తరాలు వ్రాస్తూనేవుంటాను. వ్రాసిన బొత్తులమీద పెడుతూనే వుంటాను. బహుశా నీకవి నచ్చవచ్చు. నాకుమాత్రం అవి చాలాయిష్టం.

మనము ఆసియాలో కొంతకాలము గడపితిమి. ఇండియాలో, మలేసియాలో, చీనాలో, జపానులో దానిచరిత్ర పరామర్శించితిమి: మనము యూరోపును వదలి పెట్టినప్పుడు అది మేల్కాంచుచుండెను. దానిచరిత్ర ఉత్సాహము పుట్టిస్తుంది. పునరుజ్జీవనకాలమది. యూరోపు పునర్జన్మనెత్తుచుండెను. అది నూతనజన్మ ఎత్తుతోందని చెప్పడమే ఎక్కువ సమంజసంగా వుంటుంది. ఎందువల్లనంటే 16 వ శతాబ్దిలో వృద్ధిబొందుచున్న యూరోపు ప్రాచీనకాలము నేవిధముగానూ పోలి వుండలేదు. అది కొత్తది. లేదా కొత్తబురఖా వేసుకొన్న పాత యూరోపు అనవచ్చును.

యూరోపులో ప్రతిచోటను సంక్షోభము, కలత కనిపించుచుండెను. ప్రతిచోటను ఆవరణమును దాటి పోవలెననేప్రయత్నమే. అనేక వందల సంవత్సరములకాలము, యూరోపులో, ఫ్యూడల్ విధానముపై ఆధారపడిన సాంఘిక, ఆర్థిక కట్టుబాట్లు అమలులోనుండెను. వాటిచే బద్ధమై యూరోపు ఉండెను. ఈ పరిస్థితులు అభివృద్ధికి ఆటంకముగా ఉండెను. ఇప్పుడు గూడు అనేకచోట్ల విచ్చిపోవుచున్నది: కొలంబసూ,

వాస్కో-డగామా, సముద్రమార్గముల కనిపెట్టిన తొలివాటి అన్వేషకులూ ఈ గూడునుండి బయటపడిరి. అమెరికాలనుండీ, తూర్పునుండీ స్పెయిను, పోర్చుగల్ దేశములు సంపాదించిన అపరిమిత ధనరాసులు చూచి యూరోపు దిగ్భ్రమ చెందింది. మార్పు త్వరలో కలుగుటకు ఇదియొక కారణము. తన చిన్నసముద్రములనుదాటి యూరోపుదృష్టి ప్రసరించెను. ప్రపంచములో తన స్థానమెట్టిదో గ్రహించెను. ప్రపంచ వర్తకము, అన్యదేశములపై అధికారము చేసికొనుటకు అవకాశ మెంతయో వున్నట్లు కనిపెట్టెను. బూర్జువాజీ ఎక్కువ ప్రబలమయ్యెను. పడమటి యూరోపులో ఫ్యూడల్‌పద్ధతి నానాటికీ అభివృద్ధి కాటంకముగా వుండెను.

ఫ్యూడల్‌పద్ధతి అప్పటికే పాతబడిపోయింది. ఈ పద్ధతిలో పరమార్థము, కర్షకజనులను పీడించి లాభము పొందుటయే. బల వంతముగా చాకిరి చేయించుకొనుట, చేసినపనికి కూలి ఇవ్వకుండుట, ప్రభువులకు అనేక విధములుగా మామూళ్ళను, ధనమును చెల్లించుట ఈ ప్రభువే న్యాయాధికారియై యుండుట—ఇవి ఫ్యూడల్‌పద్ధతి లక్షణ ములు. కర్షకుల కష్టములు దుర్భరముగా వుండుటచేత తరుచుగా కర్షకుల అల్లరులు, యుద్ధములు తటస్థించుచుండెను. ఈ కర్షకయుద్ధ ములు వ్యాపించెను. అవి ఎక్కువ తరుచుగా వచ్చుచుండెను. ఆర్థిక విప్లవము యూరోపులో అనేక ప్రాంతములందు సంభవించెను. దీనికి ఫలముగా ఫ్యూడల్‌పద్ధతిస్థానే బూర్జువా (మధ్యతరగతి ప్రజల) రాజ్యము వచ్చెను. ఇది వచ్చుటకు ముఖ్యకారణము కర్షకుల తిరుగు బాట్లును, ఫ్రాంసులోని జాక్‌రీలును.

కాని ఈ మార్పులు త్వరితముగా వచ్చినవని అనుకోవద్దు. అవి వచ్చుటకు చాలాకాలము పట్టెను. యూరోపులో అంతఃకలహములు చాలాకాలముపాటు చెలరేగెను. ఈ కలహములవల్ల యూరోపులో అధికభాగము పాడైపోయెను. అప్పుడు సంభవించినవి కర్షకులయుద్ధ

ములేకాదు. కాతలిక్కులకూ, ప్రొటెస్టెంటులకూ మతయుద్ధములూ, స్వాతంత్ర్యసిద్ధికి చేసిన జాతీయయుద్ధములూ (నెదర్లాండులలో), రాజు నిరంకుశత్వముపై బూర్జువాజి చేసిన తిరుగుబాటూకూడా సంభవించి నట్లు ముందుముందు తెలిసికొందుము. ఇదంతా నీకు తెలియడంలేదు కదూ? అవును ఇదంతా క్లిష్టంగా వున్నమాట వాస్తవమే. కాని మనము పెద్దసంభవములనూ, ఉద్యమములనూ పరిశీలించినప్పుడు ఈ విషయములను అర్థం చేసుకోగలము.

ముఖ్యముగా గమనించవలసిన విషయము—కర్షకులు చాలా కష్టపడుతున్నారన్న విషయము. ఇందువల్లనే కర్షకుల తిరుగుబాట్లు వచ్చినవి. రెండవ విషయము బూర్జువాజీ తలయెత్తుటా, ఉత్పత్తి పెరుగుటా. సరుకులను ఉత్పత్తిచేయుటకు ఎక్కువ శ్రమపడుటవల్ల వర్తకముకూడా పెరిగెను. గుర్తించవలసిన మూడవ విషయము భూస్వాములలో అందరికన్న పెద్ద భూస్వామి-చర్చి. స్వప్రయోజన మును సాధింప స్థిరాభిమాన మమితముగా చర్చికుండుట సహజము. అందువల్లనే ఫ్యూడల్ పద్ధతి జరుగుచుండవలెనని అది ఆసించి యుండెను. తనభాగ్యమునకూ, తనఆస్థికీ భంగము కల్పించు, ఆర్థిక మైన యెట్టిమార్పూ దానికిష్టములేదు. అందువల్లనే రోములో మత సంబంధమైన తిరుగుబాటు తలయెత్తినప్పుడు అది ఆర్థికవిప్లవమునకు అనుగుణముగా వుండెను.

గొప్పదగు ఈఆర్థికవిప్లవముతోపాటు, సంఘములో, మతములో రాజకీయములలో అన్ని విధములగు మార్పులూ వచ్చెను. పదహారు, పదిహేడవ శతాబ్దముల కాలమునందున్న యూరోపును దూరమునుం డుండి విశాలదృష్టితో చూచినట్లయితే, ఈ ఉద్యమములూ, ఈ మార్పులూ ఒకదానితో ఒకటి సంబంధము కలిగియుండి కలిసివున్నట్లు నీవు గ్రహించగలవు. ఈ కాలమునకు సంబంధించిన మూడు ఉద్యమ ములను ముఖ్యముగా పేర్కొనుచుందురు. అవి—పునరుజ్జీవనము

(Renaissance), రిఫర్మేషను (Reformation), విప్లవము (Revolution). కాని మనము జ్ఞాపకముంచుకోవలసిన విషయమొకటి కలదు. ఈ ఉద్యమములవెనుక ఆర్థిక సంక్షోభమూ, దుఃఖమూ వుండెను. దీనికి ఫలితమే ఆర్థికవిప్లవము. ఇదే మార్పులన్నింటిలోనూ ముఖ్యమైనది.

పునరుజ్జీవనము కారణముగా విద్య తలయెత్తెను. అనగా కళలు వికసించెను. విజ్ఞానశాస్త్రము, సారస్వతము అభివృద్ధి చెందెను. యూరోపుదేశములందలి భాష వృద్ధినందెను. రోమన్ చర్చిపై తిరుగుబాటే రిఫర్మేషను. దుష్టమార్గము లవలంబించుచున్న చర్చిపై ప్రజలు చేసిన తిరుగుబాటు అది; తనపై అధికారము చెలాయించ బూనుకొన్న పోపుపై యూరోపురాజులు చేసిన తిరుగుబాటుకూడ అది; మూడవ విషయము—లోనుండి చర్చిని సంస్కరించుటకు చేసిన ప్రయత్నముకూడా అది. రాజులను హద్దులలో నుంచుటకునూ, వారి అధికారమును తగ్గించుటకునూ బూర్జువాజీ లేవనెత్తిన రాజకీయ కలహమే విప్లవము.

ఈ ఉద్యమము లన్నింటికీ వెనుక వేరొక విశేషమున్నది. అది అక్షరముద్రణ. చీనా వారినుండి అరబ్బులు కాగితము చేయుట నేర్చుకొనిరనియు, వారినుండి యూరోపు అభ్యసించెననియు చెప్పియుంటిని జ్ఞాపకమున్నదా? అయినా కాగితము సమృద్ధిగా తయారగుటకును, చౌకగా దొరుకుటకును చాలాకాలము పట్టినది. పదిహేనవశతాబ్ది చివర భాగమున యూరోపు అనేక ప్రాంతాలలో—హాలెండు, ఇటలీ, ఇంగ్లాండు హంగరీ వగైరా—పుస్తకములు ముద్రించుట ప్రారంభించిరి. అక్షర ముద్రణా, కాగితమూ సర్వసామాన్యముకాక పూర్వము ప్రపంచ మెట్లుండెనో ఊహించుకొనుము. మనము కాగితములకూ, పుస్తకములకూ ఎంతో అలవాటుపడి ఉండడంవల్ల అవిలేని ప్రపంచం ఎట్లుండేదో ఊహించుకోవడమే కష్టము. అచ్చు పుస్తకములు లేనిదే అనేకులకు చదువను వ్రాయను నేర్పుట అసాధ్యమన్నమాటే. అంతకుముందు

పుస్తకములు ఎంతో కష్టపడి మాతృకనుండి వ్రాసుకొనే వారు. అట్టి గ్రంథములు ఎంతమంది కుండగలవు? విద్యాబోధ చాలావరకు నోటితోనే జరుగుచుండెను. విద్యార్థులు సమస్త విషయములూ కంఠస్థము చేసుకోవలసి వచ్చేది. ఇప్పుడుకూడా కొన్ని పాఠశాలలలోనూ, మక్తాబులలోను అట్టివిధముగానే జరుగుచున్నది.

కాగితము, ముద్రణ ప్రవేశబెట్టుటతోడనే గొప్పమార్పు వచ్చినది. అచ్చుపుస్తకములు వచ్చినవి—బడి పుస్తకములు, ఇతర పుస్తకములు త్వరలోనే చదువను, వ్రాయను నేర్చినవారి సంఖ్య పెరిగినది. చదివిన కొద్దీ జనులు ఆలోచన ఎక్కువగా చేతురు (ఆలోచన పురిగొల్పే మంచి పుస్తకములు చదివినప్పుడే ఇది జరుగును కాని ఈ కాలములో వచ్చుచున్న తుక్కుపుస్తకములు చదువుటవల్ల కాదు). ఆలోచన చేసినకొద్దీ అప్పుడున్న పరిస్థితులను పరిశీలించడము, వాటిని విమర్శించడము జరుగుతుంది. ఇందువల్ల వర్తమాన కాలమున అమలులోనున్న పద్ధతి నెదుర్కోవలసివచ్చును. మార్పుకెన్నడునూ, అజ్ఞాన మిష్టపడదు. రానున్నది తెలియదు కాబట్టి భయపడును. పాత పుంతలనది వదలదు—అవి యెంత దుర్భరముగా వున్నాసరే. గ్రుడ్డిగా అది ఏదో ముందుకుపోవును. కాని సరియైన చదువువలన జ్ఞానము వచ్చును. జ్ఞానము మన కన్నులను తెరుచును.

కాగితము, ముద్రణ కారణముగా ఇట్లు కన్నులు తెరుచుకొనుటవల్లనే, మనము ప్రసంగించుకొనుచున్న మహోద్యమములన్నీ వచ్చుటకు వీలైనది. తొట్టతొలుత ముద్రింపబడిన పుస్తకములు బైబిలులు. అంతదాక లాటిన్ భాషలోని బైబిలునే విన్న అనేకులకది అర్థము కాలేదు. ఇప్పుడు వారా గ్రంథమును తమ మాతృభాషలోనే చదువుకోగలిగిరి. ఇట్లు చదువుకొనుటవల్ల వారికి విమర్శచేసే బుద్ధి కలిగింది. పురోహితులపై అంతగా ఆధారపడవలసిన అవసరము లేకపోయెను. బడిపుస్తకములుకూడా ఎన్నో ముద్రింపబడినవి. ఈ కాలమునుండియు

యూరోపులోని భాషలన్నియు త్వరత్వరగా అభివృద్ధి చూపినవి. లాటిన్ భాష ఈ కాలమువరకు ఆభాషలను మరుగుపరచెను.

ఈ కాలమున యూరోపుచరిత్ర పలువురు మహాపురుల పేర్లతో నిండియుండెను. ముందుముందు కొన్నిపేర్లు మనము తెలుసుకొందుము. ఒక దేశముకాని, ఒక ఖండముకాని తాను ఒదిగివున్న గూడును, తన అభివృద్ధి నాటంకపరచుగూడును బేధించుకొని బయట పడితే అది అనేక మార్గములలో అభివృద్ధి శీఘ్రముగా చెందును. యూరోపులో ఇట్లు జరిగెను. ఈ కాలమునాటి యూరోపు చరిత్ర ముచ్చటగాను, జ్ఞానదాయకముగాను వుండును. ఇందుకు కారణము ఆర్థికముగానూ, ఇతిరవిధములుగానూ వచ్చు మార్పులు. ఈ కాలము నాటి హిందూదేశ చరిత్రతోగాని, చీనా చరిత్రతోగాని దీనిని పోల్చి చూతుము. నేనిదివరలో చెప్పినట్లు ఈ రెండు దేశములును అనేక విధములుగా యూరోపుకన్న ముందున్నవి. కాని వారిచరిత్రలో చురుకుదనము కనిపించును. ఇండయాలోనూ, చీనాలోనూ మహారాజులూ, మహా పురుషులూ వుండిరి. ఉత్కృష్టమైన సంస్కృతి అందు కలదు. కాని, ముఖ్యముగా ఇండియాలో. ప్రజాసామాన్యము స్తబ్దముగా, నిర్వీర్యముగా వున్నట్లు కనిపించుచుండిరి. రాజులు మారినా వారు కిక్కురుమనకుండా వుండేవారు. వారు చాలావరకు లొంగి వున్నట్లు తోస్తుంది. విధేయత చూపులు అధికంగా నేర్చుకున్నారు. అందువల్ల అధికారాన్ని ఎదుర్కొ లేదు. ఇట్లు వారిచరిత్ర ఇంపుగా అప్పుడప్పుడున్నా అది జరిగిన విషయములను, ఏలిన రాజులను గురించి మాత్రమే చెప్పునుకాని ప్రజల ఉద్యమములగురించి అది చెప్పదు. చీనా విషయంలోకూడా ఇది నిజమేమో నాకు బాగా తెలియదు. కాని ఇండియా విషయంలో మాత్రము చాలావందల సంవత్సరములవరకూ ఇది నిజముగా ఇట్లే వుండెను. మన ప్రజలిట్టి దౌర్భాగ్య పరిస్థితులలో ఉండబట్టే ఈ కాలములో మనకు అనేకకష్టములు తటస్థించినవి.

ఇండియాలో మనము గమనించు వేరొకవిశేషము—వెనుకచూపే గాని, ముందుచూపు లేకుండుట. మన మొకప్పు డధిష్ఠించిన శిఖరముల మీదనే చూపుగాని, అధిష్ఠించగోరే శిఖరములపై చూపులేకుండుట. ఇట్లు మనప్రజలు గతమును తలుచుకొని నిట్టూర్పులు పుచ్చుచున్నారు. ముందుకు పోవుటకు బదులు ఎవరు ఆజ్ఞాపించినాసరే వారి ఆజ్ఞలు శిరసావహిస్తున్నారు. పర్యవసానమున సామ్రాజ్యములు నిలువబడి యుంట అంతగా స్వశక్తివల్లకాదు. తాము అధికారము నెరపే దేశ ప్రజల బానిస బుద్ధిమీదనే అవి ఆధారపడి వున్నవి.

## 83

# పునరుజ్జీవనము

ఆగస్టు 5, 1932

యూరోపులో వ్యాపించుచున్న సంక్షోభమునుండీ, దుర్భరకష్టములనుండీ పునరుజ్జీవనమునే చక్కని పుష్పము వెలిసింది. ఇటలీ భూమిలో అది మొట్టమొదట పుట్టింది. ఆవేశము కొరకుసూ, పుష్టికినీ అది శతాబ్దులగుండా ప్రాచీన గ్రీసుపై చూపు ప్రసరించింది. గ్రీసు నుంచి అది సౌందర్యోపాసన చేయడం నేర్చుకొన్నది. దేహ సౌందర్యమునకు అది అంతకన్న గంభీరమైనట్టిన్నీ, మానసికమైనట్టిన్నీ, ఆత్మ సంబంధమైనట్టిన్నీ ఒక విశేషాన్ని జోడించింది. ఇది పట్టణములలో జరిగిన వికాసము. ఉత్తర ఇటలీలోని నగరములు దానికి ఆశ్రయ మిచ్చినవి. ముఖ్యముగా తొలినాటి పునరుజ్జీవనమునకు ఫ్లారెంసు పుట్టినిల్లు.

పదమూడు, పధ్నాలుగు శతాబ్దులలో ఫ్లారెన్సు అప్పుడే ఇద్దరు మహాకవులను—డాంటి, పెట్రార్కు అనువారిని—కన్నది. మధ్య యుగముల కాలములో యూరోపునకది చాలాకాలముపాటు ఆర్థిక రాజధానిగా వుండెను. అక్కడ అప్పిచ్చే పెద్ద షావుకార్లు కూడేవారు.

అది యొక చిన్న ప్రజాప్రభుత్వరాజ్యము. ప్రజలు ధనవంతులే కాని అంతగా మంచివారుకారు. వారు తమలో ప్రసిద్ధులైనవారినే అగౌరవ పరచుచుండిరి. దానిని "చంచలయగు ఫ్లారెంసు" అనేవారు. సాహుకార్లు వున్నప్పటికీ, నిరంకుశులు వున్నప్పటికీ, ఆ నగరమున 15 వ శతాబ్ది రెండవభాగములో ముగ్గురు అసాధారణ పురుషులు అవతరించిరి. లియొనార్డొడావించి, మైకేల్ యాంజలొ, రాఫేల్. వీరు ముగ్గురూ చాలా గొప్పచిత్రకారులూ, కళోపాసకులున్నూ. లియొనార్డొ, మైకేల్ యాంజలొ ఇతర విద్యలలోకూడ గొప్పతనమును సాధించిరి. మైకేల్యాంజలొ గొప్పశిల్పి. ఒకే చలువరాతిని మలచి అతడు గొప్ప విగ్రహముల తయారుచేసెను. అతడు వాస్తువిద్యలో ఆరితేరినవాడుకూడా. రోములోని సేంటుపీటరు కెతిడ్రలుకు చాలా పరకాతదే ఆకారమిట్లుండవలెనని నిర్ణయించెను. అతడు చిరకాలము జీవించెను. సుమారు 90 సంవత్సరములు బ్రదికెను. మరణమాసన్న మగువరకూ అతడు సేంటుపీటరు కెతిడ్రలు పనిలోనే మునిగివుండెను. అతడు దురదృష్టవంతుడు. పైకి కనిపించు వస్తువుల వెనుక నేమున్నదో తెలిసికొనుటకై అతడు ప్రయత్నించుచుండెను. ఎప్పుడునూ ఆలోచన చేయుచుండెను. అత్యద్భుత కార్యములుచేయ పూనుకొనుచుండెను. అతడొకప్పుడు చెప్పినమాట ఏమనగా "చిత్రించుట చేతులతోకాదు, తలతో".

ఈ ముగ్గురిలోనూ లియొనార్డొ వయస్సున పెద్దవాడు. అనేక విధములుగా అతడు గొప్పవాడు. ఆ కాలముననున్న పురుషులందరిలోనూ మిక్కిలి అసాధారణ ప్రజ్ఞగలవాడతడు. ఆ కాలమున యెందరో గొప్పవాళ్లు వుండేవారన్నమాట మరిచిపోకు. అతడొక గొప్ప చిత్రకారుడు. గొప్పశిల్పి. అతడు గొప్ప తత్వవేత్త, విజ్ఞానశాస్త్రజ్ఞుడూ కూడా. ఎప్పుడూ ప్రయోగములుచేస్తూ, కార్యములకు కారణములు కనుగొనుట కెప్పుడూ ప్రయత్నములుచేస్తూ అతడు వుండెను. నవీన

విజ్ఞానశాస్త్రమునకు పునాదులువేసిన గొప్ప శాస్త్రజ్ఞులలో అతడు ప్రథముడు. "ప్రపంచములో ప్రతిచోటను నీవు నేర్చుకోదగిన విషయమేదో నీవు కనుగొనుటకు ప్రకృతి దయతో నీకు సహాయము చేయును" అని అతడనెను. అతడు స్వయంకృషివల్ల విద్యనేర్చెను. ముప్పైయేయేట అతడు లాటిన్ భాషా, గణితశాస్త్రమూ స్వయముగా అభ్యసించ మొదలుపెట్టెను. అతడొక గొప్ప ఇంజినీరుగాకూడ తయారయ్యెను. శరీరమున రక్తము ప్రసరించుచున్నదన్న విషయము మొదట కని పెట్టినివాడతడే. శరీర నిర్మాణమునుచూచి అతడు ముగ్ధుడయ్యెను. "మోటుమనుష్యులూ, దురభ్యాసముల కలవడినవారూ, వివేకరహితులూ మానవ శరీరమువంటి చక్కని సాధనము నుపయోగించుట కర్హులుకారు. ఈ దేహ నిర్మాణమెంత క్లిష్టమైనది? ఎన్నివిధములుగా దీనిని ఉపయోగించవచ్చును? అట్టి మోటుమనుష్యులకు వుండదగ్గది ఒక సంచి మాత్రమే—తిన్న అన్నము పడుటకును, పడ్డది బయటకు పోవుటకును పనికివచ్చేది. ఎందువల్లనంటే అట్టివారు వట్టి అన్నవాహికలు మాత్రమే!" అతడు శాకాహారి. జంతువులన్న అతనికెంతో ప్రీతి. మార్కెట్టుకుపోయి పంజరములలోని పక్షులనుకొని వెంటనే వాటిని విడిచిపెట్టుట అతని అలవాటు.

అన్నిటికన్న ఆశ్చర్యకరమగు విషయము అతడు గాలిలో ఎగురుటకు చేసిన ప్రయత్నము. అతడు సఫలుడు కాలేదుకాని చాలావరకు విజయోన్ముఖుడయ్యెను. అతని సిద్ధాంతములనూ, ప్రయోగములనూ అతని అనంతరం కొనసాగించే వారెవరూ లేకపోయారు. అతని తరువాత లియొనార్డోవంటివాళ్లు మరిఇద్దరు వుండివుంటే మన నేటికాలపు విమానము రెండుమూడు వందల సంవత్సరములక్రితమే కనిపెట్టబడి వుండేది. ఈ వింత అద్భుత పురుషుడు 1452 నుండి 1519 వరకూ జీవించియుండెను. అతని జీవితము "ప్రకృతిలో సంభాషణము" అని చెప్పుతారు. అతడెప్పుడును ప్రశ్నలు వేసుకొనుచునే వుండెను. ప్రయోగ

ములద్వారా సమాధానములు పొందుటకు ప్రయత్నించుచునే వుండెను. అతడు నిత్యమూ ముందుకు సాగిపోవలెననే ప్రయత్నము. భావిని పట్టుకోవలెననే ప్రయత్నము.

ఫ్లారెంసులోని ఈ ముగ్గురు పురుషుల్ని గురించీ, అందు ముఖ్యముగా నాకిష్టుడైన లియొనార్డోను గురించీ వ్రాసియున్నాను. ఫ్లారెన్సు ప్రజాప్రభుత్వ వృత్తాంతము అట్టే సంతోషకరమైనదికాని, జ్ఞానప్రదమైనదికాని కాదు. కుట్రలతో, నిరంకుశులతో, దుష్టపరిపాలకులతో అది నిండియుండెను. కాని సాహుకార్లు ప్రజలను పీడిస్తున్నా, ఇతర విధముగా దౌర్జన్యము ప్రబలివున్నా, ఫ్లారెన్సు మహాపురుషులను కన్న భూమి కాబట్టి దాని లోపములను మనము క్షమించవచ్చును. ఆ మహా పురుషుల సువాసన ఆ నగరము నింకను వీడలేదు. ఈ అందమైన నగర వీధులగుండా నీవు నడుస్తూ వున్నప్పుడుకాని, ప్రాతకాలపు వంతెనల కిందనుంచి ప్రవహించే మనోహరమైన ఆర్నోనదిని చూచి నప్పుడుగాని మంత్రముగ్ధ వగుదువు. భూతకాలము విస్పష్టముగా కన్నులకు కట్టినట్లగపడును. నీకళ్ళముందు డాంటి నడిచిపోతాడు. అతని వెనుకే అతడు ప్రేమించిన బియాట్రిస్, సువాసనలామె వెన్నంటిరాగా, నడిచిపోతుంది. ఆలోచనా నిమగ్నుడై జీవితరహస్యములూ, ప్రకృతి రహస్యములూ తలపోయుచు ఇరుకు వీధులగుండా లియొనార్డో కూడా నడిచిపోతున్నట్లు తోస్తుంది.

పదిహేనవ శతాబ్దము మొదలుకొని పునరుజ్జీవనము ఇటలీలో వికసించింది. క్రమక్రమముగా అది ఇతర పాశ్చాత్యదేశాలకి పాకింది. గొప్పశిల్పులు, చిత్రకారులు జీవకళ ఉట్టిపడునట్లు శిలలు మలిచిరి. కాన్వాసు గుడ్డలపై చిత్రములు చిత్రించిరి. యూరోపులోని చిత్రశాలల నిండా, వస్తు ప్రదర్శనశాలలనిండా వారి చిత్రములు, శిల్పవిగ్రహములు నేడు చూడవచ్చును. పదహారవ శతాబ్దాంతమునకు ఇటలీలోని కళా పునరుజ్జీవనము క్షీణదశకువచ్చెను. పదిహేడవ శతాబ్దిలో హాలెండులో

గొప్ప చిత్రకారులు పుట్టిరి. వారిలో మిక్కిలి ప్రసిద్ధుడు "రెంబ్రాంటు." ఈ కాలమందే స్పెయినులో "వలాస్కెత్" వుండెను. ఇక ఎక్కువ పేర్లు చెప్పను. వారెందరో వున్నారు. ప్రముఖ చిత్రకారులను గురించి తెలిసికోవలెననే కుతూహలం నీకుంటే చిత్రశాలలు దర్శించి వారి చిత్రములను చూడుము. వారి పేర్లంత ముఖ్యముకాదు. వారి కళా, వారు సృష్టించిన సౌందర్యము—ఇవే మనకు సందేశము నిచ్చుచున్నవి.

ఈ కాలములో—అనగా 15 వ శతాబ్దినుంచి 17 వ శతాబ్ది వరకూ—విజ్ఞానశాస్త్రము క్రమముగా వృద్ధినందుచుండెను. ప్రాముఖ్యమును వహించుచుండెను. అది చర్చితో పెద్దపోరాటమును పెట్టుకోవలసి వచ్చింది. ఆలోచించుట, ప్రయోగములు చేయుట చర్చికి ఇష్టములేనిపని. దాని అభిప్రాయము ప్రకారము ప్రపంచమునకు మధ్యగా భూమివున్నది. దానిచుట్టూ సూర్యుడు తిరుగుతున్నాడు. నక్షత్రములు అకాశములోని కదలని చుక్కలు మాత్రమే. దీనికి వ్యతిరేకంగా చెప్పినవాడు భిన్నమతస్థుడే. అట్టివానిని ధర్మవిచారణసభ—ఇన్క్విసిషన్—విచారణ చేయవచ్చును. అయినప్పటికీ పోలెండు దేశస్థుడొకడు, కోపర్నికస్ అనువాడు పై అభిప్రాయము తప్పని చెప్పెను. భూమి సూర్యునిచుట్టును తిరుగుచున్నదని రుజువుచేసెను. ఈ విధముగా అతడు విశ్వమునుగూర్చిన నేటి నమ్మకములకు పునాదులు వేసెను. అతడు 1473 నుండి 1543 వరకూ జీవించియుండెను. ఇట్టి విప్లవోచితమైన, మతవిరుద్ధమైన అభిప్రాయములు పెట్టుకొన్నప్పటికీ అతడు చర్చి క్రోధమునకు గురికాకుండా యెట్లో తప్పించుకొనెను. అతని తరువాత వచ్చినవారంత అదృష్టవంతులుకారు. జొర్డానో బ్రూనో అను ఇటలీ దేశస్థుడు, భూమి సూర్యునిచుట్టు తిరుగుచున్నదనియూ, నక్షత్రములుకూడా సూర్యులే అనిన్నీ చెప్పినందుకు 1600 సంవత్సరమున రోములో నిండు ప్రాణముతో వుండగానే దహనము చేయబడెను. అతని సమకాలికుడున్నూ, దూరదర్శని యంత్రమును

నిర్మించినవాడున్నూ అయిన గెలీలియొకూడా చర్చిచేత భయపెట్టబడెను. కాని బ్రూనోకున్నంత మనోదార్ఢ్య మతనికిలేదు. చెప్పినది కాదని తప్పించుకోవడమే మంచిదని అతనికి తోచింది. కాబట్టి అతడు తాను పొరపాటు చేసినట్టు వప్పుకున్నాడు. భూమి విశ్వమునకు మధ్యనే వున్నదనిన్నీ దానిచుట్టూ సూర్యుడు తిరుగుచున్నాడనిన్నీ చెప్పాడు. అయినప్పటికీ అతడు చెరసాలలో పాపవిమోచనార్థమై తపస్సు చేసుకొంటూ కొంతకాలము గడపవలసి వచ్చింది.

పదహారవ శతాబ్దిలో ప్రసిద్ధివహించిన శాస్త్రజ్ఞులలో హార్వే ఒక్కడు. శరీరముగుండా రక్తము ప్రసరించుచున్నదని అతడు రుజువు చేసెను. పదిహేడవ శతాబ్దిలో శాస్త్రజ్ఞులలో ప్రముఖుడు ఒకడు వుండెను. అతడు ఐజాక్ న్యూటన్. అతడొక గొప్ప గణిత శాస్త్రజ్ఞుడు. అతడు గురుత్వాకర్షణసూత్రమును (Law of Gravitation) కనిపెట్టెను. వస్తువులు భూమిపై పడుటకు కారణమది చెప్పను. ఇట్లాతడు మరియొక ప్రకృతి రహస్యమును గ్రహించెను.

ఇది—కొంచెమో, గొప్పో విజ్ఞానశాస్త్ర విషయము. ఈకాలములో సారస్వతముకూడా అభివృద్ధి నందెను. దేశమున పొడచూపిన నూతన చైతన్యము యూరోపియన్ భాషలపైకూడా తన ప్రభావమును చూపెను. కొంతకాలముబట్టి ఈ భాషలు వుండెను. ఇటలీలో గొప్ప కవులు పుట్టిరని తెలిసికొంటిమి. ఇంగ్లాండులో చాసరు అను కవి వుండెను. కాని యూరోపులో విద్యావంతులును, చర్చియును లాటిను లోనే మాట్లాడుకొనుచుండిరి. లాటిను భాషలోని గ్రంథములు పఠించుచుండిరి. ఈ లాటినుభాష మిగిలిన భాషలను మరుగుపరిచెను. ఈ భాషలు పాటకజనుల భాష:—అవి పాటకభాషలు (Vernaculars). హిందుదేశమందలి భాషలను నేడుకూడ కొందరు పాటక భాషలనుట వింతగా వున్నది. అట్టి పాటకభాషలలో గ్రంథములు వ్రాయుట ప్రతిష్ఠాభంగము. కాని నూతన చైతన్యమున్నూ, కాగితములున్నూ, అక్షర

ముద్రణమున్నూ కారణముగా ఈభాషలు అభివృద్ధి చెందినవి. ఇటాలియన్‌భాష మొట్టమొదట అభివృద్ధికి దారితీసెను. తరువాత ఫ్రెంచిభాష, ఇంగ్లీషుభాష, స్పానిష్‌భాష, చివరకు జర్మనుభాష అందుకొన్నవి. ఫ్రాంసులో యువక సమితియొకటి, 16 వ శతాబ్దిలో లాటినులోకాకుండా తమ మాతృభాషలో గ్రంథములు వ్రాయుటకు సంకల్పించెను. తమ "పాటక భాష"ను వృద్ధిపరచ సంకల్పించెను. ప్రశస్తమైన సాంస్వతము పుట్టుటకది సాధనముగా పనికివచ్చు పర్యంతము దానిని వృద్ధిచేయ సంకల్పించెను.

ఇట్లు యూరోపులోని భాషలు వృద్ధిచెందినవి. అవి మాధుర్యమునార్జించినవి. శక్తివంతమైనవి. నేటి చక్కని భాషలుగా తయారైనవి. ప్రసిద్ధరచయితల పేర్లన్నియు నేను చెప్పనుకాని కొద్ది పేర్లుమాత్రము చెబుతాను. ఇంగ్లాండులో షేక్స్పియరు. 1564 నుండి 1616 వరకు అతడుండెను. అతని తరువాత 17 వ శతాబ్దిలో మిల్టనుండెను. "పారడైజు లాస్టు" అనే కావ్యాన్ని వ్రాసిన అంధకవి యతడు. ఫ్రాంసులో తత్త్వవేత్తయగు డాకార్టును, నాటకకర్తయగు మోల్యార్‌ను వుండిరి. వీరిద్దరును 17 వ శతాబ్దివారే. మోల్యార్ కామెడి ఫ్రాంచెయెజ్ అనే గొప్ప నాటకశాలను పారిస్‌లో స్థాపించెను. షేక్స్పియరు సమకాలికుడు స్పెయినులో సెర్వాన్‌టెజ్ అనువాడు. అతడు డాన్ క్విక్సోటు అను నవలవ్రాసెను.

నేను వేరొకపేరు పేర్కొందును. అతడు గొప్పవాడని కాదు, అందరికీ బాగా తెలిసినవాడని. ఇతనిపేరు మాక్యావెల్లి. ఇతడు ఫ్లారెంసువాడు. 15, 16 శతాబ్దులలో అతడొక సామాన్య రాజ్యతంత్రజ్ఞుడు. "ది ప్రింస్" (రాజు) అనే గ్రంథాన్నాతడు రచించెను. అది ప్రసిద్ధగ్రంథమైనది. ఆనాటి రాజ్య తంత్రజ్ఞులయొక్కయు, రాజులయొక్కయు అభిప్రాయములు ఈ గ్రంథమునుబట్టి మనము గ్రహించవచ్చును. మతము ప్రభుత్వమునకు ప్రధానాంగమని మాక్యావెల్లి

ఈ గ్రంథమున చెప్పుచున్నాడు. ప్రజలను సన్మార్గమున పెట్టుటకుకాదు ఈ మతము. వారిని పాలించుటకును, వారిని అణచిపెట్టుటకును ఇది పనికివచ్చును. తాను నమ్మని మతమునైననూ పోషించుట రాజన్న వాని ధర్మము.'' మాక్యావెల్లి చెప్పుచున్నాడు, "రాజన్నవానికి మానవునివలె, పశువువలె, సింహమువలె, నక్కవలె నటించుట తెలిసియుండవలెను. తనకు ఎదురుతిరుగునప్పుడు తానుచేసిన వాగ్దానము ప్రకారము చెయ్యకూడదు; ఎప్పుడును న్యాయబుద్ధితో నుండుట చాలా నష్టదాయకమని నేను చెప్ప సాహసింతును; సరికదా భక్తిభావముతోనున్నట్లూ, మతవిశ్వాసము కలిగియున్నట్లూ, దయతోనున్నట్లూ కనిపించుట లాభదాయకము. ధర్మముగా నున్నట్లు కనిపించుటకన్న లాభదాయకమగు విషయము వేరొకటిలేదు.''

చాలాపాడుగా వున్నది కాదూ? ఎంత గొప్ప దుర్మార్గుడైతే అంత గొప్ప రాజన్నమాట! ఆ రోజులలో యూరోపులోని సామాన్య రాజుల చిత్తవృత్తి ఈవిధంగా వుండబట్టే అక్కడ అన్నన్ని ఎడతెగని తొందరలు పుట్టినవి. అంత వెనుకటి కాలమునకు వెళ్ళడమెందుకు? నేటికాలములో సామ్రాజ్యతత్వ రాజ్యములు మాక్యావెల్లి రాజువలెనే ప్రవర్తించుచున్నవి. ధర్మ ఆచ్ఛాదనము వెనుక దురాశ, క్రౌర్యము, అన్యాయబుద్ధి పొంచున్నవి. నాగరికతయను మెత్తని చేతి తొడుగు క్రింద ఎర్రని మృగనఖమున్నది.

# 84

# ప్రొటెస్టెంటుల మత విప్లవము : కర్షకుల తిరుగుబాటు

ఆగస్టు 8, 1932

15, 16, 17 వ శతాబ్దులలోని యూరోపును గురించి నీకేన్నో జాబులు వ్రాసి యున్నాను. మధ్యయుగములు గడచుటను గురించీ, కర్షకులకష్టములనుగురించీ బూర్జువాజీతలయెత్తుటను గురించి, అమెరికాను కనుగొనుటగురించీ, తూర్పుకు సముద్రమార్గములను కనిపెట్టుట గురించి, కళాభివృద్ధిని గురించీ విజ్ఞానశాస్త్రాభి వృద్ధినిగురించీ, యూరోపులోని భాషల అభివృద్ధినిగురించీ, నీ కిదివరలో కొంత చెప్పియున్నాను. ఈ కాలమును గురించి ఇంకాచాలా విషయాలు చెప్పితేనే గాని సంపూర్ణ చిత్రము పూర్తికాదు. వెనుకటి రెండుత్తరములూ, సముద్రమార్గములను గురించిన ఉత్తరమూ, వ్రాస్తూన్న యీ ఉత్తరమూ, దీని తరువాత వచ్చే ఒకటి రెండు ఉత్తరములూ యూరోపులోని ఈ కాలమునకే చెంది యున్నవని జ్ఞాపక ముంచుకొనుము. వివిధోద్యమముల గురించీ, కార్యములగురించీ నేను విడివిడిగా వ్రాసినప్పటికీ అవి కొంచెము హెచ్చు తక్కువగా ఒకేమారు, ఒకేకాలమున తటస్థించినవి. ఒకటి ఇంకొక దానిని పురిగొల్పు చుండెను.

పునరుజ్జీవన కాలమునకు ముందే రోమన్ చర్చిసంఘములో విప్లవగర్జనలు వినవచ్చు చుండెను. యూరోపులోని రాజులున్నూ, ప్రజలున్నూ చర్చి నిరంకుశత్వమును అనుభవిస్తూ, కొద్దిగా గొణుగు కొంటూ, సంశయిస్తూ ఉండిరి. చక్రవర్తియైన ఫ్రెడరిక్కు II పోపుతో సంఘర్షణ పెట్టుకొన్నాడనిన్నీ, బహిష్కారమున్నా భయపడలేదనిన్నీ చెప్పియుంటిని జ్ఞాపకమున్నదా ? సంశయ చిహ్నములూ, అవిధేయతా

చిహ్నములూ రోముకు కోపకారణములైనవి. క్రొత్తగా తలయెత్తిన మతవైరుధ్యాన్ని అణచివేయవలెనని అది తీర్మానించుకొన్నది. ఇందు కొరకే ఇంక్విసిషన్ (ధర్మవిచారణ సభ) సృష్టింపబడినది. మత విరోధులనిచెప్పి దురదృష్టవంతులను దహనము చేసేవారు. స్త్రీలను సైతము మంత్రకత్తెలని పేరుపెట్టి యూరోపునందంతటా దహనము చేసేవారు. ప్రేగ్ నివాసియైన హస్ అనువానిని మోసముచేసి దహనము చేసిరి. పిమ్మట బొహీమియాలోని అతని అనుచరులు. "హస్సయిట్లు" అనువారు, విప్లవపతాకము నెత్తిరి. రోమన్‌చర్చిపై లేచిన ఈనూతన విప్లవభావమును ఇన్‌క్విసిషన్ చేయు చిత్రహింసలు అణచలేకపోయినవి. విప్లవము వ్యాపించినది. పెద్దభూస్వామి అనే కారణాన చర్చిపై కర్షకులకుండు వ్యతిరేకభావనకూడ ఇందుకు మద్దత్తుగా వుండెను. ఆత్మ లాభముకొరకు పలుతావులలో రాజులిట్టి భావాన్ని ప్రోత్సహించుచూ వచ్చిరి. చర్చికివుండుకొన్న పెద్దఆస్తిని గ్రహించవలెనని ఈర్ష్యా దృష్టుల దానిపై పరపుచుండిరి. రగులుకొంటూన్న అగ్నికి, పుస్తక ముద్రణమున్నూ, బైబిలుల ముద్రణమున్నూ తోడుగా వుండెను.

పదహారవశతాబ్ది తొలిభాగమున జర్మనీలో మార్టిన్ లూథర్ అనే పురుషుడు తలయెత్తెను. ఇతడే రోముపై చేసిన తిరుగుబాటుకు మహానాయకుడు కానున్నాడు. అతడొక క్రైస్తవ పురోహితుడు. అత డొకమారు రోమును దర్శించివచ్చెను. చర్చి దౌష్ట్యమునూ, భోగలాల సత్వమునూ కళ్లారాచూచి అతడు విముఖుడయ్యెను. ఈ వివాదము పెరిగి పెరిగి రోమన్ చర్చిని రెండు చీలికలుగాచేసెను. పడమటి యూరోపు రెండుపక్షములుగా విడిపోవునట్లు చేసెను. ఇవి మత పక్షములే కావు, రాజకీయ పక్షములుకూడా. రష్యాలోను, తూర్పు యూరోపులోను ప్రబలమైయున్న ఆర్థొడాక్సు గ్రీకుచర్చి ఈ వివాద ములో కలుగజేసుకొనలేదు. దీని అభిప్రాయము ప్రకారము నిజమైన మత సిద్ధాంతములకు రోము సుదూరముగా వున్నదనియే.

ఈవిధముగా ప్రాటస్టెంటు విప్లవము ప్రారంభమైనది. ప్రొటెస్టు అనే ఇంగ్లీషు పదమునకు అసమ్మతిని తెలుపుట అనిఅర్థము. రోమన్ చర్చి వివిధ సిద్ధాంతములపై తన అసమ్మతిని తెలిపినది గాన దానికి ప్రాటస్టెంటు అనే పేరు వచ్చినది. నాటినుండియు పడమటి యూరోపులో క్రైస్తవము రెండు ప్రధానశాఖలుగా వుండిపోయెను——రోమన్ కాతలిక్కు; ప్రాటస్టెంటు. కాని ప్రాటస్టెంటులు అనేక తెగలుగా చీలిపోయిరి.

చర్చిపై లేవనెత్తబడిన ఈఉద్యమమునకు రిఫర్మేషన్ అందురు. ఇది ముఖ్యముగా ప్రజల తిరుగుబాటు. చర్చియొక్క దుర్నీతీ, అధికారతత్వమూ సహించక చేసిన తిరుగుబాటు అది. దీనితోబాటు తమపై అధికారము చెలాయించవలెనని పోపుచేసే ప్రయత్నములను తుదముట్టించవలెనని రాజులనేకు లుద్దేశించిరి. రాజకీయ వ్యవహారములలో పోపు కలుగుజేసికొనుట వారికెంతమాత్రమూ సమ్మతముగాలేదు. రిఫర్మేషనుకు సంబంధించిన మూడవవిషయము ఏమనగా——చర్చిపై విశ్వాసము కలవారు, చర్చిలో ప్రవేశించిన దోషములను తొలగించవలెనని చేసిన ప్రయత్నము.

చర్చిలో ఫ్రాంసిస్కన్ సంఘమనిన్నీ, డొమినికన్ సంఘమనిన్నీ రెండు సంఘములున్నట్లు చెప్పితిని జ్ఞాపకమున్నదా? పదహారవ శతాబ్దిలో, మార్టిన్ లూథరు ప్రబలుడగుచున్న కాలమున, ఒక నూతన చర్చిసంఘము, ఇగ్నేషస్ ఆఫ్ లయోలా అనే స్పానియర్డుచే ప్రారంభించబడెను. దాని కతడు "ఏసు సంఘ"మనిన్నీ, అందలి సభ్యులకు జెస్యూట్లు అనిన్నీ పేరుపెట్టాడు. జెస్యూటులు చీనాదేశమును తూర్పు దేశములను దర్శించినట్లు చెప్పియున్నాను. ఈ "ఏసుసంఘము" అసాధారణమైనది. రోమన్ చర్చికిని, పోపుకును సమర్థముగా ఎల్లకాలమూ సేవచేయుటకై తదనుచరులకు శిక్షయిచ్చుట దాని ప్రధానోద్దేశము. వారిచ్చు శిక్ష చాలా కఠినమైనది. మిక్కిలి సమర్థులు, విశ్వాసపాత్రులు

అగు చర్చిసేవకులు అవిధముగా తయారైరి. చర్చిపై వారికెంతో విశ్వాసముండెను. ఇతర ఆలోచనలు లేకుండా చర్చి ఏమి చెప్పినప్పటి కిన్నీ దానిని గుడ్డిగా ఆచరించేవారు. వారు వారి సర్వస్వమునూ చర్చికే అర్పించారు. చర్చికి లాభము కలుగునని తోచినప్పుడు, వారు ఇష్ట ముతో అట్టిపనికై ఆత్మత్యాగము చేసేవారు. చర్చిసేవ యన్నప్పుడు వారెట్టి శంకలూ పెట్టుకోకుండా పనిచేసేవారని ప్రసిద్ధి వారికికలదు. చర్చికి శ్రేయస్సు చేకూర్చే ప్రతికార్యమూ న్యాయబద్ధమైనదే. అట్టి కార్యనులు దోషభూయిష్టమయినను ఇబ్బందిలేదు.

ఇట్టి అసాధారణ పురుషులు చర్చికిగట్టి ప్రాపుగా వుండిరి. దూర దేశములకు వారు చర్చిపేరును సందేశమును తీసికొనిపోయిరి. యూరో పులో చర్చి ప్రతిష్ఠ పెంపొందుటకు వారే కారణము. చర్చిని సంస్కరించవలెననే ఉద్యమము, లోపలినుండి పుట్టుకురావడంవల్లనూ, ప్రొట స్టెంటుల తిరుగుబాటు భయమువల్లనూ రోములో ఇప్పుడంతగా దుర్నీతి ప్రబలలేదు. ఇట్లు రిఫర్మేషన్ కారణముగా చర్చి రెండుశాఖలుగా చీలినది. లోపలినుండి దానిని కొంతవరకు సంస్కరించినది.

ప్రొటస్టెంటు విప్లవము విజృంభించినప్పుడు కొందరు రాజులును, రాజ కుమారులును ఒకపక్ష మవలంబించిరి. మరికొందరు రెండవ పక్ష మవలంబించిరి. ఇందుకు కారణము మతవిశ్వాసముకాదు. రాజ కీయములు, స్వలాభాపేక్ష, వారిట్లు చేయుటకు కారణము. ఆకాలమున పవిత్ర రోమన్ సామ్రాజ్యమునకు చక్రవర్తి, హాప్సుబర్గు కుటుంబము నకు చెందిన ఐదవ చార్లెసు. అతని తండ్రి తాతలు చేసుకొన్న వివాహ ములకు ఫలితముగా అతడు పెద్ద సామ్రాజ్యమునకు వారసయ్యెను. ఆస్ట్రియా, జర్మనీ (పేరుమట్టుకు), స్పెయిను, నేపిల్సు, సిసిలీ, నెదర్లాం డులు, స్పానిష్ అమెరికా—ఈ దేశములా సామ్రాజ్యములో చేరి యుండెను. ఆరోజులలో వివాహముద్వారా రాజ్యమును విస్తరించ జేసుకొనుట యూరోపులో పరిపాటిగా వుండెను. ఇందువల్లనే, ఎట్టి

ఘనతయులేని చార్లెసు సగముయూరోపు నేలుట తటస్థించినది. కొంత కాలమువరకు అతడు గొప్పవాడుగా పరిగణింపబడ్డాడు. అతడు ప్రొటస్టెంటులకు వ్యతిరేకముగా పోపుపక్ష మవలంబించ నిర్ణయించాడు. రిఫర్మేషన్ భావన సామ్రాజ్యభావనకు సరిపడదు. కాని చిన్న జర్మన్ రాజకుమారు లనేకులు ప్రొటస్టెంటుల పక్ష మవలంబించిరి. జర్మనీ అంతటిలోను రెండు కక్షలుండెను. ఒకటి రోమన్ కక్ష, రెండవది లూథరెన్ కక్ష. దీనికి ఫలితముగా జర్మనీలో అంతఃకలహము పుట్టెను.

ఇంగ్లాండులో బహుభార్యా ప్రియుడగు హెన్రీ VIII పోపుకు వ్యతిరేకపక్ష మవలంబించి ప్రొటస్టెంటుల నాదరించాడు. కాదు, తన్నాదరించుకొన్నాడు. చర్చి ఆస్తి నాతడు ఆసించాడు. రోముతో తెగతెంపులు చేసుకొన్న తరువాత అబ్బీ (Abbey) ల యొక్కయు, మఠములయొక్కయు, క్రైస్తవాలయముల యొక్కయు ఫలవంతమగు భూములను తనరాజ్యములో కలుపుకొన్నాడు. పోపుతో విరోధించుటకు వ్యక్తిగతమైన కారణమొకటి హెన్రీకుండెను. అతడు తన భార్యకు విడాకులిచ్చి వేరొకస్త్రీని వివాహమాడ గోరెను.

ఫ్రాంసులో పరిస్థితులు చిత్రముగా నుండెను. రాజుయొక్క ప్రధానామాత్యుడు, ప్రసిద్ధుడగు కార్డినల్ రీష్ల్యూ. ఇతడే క్రియకు రాజ్యపాలన చేయుచుండెను. రీష్ల్యూ ఫ్రాంసును రోముపక్షమున, పోపుపక్షమున చేరునట్టుచేసి అచ్చటి ప్రొటస్టెంటు మతమును అణచివేసెను. కాని, రాజకీయ కుతంత్రములెట్టివంటే, అతడే జర్మనీలో ప్రొటస్టెంటు మతమునకు ప్రోత్సాహమిచ్చెను. ఇట్లు చేసిన జర్మనీలో అంతఃకలహము కలుగుననీ, అందుచే జర్మనీ ఐకమత్యమును పోగొట్టుకొని దుర్బలమగుననీ అతని ఆశయము. ఫ్రాంసు, జర్మనీల అన్యోన్య విరోధము యూరోపు చరిత్రలో ఎడతెగని సూత్రమువలె సాగుచునే వుండెను.

లూథరు గొప్ప ప్రొటస్టెంటు. అతడు రోము అధికారమును ప్రతిఘటించెను. కాని మతవిషయములలో సహనబుద్ది కలవాడు

కాడతడు. తాను పోరాడుచున్న పోపుకు ఎంత సహనమున్నదో అతనికినీ అంతే వున్నది. కాన రిఫర్మేషన్ కారణముగా మత స్వాతంత్ర్యము యూరోపుకు రాలేదు. సరిగదా కొత్తపూదిరి మత దురాగ్రహగ్రస్తులు (Fanatics) తలయెత్తిరి–వారుప్యూరిటన్లు, (Puritans) కాల్వినిస్టులు(Calvinists). ప్రొటస్టెంటు వుద్యమమును తరువాత కాలములో నడిపించినవారిలో కాల్విన్ ఒక్కడు. అతడు ఉద్యమమును నడపుటలో సమర్థుడు. జినీవా నగరమును కొంతకాలమతడు తన స్వాధీనములో నుంచుకొనెను. జినీవాపార్కులో రిఫర్మేషను జ్ఞాపకార్థము కిట్టినగొప్ప కట్టడము జ్ఞాపకమున్నదా? పెద్ద విశాలమైనగోడా, కాల్విన్ యొక్కయు, ఇతరులయొక్కయు ప్రతిమలూ అందున్నవి జ్ఞాపకమున్నదా? కాల్విన్ అసహనమునకు మేరలేదు. తన అభిప్రాయముతో ఏకీభవించక, సంతంత్రాభిప్రాయముల పెట్టుకొన్న వారినతడు తగులబెట్టించెను.

ప్రజాసామాన్యము లూథరునకును, ప్రొటస్టెంటులకును అమితముగా సహాయముచేసిరి. రోమన్‌చర్చి అన్నవారికి కిట్టకుండెను. కర్షకులు దీనస్థితిలో నుండిరనియు, తరుచు అల్లరులు కలుగుచుండెననియు నీకు చెప్పియుంటిని. ఈ అల్లరులే జర్మనీలో కర్షకుల యుద్ధముగా పరిణమించెను. వారిని అణచిపెట్టిన రాజ్యాంగపద్ధతిపై కర్షకులు ఎదురుతిరిగిరి. మిక్కిలి న్యాయమైనట్టి సామాన్య హక్కులనే కోరిరి–కమతగాంద్రవిధాన మంతరించవలెననీ, చేపలను పట్టుటకు, వేటాడుటకు హక్కు తమకుండవలెననీ వారు కోరిరి. ఈ హక్కులిచ్చుటకే నిరాకరించిరి. జర్మనీలో రాజులు అనాగరికపద్ధతుల నుపయోగించి వారిని అణచివేయ ప్రయత్నించిరి. గొప్ప సంస్కర్తయగు లూథరు ఈవిషయమున యెట్టి అభిప్రాయమును వెలిబుచ్చెను? అతడు కర్షకులపక్ష మవలంబించెనా? వారు కోరు హక్కులు న్యాయమైనవేయని వాటిని బలపరచెనా? లేదు. కమతగాంద్రపద్ధతి పోవలెనని కర్షకులు చెప్పినప్పుడు లూథరు అన్నవాక్యములివి: "ఇట్లు చేసిన

మానవులందరూ సమానమగుదురు. కాబట్టి ఏసుయొక్క ఆధ్యాత్మిక రాజ్యము, ఐహికరాజ్యముగా మారిపోవును. అట్లు జరుగరాదు. మనుష్యులలో హెచ్చుతగ్గులు లేకుండా ఐహికరాజ్య ముండజాలదు. కొందరు స్వేచ్ఛతో నుండవలెను; కొందరు నౌకరులై యుండవలెను. కొందరు పాలకులు, మరికొందరు ప్రజలు అయి యుండవలెను.'' అతడు కర్షకులను దూషించి వారిని నాశనము చేయుమని ఉద్బోధించెను. " కాబట్టి బలముగల వాళ్ళందరూ బహిరంగముగానో, రహస్యముగానో వారిని నరికివేయుదురుగాక, చంపుదురుగాక, పొడిచివేయుదురుగాక, తిరుగుబాటు చేయువానికన్న విషప్రాయమైనవస్తువు వేరొకటిలేదు. ఉపద్రవకరమైన, దుష్టమైనవస్తువు వేరొకటిలేదు. పిచ్చికుక్కను చంపినట్లు వానిని మీరు చంపివేయవలెను. మీరతనిపై పడకున్నట్లయితే అతడే మీమీదను, దేశముమీదను పడును.'' ముఖ్యముగ మత నాయకుడు, మతసంస్కర్త అయినవాని నోటినుంచి వచ్చిన ఈభాష ఎంత సరసముగా నున్నది!

స్వేచ్ఛ, స్వతంత్రము అని చెప్పే మాటలన్నీ పైతరగతి వారికి గాని ప్రజాసామాన్యానికి వర్తించవని దీనినిబట్టి ప్రతివాడూ గ్రహించవచ్చును. ప్రతి యుగమునందును ప్రజాసామాన్యము బ్రదికే బ్రతుకు మృగముల బ్రతుకుకన్న మెరుగుగాలేదు. లూథరు అభిప్రాయము ప్రకారము వారట్లే వుండవలెను—కారణము భగవంతుడట్లా చెప్పాడు కాబట్టి. రోముపై ప్రొటెస్టెంటుల తిరుగుబాటుకు ప్రజల ఆర్థికదుస్థితియే చాలావరకు కారణము. ఇది వారి కనుకూలముగా నుండుటచే దానివల్ల లాభమును పొందిరి. కాని కర్షకులు చాలా ముందుకుపోయి దాస్య విమోచన పొందుతారేమో అన్నప్పుడు—ఇది చిన్నవిషయమే—ప్రొటెస్టెంటు నాయకులు వారిని అణచివేయుటకు రాజులతో చేతులు కలిపిరి. ప్రజా సామాన్యమునకు రావలసిన మంచిరోజులు ఇంకా చాలా దూరములోనే వుండెను. ఉదయించుచున్న నూతన యుగము

మధ్యతరగతులవారి,—బూర్జువాజీ—యుగము. 16, 17 శతాబ్దులలో జరిగిన కొట్లాటలను. యుద్ధములనుబట్టి వీరు తప్పనిసరిగా మెట్టుమెట్టుగా పైకి వచ్చుచున్నట్లు గ్రహించవచ్చును.

పైకివచ్చుచున్న బూర్జువాజీ బలవంతులై యున్నచోట ప్రాటస్టెంటు మతము వ్యాపించెను. ప్రాటస్టెంటులలో అనేకవిధములు, అనేక తెగలుకలవు. ఇంగ్లాండులో రాజే చర్చికి అధికారము వహించెను. "మత సంరక్షకుడ"య్యెను. చర్చి చర్చిగావుండుట అంతరించెను. అది ప్రభుత్వశాఖ అయ్యెను. నాటినుండియు ఇంగ్లాండు చర్చి అట్లే నిలిచిపోయెను.

ఇతర దేశములలో — ముఖ్యముగా జర్మనీ, స్విట్జర్లాండు, నెదర్లాండులు,— ఇతర తెగలకు ప్రాముఖ్యము వచ్చెను. కాల్వినిజం వ్యాపించెను. అందుకు కారణము బూర్జువాజీ అభివృద్ధి జెందనప్పుడు అది వ్యాపించుట సహజమే. మతవిషయములందు కాల్విన్‌కు సహన బుద్ధి లేశమాత్రములేదు. మతవిశ్వాసము లేనివారిని చిత్రహింస చేయుట, తగులబెట్టుట జరుగుచుండెను. మతవిశ్వాసము కలవారు కఠినమగు క్రమశిక్షలో నుండిరి. వర్తకవిషయములో అతని బోధలు అభివృద్ధి చెందుచున్న వ్యాపారమునకు, పరిశ్రమలకు ఎక్కువ అనుగుణముగా నుండెను. రోమన్ బోధలిట్లులేవు. వాణిజ్యములో వచ్చు లాభములను దీవించుచుండిరి. అరువు ఇచ్చుపద్ధతి ప్రోత్సహింపబడెను. కాన, క్రొత్తగా తలయెత్తిన బూర్జువాజీ పాత మతముయొక్క కొత్త వ్యాఖ్యానము నవలంబించి నిర్మలాంతఃకరణముతో ధనము నార్జించుచుండిరి. ఫ్యూడల్ కులీనులతో తాము చేయు యుద్ధములందు ప్రజాసామాన్యమును ఉపయోగించుకొనిరి. కులీనులపై విజయమిప్పుడు సాధించిరి గాన ప్రజాసామాన్యమును వారుపేక్షించిరి. లేదా వారిని తలయెత్తకుండ చేసిరి.

బూర్జువాజీ ఇంకను ఎన్నోకష్టము లెదుర్కొనవలసి యున్నది.

రాజు వారికింకను అడ్డముగా నుండెను. కులీనులతో యుద్ధముచేయుటకు రాజు పట్టణవాసులతో చేరెను. ఇప్పుడు కులీనులు శక్తివిహీనులుగా చేయబడిరి గనుక రాజు ప్రబలుడయ్యెను. అతడే సర్వమునకు అధికారి యన్నట్లుండెను. అతనికిని మధ్యతరగతులవారికిని పోరాటము ఇంకను తానై యున్నది.

## 85

# పదహారు, పదిహేడు శతాబ్దములనాటి యూరోపులో నిరంకుశత్వము

ఆగస్టు 26, 1932

నేను మళ్లీ ఉపేక్షచేస్తున్నాను. నీకుజాబులు వ్రాసి ఎంతో కాల మయింది. వ్రాయలేదేమని నన్ను అడిగేవాళ్లు ఎవరూ లేరు. ఏరోజు కారోజు తప్పకుండా వ్రాయమని చెప్పేవారూ లేరు. అందుకనే అప్పు డప్పుడు నాకలం మందగిస్తూ ఉంటుంది. అప్పుడు ఇతరవిషయాలు చూచుకొంటూ ఉంటాను. మనముద్దరమూ కలిసిఉంటే వేరేవిధంగా ఉండేదికాదూ? అయితే నీవు నేను కలిసిమాట్లాడుకో గలిగితే నేను జాబులు నీకెందుకు వ్రాయవలెను?

ఈ మధ్య నీకు వ్రాసినజాబులు గొప్పసంక్షోభము, మార్పుచెందు చున్న కాలమునకు సంబంధించిన యూరోపును గురించి వ్రాసినవి. 16, 17 శతాబ్దులలో వచ్చిన గొప్పమార్పులను గురించి అందుముచ్చ టించితిని. మధ్యయుగములను తుదముట్టించిన ఆర్థిక విప్లవముతోనో, దానిఅనంతరమో వచ్చిన మార్పులివి. బూర్జువాజీని పైకెత్తిన మార్పు లివి. క్రైస్తవప్రపంచము, కాతలిక్కు అనీ, ప్రొటస్టెంటు అనీ, రెండు కక్షలుగా పడమటియూరోపులో విడిపోవుట వెనుకటి జాబులో మనము చూచితిమి. దాదాపుగా సమానబలముతోనున్న ఈ రెండుకక్షల వారి

మతకలహములకూ ప్రత్యేక రణరంగము జర్మనీ. పడమటి యూరోపు లోని ఇతరదేశములుకూడా కొంతవరకు ఈ కలహములలో చిక్కుకొన్నవి. యూరోపు ఖండమున జరుగుచున్న మతకలహములలో ఇంగ్లాండు కలుగజేసికోలేదు. హెన్రీ VIII రాజుగా నుండగా దేశమున అశాంతిలేకుండా ఇంగ్లాండు రోముతో తెగతెంపులు చేసికొనెను. కాతలిక్కు. ప్రాటస్టెంటు మతముల నొక విధముగా సమ్మేళనచేసి ఇంగ్లాండు సొంతచర్చి నొకటి స్థాపించుకొనెను. హెన్రీకి మతమంటే అంత లెక్కలేదు. చర్చిభూముల నాక్రమించ కోరాడతడు—అవి అతనికి దక్కినవి. మళ్లీ పెళ్లి చేసుకోవా లనుకున్నాడు — చేసుకొన్నాడు. రిఫర్మేషన్ యొక్క ముఖ్యఫలితము పోపు అధికారమునుండి రాజులను, రాజకుమారులను తప్పించుటయే అయినది.

పునరుజ్జీవనము, రిఫర్మేషను, ఆర్థికసంక్షోభము అను నీయుద్యమములు యూరోపు స్వరూపమును మార్చుచుండగా రాజకీయ పరిస్థితు లెట్లున్నవి? 16, 17 శతాబ్దులలో యూరోపుదేశపట మెట్లున్నది? ఈ 200 సంవత్సరముల కాలములోను ఆ పటము మారుచునే ఉండెను. 16 వ శతాబ్ది తొలిభాగములో ఎట్లుండేదో యూరోపు దేశపటమును చూతము.

ఆగ్నేయమున కాంస్టాంటినోపులు తురుష్కుల చేతులలోనుండెను. వారి సామ్రాజ్యము హంగెరీలోనికి పోయెను. నైరుతి దిక్కున అరబ్బీ విజేతల సంతతివారగు మస్లిమ్ సారసనులు గ్రానడానుండి తరుమగొట్టబడిరి. ఫెర్డినాండు, ఇసాబెల్లాల ఆధిపత్యమున స్పెయిను క్రైస్తవ రాజ్యముగా పరిణమించెను. స్పెయినులో క్రైస్తవులకూ మస్లిములకూ చిరకాలము జరిగిన పోరాటము కారణముగా స్పానియర్డులు కాతలిక్కు మతమునే మతావేశముతో పట్టుకొని ఉండిరి. స్పెయినులోనే భీతావహమగు ఇంక్విసిషన్ స్థాపించ బడినది. అమెరికాను కనుగొనుటా, తద్వారా వచ్చిపడుతూన్న ధనసంచయమూ కారణములుగా స్పెయిను

యూరోపియన్ రాజకీయములలో ప్రముఖపాత్ర వహించ ప్రారంభించు చున్నది.

దేశపటమును మరల చూతుము. ఇంగ్లాండు ఫ్రాంసులు ఇప్పు డున్నట్లే ఉన్నవి. దేశపటముమధ్యలో అనేక జర్మను రాజ్యములుగా చీలికలైన సామ్రాజ్యమున్నది. ఈ రాజ్యములు ప్రతి ఒక్కటియు దాదాపు స్వతంత్రములే. వింతయైన ఈచిన్నచిన్న రాజ్యములు, రాజులు, డ్యూకులు, బిషప్పులు, ఎన్నికదారులు (Electors) మున్నగు వారి పాలనలో ఉండెను. ప్రత్యేక హక్కుల ననుభవించే పట్టణములున్నూ అనేకమున్నవి. ఉత్తరముననున్న వాణిజ్యనగరము లన్నియును చేరి "సమ్మేళనమై"నవి (Confederation). స్విట్జర్లాండు ప్రజాప్రభుత్వ మున్నూకలదు. ఇదినిజముగా స్వతంత్రమైయున్నను ఇంకను స్వతంత్ర మని అందరును వప్పుకోలేదు. వెనీసు ప్రజాప్రభుత్వమున్నూ, ఇంకా ఇతరనగర ప్రజాప్రభుత్వములునూ ఉత్తరఇటలీలో నుండెను. పోపుల ఏలుబడిలో రోముచుట్టూఉన్న ప్రదేశములున్నూ, ఉండెను. వీటిని పాపల్ రాజ్యము లందురు. వాటికిదక్షిణముగా నేపిల్సురాజ్యమున్నూ, సిసిలీయు ఉండెను. తూర్పున సామ్రాజ్యమునకును, రష్యాకును, హంగెరీ రాజ్యమునకును మధ్యగా పోలెండు ఉండెను. ఆటొమన్ తురుష్కులు దీనిపైకన్నువేసి ఉండిరి. ఇంకనుతూర్పున రష్యా పున్నది. గోల్డెన్ హోర్డిశాఖకు చెందిన మంగోలులను వదిలించు కొని ఇప్పుడిప్పుడే ప్రబలరాజ్యముగా తయారగుచున్నది. ఉత్తరమునా, పడమరా మరికొన్ని దేశములున్నవి.

పదహారవ శతాబ్ది తొలిభాగములో యూరోపు ఈ విధముగా నుండెను. 1520 లో చార్లసు V చక్రవర్తి అయ్యెను. అతడు హాప్సు బర్గు వంశమునకు చెందినవాడు. అతడు స్పెయిను రాజ్యములకునూ, నేపిల్సుకునూ, సిసిలీకినీ, నెదర్లాండులకునూ వారసుడై వాటిని పొందె నని ఇదివరలో చెప్పియున్నాను. కొన్ని రాచపెండ్లిండ్లు కారణముగా

యూరోపులోని కొన్ని దేశములకూ, జాతులకూ ప్రభువులు మారుట వింతగా నుండును. లక్షలకొద్ది జనులూ, గొప్పదేశములూ వారసత్వపు హక్కువల్ల పొందబడ్డవి. ఒక్కొక్కప్పుడవి పెండ్లికట్నములుగా ఇవ్వబడ్డవి. ఇంగ్లీషురాజగు చార్లెసు II పోర్చుగల్‌లోని బ్రాగంజా నగరమునకు చెందిన కాతరీన్ అనుకన్యకను వివాహమాడినప్పుడు కట్నముగా బొంబాయిని పొందెను. జాగ్రత్తగా పెళ్లిళ్లు చేసుకొని హాప్సుబర్గు రాజులు ఒక సామ్రాజ్యమును సంపాదించిరి. దీనికి అధిపతి చార్లసు V. ఇతడు వట్టి సామాన్యుడు. తిండిపోతు అని ప్రసిద్ధి కెక్కెను. కాని అతనికున్న విస్తార రాజ్యమునుబట్టి అతడు యూరోపులో మహాపురుషునివలె అప్పుడు కానవచ్చెను.

చార్లసు చక్రవర్తియైన సంవత్సరమందే సులేమాను ఆటోమన్ సామ్రాజ్యమున కధిపతి అయ్యెను. అతని పరిపాలనమున ఈసామ్రాజ్యమన్నిదిశలా, ముఖ్యముగా తూర్పు యూరోపులో వ్యాపించెను. తురుష్కులు వియన్నా ద్వారములవరకు వచ్చిరికాని ఈ సుందర నగరమును స్వాధీనము చేసికొనలేక పోయిరి. కాని హాప్సుబర్గు చక్రవర్తి మాత్రము వారినిచూచి భీతచేతస్కుడయ్యెను. సులేమాన్‌కు కప్పము చెల్లించి తనవానినిగా చేసికొనుట వివేకమని అతడూహించెను. పవిత్రరోమక సామ్రాజ్య మహాచక్రవర్తి టర్కీ సుల్తానుకు కప్పము చెల్లించుటమాట చెప్పు! సులేమానును వైభవోపేతుడగు సులేమాన్ అంటారు. తూర్పు బైజాంటైన్ సీజరుల కాతడు ప్రతినిధి కాబట్టి అతడున్నూ చక్రవర్తి బిరుదమును ధరించెను.

సులేమాన్ కాలమున కాంస్టాంటినోపులులో భవననిర్మాణ మధికముగా జరిగెను. అందమైన మసీదు లనేకము నిర్మింపబడినవి. ఇటలీలోని కళా పునరుజ్జీవనమునకు ప్రతిగా తూర్పునకూడా ఒకటి ఉన్నట్లు తోచును. కళా వికాసమొక కాంస్టాంటినోపులులోనే కాదు. పరిషియాలో, మధ్య ఆసియాలోని ఖొరసాన్‌లోకూడా అందమైన

చిత్తరువులు రచింపబడెను.

ఇండియాలో బేబరు అను మొగలు వాయవ్యదిశనుండి దిగివచ్చి ఒక నూతన రాజవంశమును స్థాపించినట్లు తెలిసికొని యున్నాము. ఇది 1526 లో జరిగినది. అప్పుడు యూరోపులో చక్రవర్తి చార్లసు V; కాంస్టాంటినోపులును పరిపాలించుచున్నవాడు సులేమాన్. బేబరును గురించియు, ప్రసిద్ధులగు అతని సంతతివారిని గురించియు చెప్పవలసినది చాలా ఉన్నది. కాని ఒక విషయమును మనము గమనించవలెను. బేబరు పునరుజ్జీవన కాలమునాటికే సరిపోవురాజు. కాని ఆనాటి యూరోపియన్ రాజులకన్న చాలా మెరుగు. అతడు సాహసకార్యములు చేయుటయందిష్టము కలవాడు. కాని ఉదారుడగు నైటు (Knight). సారస్వతమన్నను, కళ అన్నను అతడు చెవికోసుకొనును. ఆకాలమున ఇటలీలోకూడా సాహసకార్యములు చేయువారును, కళాసారస్వతములపై అభిమానము కలవారును వుండిరి. అల్పమైన వారి కొలువుకూటములు పై మెరుగులతో నిండియుండెను. ఫ్లారెంసులోని "మేడిచీ" కుటుంబమున్నూ, బోర్జాలున్నూ, అప్పుడు ప్రసిద్ధులుకాని ఈ ఇటలీ రాజులున్నూ, యూరోపులోని పలువురున్నూ మాక్యావెల్లి నిజమగు అనుచరులు. వారు అధర్మమునకు జంకరు. కుట్రలు చేయుదురు. నిరంకుశులు. శత్రువులను చంపుటకు విషమునిత్తురు. హంతకుని బాకు నుపయోగింతురు. ఈ మూకతో ఉదారుడగు బేబరును పోల్చుట న్యాయముకాదు. వీరి క్షుద్ర కొలువుకూటములను ఢిల్లీ, ఆగ్రాలలోని మొగల్ చక్రవర్తులైన అక్బరు, షాజహాన్ మున్నగు వారి కొలువుకూటములతో పోల్చుటయునూ అసంభవము. ఈ మొగలు దర్బారులు వైభవముగా నుండెడివని చెప్పుదురు. ఏ కొలువుకూటములును ఇంత భాగ్యోపేతముగా, దివ్యముగా వుండలేదు.

తెలియకుండా యూరోపునుండి ఇండియాకు మనము జారి వచ్చితిమి. యూరోపియన్ పునరుజ్జీవన కాలమున ఇండియాలోనూ,

ఇతర దేశములందును ఏమి జరుగుచున్నదో నీవు తెలిసికొనవలెనని నేను కోరితిని. టర్కీ, పర్షియా, మధ్యఆసియా, ఇండియాలలో అప్పుడు కళావికాసము కలుగుచుండెను. చీనాలో మింగుల ప్రశాంత పాలనమున ప్రజలు సుఖముగా నుండిరి. లలితకళ లాదేశమున ఉన్నతస్థానము నందుకొనెను. కాని పునరుజ్జీవన కాలమునాటి కళ యంతయు, ఒక్క చీనాలోతప్ప, రాజాస్థానమునకు సంబంధించినదే. అది ప్రజలకు సంబంధించిన కళకాదు. ఇటలీలో, నేనుదహరించిన గొప్ప కళావేత్తల యనంతరమున పునరుజ్జీవనము తుదిరోజులలో పుట్టిన కళ నిస్సారము, అప్రసిద్ధము.

ఇట్లు పదహారవ శతాబ్దిలో యూరోపును కాతలిక్కు రాజులును, ప్రాటస్టెంటు రాజులును పంచుకొనిరి. ఆ కాలమున లెక్కకు వచ్చువారు రాజులే; ప్రజలుకారు. ఇతలీ, ఆస్ట్రియా, ఫ్రాంసు, స్పెయిను, కాతలిక్కుల దేశములు; జర్మనీ సగము కాతలిక్కు, సగము ప్రాటస్టెంటు; ఇంగ్లాండు ప్రాటస్టెంటు—కారణము రాజట్లుండ దలచెను గనుక. ఇంగ్లాండు ప్రాటస్టెంటుగావున్న కారణమువల్ల ఐర్లాండు కాతలిక్కయ్యెను. ఇందుకు కారణము ఇంగ్లాండు ఐర్లాండును జయించి హింసించ దలచెను గనుక. ప్రజలకు మతముతో సంబంధము లేదని చెప్పుట పూర్తిగా సమంజసముకాదు. ప్రజలమతము చివరకు లెక్కకు వచ్చినది. అది కారణముగా అనేక యుద్ధములు, తిరుగుబాట్లు సంభవించినవి. మతవిషయములను, రాజకీయ ఆర్థిక విషయములనుండి విడదీయుట కష్టము. క్రొత్తగా తలయెత్తిన వర్తకసంఘములు ప్రబలమగుచున్నప్పుడే రోముపై ప్రాటస్టెంటులు తిరిగుబాటు చేసియుండిరని చెప్పియుంటిని. దీనినిబట్టి మతమునకును, వర్తకమునకును సంబంధమున్నట్లు మనము గ్రహించవచ్చును. మరిన్ని రాజులనేకులు మతవిషయకమగు రిఫర్మేషనునుచూచి భయపడిరి. దీని వెనుకనే ప్రజావిప్లవము సంభవించ వచ్చుననియూ, తమ యధికారమునకు భంగము

వాటిల్లుననియూ వారు భయపడిరి. పోపుయొక్క మతాధికారమును ధిక్కరించ గలిగినవాడు రాజుయొక్క రాజకీయాధికారమును ధిక్కరించలేడా? ఇది ప్రమాదకరమగు సిద్ధాంతమే. దైవదత్తాధికారము రాజులకున్నట్లే వారింకను భావించుచుండిరి. ప్రాటస్టెంటు రాజులు సైతము ఈ అభిప్రాయమును వదులుకోలేదు.

అయినా, రిఫర్మేషన్ వచ్చినా యూరోపులో రాజులు సర్వాధికారులుగానే వుండిరి. ఇంత నిరంకుశముగా వారెన్నడునులేరు. వెనుకటి రోజులలో ఫ్యూడల్ కులీనులు రాజుల ఆటలు సాగనీయలేదు. అనేక పర్యాయములు వారు రాజుల అధికారమును ధిక్కరించిరి. వర్తకులకును, బూర్జువాజీకినీ ఈ కులీనులన్న ఇష్టములేదు. రాజుకును ఇష్టములేదు. వర్తకుల సహాయముతోను, కర్షకుల సహాయముతోను రాజు కులీనుల నణచివేసెను. పిమ్మట సర్వాధికారి అయ్యెను. బూర్జువాజీ కొంత పలుకుబడి సంపాదించి ప్రసిద్ధిగన్నప్పటికీ రాజును ఎదిరించుటకు తగినంతబలము వారికి లేకుండెను. కాని త్వరలోనే మధ్యతరగతుల ప్రజలు రాజుచేసిన అనేక కార్యములను ఆక్షేపించుచుండిరి. ముఖ్యముగా వారాక్షేపించిన విషయములు—ఉండుండియు పన్ను లధికముగా వేయుట; మతవిషయములో కలుగజేసికొనుట. రాజుకిది ఎంతమాత్రము ఇష్టములేదు. తాను చేసిన పనుల కభ్యంతర పెట్టునంత గర్వము వీరికి బలిసినదాయని అతడు కుపితుడయ్యెను. వారి నతడు చెరసాలలో పెట్టించెను. ఇతర విధములుగా శిక్షించెను. నిరంకుశముగా వారిని చెరలో పెట్టించుట కలదు. నేడు బ్రిటిష్ ప్రభుత్వమునకు తలయొగ్గ సమ్మతించని మమ్ము ఇండియాలో నేడు చెరలో పెట్టుచున్నట్లే. రాజు వర్తకవిషయమునకూడ కలుగజేసికొనుచుండెను. ఇందుచే పరిస్థితులు విషమించెను. ప్రజానిరోధ మతిశయించెను. రాజుల నిరంకుశత్వము నెదిరించి బూర్జువాజీ పలుకుబడికై చేసిన పోరాటము అనేకవందల సంవత్సరములకాలము, మొన్న

మొన్నటివరకూ, జరిగెను. దైవదత్తాధికారము రాజులకున్నదన్న భావన అంతరించి, రాజులు తమ నిజస్వరూపము గ్రహించుటకుముందు రాజుల శిరస్సులెన్నో కూలవలసియుండెను. కొన్ని దేశములలో ఈ విజయము త్వరలోనే వచ్చెను. మరికొన్ని దేశములలో ఆలస్యముగా వచ్చెను.

కాని పదహారవ శతాబ్దిలో దాదాపు యూరోపు అంతటిలోనూ రాజే సర్వాధికారియై యుండెను. యూరోపు అంతటిలోనూ కాదు. స్విట్జర్లాండులో కొండలలో నివసించు కర్షకులు హాప్సుబర్గు మహారాజు నెదిరించి స్వతంత్రము పొందిరన్న సంగతి నీకు జ్ఞాపకమున్నదా? కాన అఖండైకాధిపత్యము, నిరంకుశత్వము అనే యూరోపియన్ సముద్రములో స్విట్జర్లాండులోని చిన్నకర్షక ప్రజాప్రభుత్వము ఒక ద్వీపమువలె నిలిచియుండెను. అందు రాజులకు స్థానములేదు.

వేరొక ప్రదేశమున—నెదర్లాండులలో పరిస్థితులు తీవ్రరూపము ధరించెను. ప్రజాస్వాతంత్ర్యము కొరకునూ, మత స్వాతంత్ర్యము కొరకునూ పోరాటము జరిగి విజయము చేకూరెను. అది చిన్న దేశము. కాని యూరోపులో అప్పుడు మిక్కిలి ప్రబలమైయున్న రాజ్యమగు స్పెయినుతో ఈ పోరాటమెంత గొప్పది. ఈ విధముగా నెదర్లాండులు యూరోపుకు మార్గదర్శి అయ్యెను. తరువాత ఇంగ్లాండులో ప్రజాస్వాతంత్ర్యముకొరకు పోరాటము వచ్చెను. దీనికి ఫలితముగా రాజుకు శిరచ్ఛేదమైనది. ఆనాటి పార్లమెంటుకు విజయము వచ్చింది. ఈ విధముగా నెదర్లాండులును, ఇంగ్లాండును నిరంకుశత్వముపై బూర్జువాజీ లేవనెత్తినపోరాటములకు దారితీసినవి. ఈ దేశములలో బూర్జువాజీ విజయము సాధించినదిగాన, అందువల్ల తటస్థించిన నూతన పరిస్థితుల సహాయముతో అది పురోగమించి యితరదేశముల నతిక్రమించినది. ఈ రెండు దేశములును కొంతకాలమైనపిమ్మట ప్రబలమగు నౌకాదళములను నిర్మించుకొన్నవి. దూరదేశములతో వర్తకమభివృద్ధి చేసు

కొన్నవి. ఆసయాలో సామ్రాజ్యస్థాపనకు పునాదులు వేసుకొన్నవి.

ఈ జాబులలో ఇంతవరకును ఇంగ్లాండును గురించి ఆట్టే చెప్ప లేదు. చెప్పడానికికూడా ఏమీలేదు. ఎందువల్లనంటే యూరోపులో ఇంగ్లాండు అంత ప్రముఖదేశముకాదు. కాని ఇప్పుడందు మార్పు వచ్చి నందువల్ల అది ముందుకు చొచ్చుకు పోయింది. మాగ్నకార్టాను గురించియు, పార్లమెంటు ప్రారంభదశను గురించియు, కర్షకుల అల్లరుల గురించియు, వేర్వేరు రాజవంశములవారికి సంబంధించిన అంతఃకలహముల గురించియు ఇదివరలో సూచించియుంటిని. ఈ యుద్ధములలో ఖూనీలు, హత్యలు రాజులు సామాన్యముగా చేయు చుండిరి. ఈ యుద్ధములలో ఫ్యూడల్ కులీను లనేకులు మడసిరి. ఇట్లు వారిబలము సన్నగిల్లెను. ఒక క్రొత్త రాజవంశము—ట్యూడరు వంశము—సింహాసన మాక్రమించెను. వారు నిరంకుశత్వమును విచ్చలవిడిగా సాగించిరి. హెన్రీ VIII ఒక ట్యూడరు. అతని కూతురు, ఎలిజబెత్తుకూడా ట్యూడరే.

చక్రవర్తి చార్లసు V అనంతరము సామ్రాజ్యము విడిపోయెను. స్పెయిను, నెదర్లాండులు అను దేశములు అతని కుమారుడగు ఫిలిప్పు II కు సంక్రమించెను. ఆ కాలమున స్పెయిను యూరోపు కంతకును మేటియై మిక్కిలి ప్రబలమగు ఏకాధిపత్య (Monarchy) రాజ్యముగా వుండెను. పెరూ, మెక్సికో దేశములు దానివే అని నీకు జ్ఞాపకముండవచ్చును. అమెరికాలనుండి స్పెయినులోనికి బంగారము ప్రవహించుచుండెను. కొలంబసు, కార్టెజ్, పిజ్జారో అనే అన్వేషకు లుండిన్నీ నూతన పరిస్థితుల లాభము స్పెయిను పొందలేక పోయింది. వర్తకముమీద దానికి మోజులేదు. దానికి మోజువున్నది ఒక్క మతమే. ఆ మతమైనా క్రౌర్యముతోనూ, మౌర్ఖ్యముతోనూ కూడుకొన్నది. దేశ మందంతటా ఇంక్విసిషన్ అలముకొనెను. మతవిశ్వాసము లేదని ఎవరిని అనుమానిస్తారో వారిని దారుణముగా చిత్రహింసలపాలు చేసిరి.

అప్పుడప్పుడు బహిరంగముగా ఉత్సవములు జరుగుచుండెను. అప్పుడు మతవిశ్వాసము లేనివారిని, పురుషులనూ, స్త్రీలనూ పెద్ద చితులమీద పెట్టి రాజులు, రాజకుటుంబము, రాయబారులు, వేలకొద్ది జనులు చూస్తూండగా తగులబెట్టేవారు. ఈ బహిరంగ దహనములను—మతవిశ్వాసకార్యము లనేవారు. ఇదంతా దారుణంగా రాక్షసంగా కనిపిస్తుంది. ఈ కాలము నాటి యూరోపు చరిత్రఅంతా దారుణ హింసలతోను, ప్రాకృత క్రౌర్యము తోను, మత మౌర్ఖ్యముతోను నిండియుండి నమ్మటకు శక్యము గాకుండా వుండెను.

స్పెయిను సామ్రాజ్యము చిరకాలము నిలువలేదు. చిన్న దేశ మైన హాలెండు సాహసముతో పోరాడి దాని పుట్టకట్లు కదల్చివేసింది. కొద్ది కాలమైనపిమ్మట 1588 లో ఇంగ్లాండును జయించవలెనని స్పెయిను చేసిన ప్రయత్నము పూర్తిగా విఫలమయ్యెను. స్పానిష్ సైన్యమును కొంపోయిన "అజేయమైన నౌకాదళము" ఇంగ్లాండును చేరనైన చేరలేదు. నడిసముద్రములో నౌకాదళము భగ్నమైనది. ఇందాశ్చర్యములేదు. నౌకాదళమునకు నాయకత్వము వహించినవానికి నౌకలంటే ఏమిటో, సముద్రమంటే ఏమిటో తెలియదు. అతడు రాజైన ఫిలిప్పు II వద్దకువెళ్ళి "రాజుగారిని వినయముగా ప్రార్థించెను ఆ ఉద్యోగమునుండి తన్ను తొలగించమనెను. ఎందువల్లనంటే తనకు నౌకలను నడపు నేర్పు లేదనిన్నీ, తాను మంచి నావికుడు కాడనిన్నీ అతడు చెప్పెను. కాని, భగవంతుడే నౌకాదళమును నడిపించును లెమ్మని రాజు ప్రత్యుత్తర మిచ్చెను.''

ఇట్లు క్రమక్రమముగా స్పెయిను సామ్రాజ్యము మాసిపోయెను. చార్లసు V కాలములో అతని సామ్రాజ్యముపై సూర్యుడస్తమించడని చెప్పేవారట. గర్వాంధమై, అహంకార దూషితమైన వేరొక సామ్రా జ్యముపట్ల ఈ నానుడిని నేడు తరుచు వాడుచున్నారు.

## 86

# నెదర్లాండులు స్వాతంత్ర్యమునకై పోరాడుట

ఆగస్టు 27, 1932

పదహారవ శతాబ్దిలో దాదాపు యూరోపునందంతటా రాజులెట్లు సర్వాధీశ్వరులైరో వెనుకటిజాబులో చెప్పియుంటిని. ఇంగ్లాండులో ట్యూడర్లుండిరి. స్పెయిను, ఆస్ట్రియాలలో హాప్సుబర్గులుండిరి. రష్యాలోనూ, జర్మనీ. ఇటలీ పెద్దభాగములలోనూ, నిరంకుశప్రభుపు లేలుచుండిరి. ఫ్రాంసులో రాజు ఏకాధిపత్యము వహించి, రాజ్యమంతయు తన సొంతసొత్తుగా భావిస్తూ ఉండెను. అట్టి రాజులకితడే మాదిరిగాఉండెను. సమర్థుడగు మంత్రియొకడు, కార్డినల్ రీష్ల్యూ అనువాడు ఫ్రాంసును, అందలి ఏకాధిపత్యమును బలపరుచుటకు సహాయముచేసెను. తనబలమును, భద్రతయును జర్మనీ దుర్బలత్వముపై ఆధారపడి ఉన్నవని ఫ్రాంసు ఎప్పుడూ తలచుచుండెను కాన గొప్ప కాతలిక్కు పురోహితుడైనట్టిన్నీ, ఫ్రాంసులోని ప్రాటస్టెంటులను దయాదాక్షిణ్యములు లేకుండ అణచివేసినట్టిన్నీ రీష్ల్యూ జర్మనీలో ప్రాటస్టెంటులకు ప్రోత్సాహమిచ్చెను. ఇట్లు చేసినట్లయితే జర్మనీలో వైషమ్యములుపుట్టి అల్లరులు చెలరేగునని అతని అభిప్రాయము. ఈ విధముగా జర్మనీని దుర్బలము చేయవచ్చునని భావించెను. ఈ రాజనీతి ఫలించెను. జర్మనీలో దారుణమైన అంతఃకలహములు చెలరేగినవి. తత్కారణమున జర్మనీ పాడైపోయెను.

పదిహేడవశతాబ్ది మధ్యలో ఫ్రాంసులోకూడ అంతఃకలహము సంభవించెను—దీనినే ఫ్రాండీయుద్ధమందురు. కాని రాజు కులీనులనూ, వర్తకులనూకూడా అణచివేసెను. కులీనులకు నిజమగు అధికారములెట్టివీ

మిగులలేదు. కాని తనపక్షమున వారిని ఉంచుకొనుటకు రాజు వారికి లెక్కలేనన్ని హక్కులనిచ్చెను. వారు ఎట్టిపన్నులూ చెల్లించ నవసరము లేదు. కులీనులున్నూ, మతగురువర్గమున్నూ (Clergy) పన్నులు చెల్లించ నక్కరలేదు. పన్నులభారమంతా సామాన్య ప్రజలమీద, ముఖ్యముగా కర్షకుల మీద, పడెను. దీనావస్థలోనున్న ఈ బీద దురదృష్టవంతులనుండి బలవంతాన వసూలుచేసిన ధనముతో వైభవముతోకూడిన గొప్ప ప్రాసాదములు నిర్మింపబడెను. రాజాస్థానము దివ్యముగా వెలుగుచుండెను. పారిస్‌వద్దనున్న వార్సై (Versailles)ను మనము చూచుతిమి జ్ఞాపకమున్నదా? అక్కడనున్న మహా ప్రాసాదములు—మనమిప్పుడు పోయిచూచేవి—పదిహేడవ శతాబ్దిలో ఫ్రెంచి కర్షకుల రక్తముతో లేచినవి. బాధ్యతలేని నిరంకుశ ప్రభుత్వమునకు వార్సై పెట్టినది పేరు. ఏకాధిపత్యమును తుద ముట్టించిన ఫ్రెంచి విప్లవమునకు వార్సై దారితీసిందనుట వింతకాదు. కాని విప్లవమింకను చాలాదూరములో ఉన్నది. అప్పటి రాజు లూయీ XIV. అతనిని మహారాజు అనేవారు. అతడు సూర్యుడనిన్నీ, అతనిచుట్టూ రాజాస్థానమందలి గ్రహములు పరిభ్రమిస్తూన్నవనిన్నీ, అనేవారు. అతడు దీర్ఘకాలము 1643 నుండి 1715 వరకూ రాజ్యము చేసెను. అతని ప్రధానామాత్యుడుగా వేరొక కార్డినల్ మాజిరాన్ అనువాడుండెను. పై అంతస్థులలో భోగము లధికముగా నుండెను. కళాసారస్వత విజ్ఞానశాస్త్రములకు రాజావలంబన ముండెను. కాని వైభవమను ఈ పల్చని పొరక్రింద దైన్యము, బాధలు ఉండెను. అందమైన తలకట్లూ (విగ్గులు), చొక్కాచేతుల జలతారు కప్పులూ, ఎప్పుడునూ నీళ్లమొహంచూడక మురికికారుతున్న దేహాలను కప్పే జిలుగు వస్త్రములున్నూ ఆకాలమున పరిపాటిగా ఉండెను. డంబమునూ, దర్పమునూ చూచి మనమందరమూ ముగ్ధులమౌతాము. లూయీ XIV తన దీర్ఘపరిపాలనా కాలమునయూరోపును విస్మయములో ముంచెనంటే

వింతలేదు. అతడు మాదిరిరాజు. ఇతరు లతనివలె నుండవలెనని ప్రయత్నించిరి. కాని ఈమహారాజు — అతడెట్టివాడు ? ఒక ప్రసిద్ధ ఇంగ్లీషురచయిత, కార్లైలు అనువాడు ఇట్లు చెప్పెను — " మీ లూయీ కాటోర్జు ధరించు రాచఉడుపులను తొలగించి నిలబెట్టండి. ఇక మిగిలిన దేమిటి ? పంగలున్న ముల్లంగిదుంప తమాషాగా చెక్కబడ్డతల." ఈ వర్ణన చాలా తీవ్రముగానే ఉన్నది. కాని ఇది రాజులకే కాకుండా సామాన్యులకుకూడా అనేకమందికి బహుశా వర్తిస్తుంది.

లూయీకాటోర్జు 1715 దాక అనగా పద్దెనిమిదోశతాబ్ది ప్రారంభము వరకూ పరిపాలనచేసెను. ఈలోపుగా యూరోపులోని ఇతరదేశములలో అనేక విషయములు జరిగినవి. అందు కొన్ని సంభవములగూర్చి మనము తెలుసుకోవలెను.

నెదర్లాండులు స్పెయినుపై తిరుగబడెనని ఇదివరలో నీకు వ్రాసియుంటిని. వారు సాహసముతో పోరాడిన కథ మనముకొంత విపులముగా తెలుసుకోవాలి. జె. యల్. మోట్లే అనే అమెరికన్ ఒకడు వారి స్వాతంత్ర్యయుద్ధమును గురించి వ్రాసెను. అది ప్రసిద్ధి కెక్కిన గ్రంథము. దానినెంతో మనోహరముగా, అందముగా నుండునట్లాతడు వ్రాసెను. నేను ఎరిగిఉన్న నవల ఏదియు ఇంత మనోహరముగాలేదు. యూరోపులో, ఒకమూల, 350 ఏండ్ల క్రితము జరిగిన ఈ వృత్తాంతమంత హృదయాకర్షకముగా నుండెను. ఆ గ్రంథముపేరు "ది రైజ్ ఆఫ్ ది డచ్ రిపబ్లిక్" (డచ్చిప్రజాప్రభుత్వము తలయెత్తిన విధము). నేను దీనిని చెరసాలలో చదివితిని.

నెదర్లాండులలో హాలెండు, బెల్జియములు చేరియున్నవి. వాటి పేరునుబట్టే, అవి పల్లపుభూములని మనము తెలుసుకోవచ్చును. హాలెండు అనగా గుల్లగానున్న భూమిఅని అర్థము. ఈదేశములలో పెద్దభాగములు సముద్రమట్టమునకు తగ్గులో నుండెను. ఆకారణమున ఉత్తరసముద్రజలము దేశములపైపడి ముంచివేయకుండ బ్రహ్మాండమైన

గోడలు, కట్టలుకట్టి సంరక్షణ చేసుకోవలసివచ్చెను. నిత్యమునూ సముద్రముతో పోరాడవలసిన దేశములో పుట్టుప్రజలు దృఢకాయులు సముద్రజీవులు అయివుంటారు. సముద్రమును దాటగలిగిన జనులు తరుచు వర్తకము చేయుదురు. కాన నెదర్లాండులలోని జనులు వర్తకులైరి. ఉన్ని వస్తువులు మున్నగువానిని వారు వుత్పత్తిచేయు చుండిరి. తూర్పునుండి సంబారద్రవ్యములు వారి దేశములలోనికి దిగుమతి యగుచుండెను. బ్రూజెస్, ఘెంట్, ఆంట్వర్పు మున్నగు నగరములు తలయెత్తెను. అవి భోగభాగ్యముతో నొప్పుచు జన సంకీర్ణమై వుండెను. తూర్పుతో వర్తకము పెరుగుచూరాగా ఈనగర ములు మిక్కిలి భాగ్యవంతమైనవి. 16 వ శతాబ్దిలో ఆంట్వర్పు యూరోపుకు వర్తకరాజధానీ నగరమయ్యెను. ఆ నగరములో వర్తకులు సమావేశమగు భవనమున ప్రతీరోజూ వర్తకవిషయములు పరిష్కరించు కొనుటకు 5000 మంది వర్తకులు సమావేశ మయ్యేవారట. దాని నౌకాశ్రయములో ఒకేమారు 2500 ఓడలు ఉంటూండేవట. ప్రతీ రోజూ 500 ఓడలు అక్కడికి వచ్చేవట. 500 ఓడలు పోయేవట. వర్తకుల సంఘములే నగర పరిపాలనములను సాగించేవారు.

రిఫర్మేషన్ తెచ్చిపెట్టిన నూతన మతాభిప్రాయములవల్ల ఆకర్షింపబడేవారు ఇటువంటి వర్తకులే. అచ్చట, ముఖ్యముగా ఉత్తర మున, ప్రాటస్టెంటు మతము వ్యాపించెను. వారసత్వము కారణముగా హాప్సుబర్గు చార్లసు V న్నూ, అతని కుమారుడు ఫిలిప్పు II న్నూ నెదర్లాండులకు పరిపాలకులైరి. వీరుభయులకు రాజకీయ స్వాతంత్ర్య మన్ననూ కిట్టదు. నగరముల హక్కులనూ, నూతనమతమునూ అణచివేయుటకు ఫిలిప్పు ప్రయత్నించెను. అతడు ఆల్వాడ్యూకును గవర్నరు జనరలుగా నెదర్లాండులకు పంపించెను. హింసకూ, నిరంకు శత్వమునకూ ఇతడు ప్రసిద్ధిగన్నవాడు. ఇంక్విసిషన్ స్థాపించబడెను. ఒక "వర్తకసభ" స్థాపించబడెను. వేలకొద్ది జనులు స్తంభములకు

కట్టబడి దహింపబడిరి. వేలకొద్ది ఉరితీయబడిరి.

ఇది చాలా పెద్దచరిత్ర. ఇక్కడ చెప్పజాలను. స్పెయిను నిరంకుశత్వము పెరిగినకొద్దీ ప్రజలలో దానిని నిరోధించే శక్తికూడా పెరిగింది. వారికొక గొప్ప వివేకి నాయకుడయ్యెను. అతనిపేరు ప్రిన్సు విలియం ఆఫ్ ఆరెంజ్. ఇతనినే మౌనధారియగు విలియం అందురు. ఆల్వాడ్యూకు ఇతని కెందును చాలడు. 1568 లో ఒక మారు తీర్పు చెప్పుచు ఇంక్విసిషన్, మతవిశ్వాములేని వారని నెదర్లాండుల ప్రజలందరికీ మరణదండన విధించెను. కొద్దిమంది వినాగా వారిపేర్లు అందు ఉదహరింప బడినవి. చరిత్రలో ఇట్టి తీర్పు కనివిని వుండలేదు. మూడు నాలుగు వాక్యములలో తీర్పు! 30 లక్షల మందికి మరణదండన!

తొలుదొల్త ఈ పోరాటము నెదర్లాండు కులీనులకును, స్పెయిను రాజుకునువలె కనిపించెను. ఇతర దేశములలో రాజులకు, కులీనులకు జరిగిన పోరాటముల వంటిదే ఇది. ఆల్వావారిని అణచి వేయుటకు ప్రయత్నించెను. కులీనులనేకులు బ్రస్సెల్సులో ఉరికంబము నెక్క వలసి వచ్చెను. ప్రజలలో పలుకుబడిగల వాడున్నూ, ప్రసిద్ధుడున్నూ అయిన కౌంటుఎగ్మాంటు అందొక్కడు. కొన్నాళ్ళయిన పిమ్మట ధనములేక ఆల్వా పెద్దిమొత్తములను కొత్తపన్నుగా విధించెను. వర్త కుల తరగతులీ పన్నులిచ్చుకోవలసి వచ్చెను. వారు తిరుగబడిరి. దీనికి తోడు కాతలిక్కు, ప్రాటస్టెంటు పోరాటము జరుగుచునే వుండెను.

స్పెయిను మిక్కిలి ప్రబలమగు రాజ్యమై యుండెను. తన గొప్పతనమును తలచుకొని గర్వించియుండెను. నెదర్లాండులన్ననో కొద్దిరాష్ట్రములు మాత్రమే. అందువర్తకులూ, బలహీనులైన దూబరా కులీలునూ ఉండిరి. ఈ రెంటికిని పోలికలేదు. కాని వారిని అణచి వేయుట స్పెయినుకు కష్టముగానే వుండెను. జనసంహారములు వుం డుండియు జరుగుచుండెను. ఊళ్లకు ఊళ్లు తుడిచి బెట్టబడుచుండెను.

మానవ వినాశము చేయడములో ఆల్వాయును అతని సేనానాయకులును ఛెంగిజ్‌ఖాన్, తైమూరులతో ప్రతివచ్చుచుండిరి. తరుచు మంగోలులే మెరుగు అనిపించిరి. నగరము తరువాత నగరమును ఆల్వాముట్టడించెను. నగరమందలి శిక్షితులుకాని స్త్రీ పురుషులు, భూమిమీదో, నీటిమీదో, శిక్షితులైన ఆల్వా సైనికులతో ఓపిక వున్నంతవరకూ పోరాడిరి. తిండిలేక మాడవలసి వచ్చినప్పుడు మాత్రము పోరు మానుకొనిరి. వారు ప్రేమించు సర్వమును పోవుటకు ఒప్పుకొనిరి. కాని స్పానిష్ వారికింద దాస్యము చేయుట కొప్పుకోలేదు. కాన వారు కట్టలను తెగగొట్టి ఉత్తర సముద్రజలములు దేశములో ప్రవేశబెట్టిరి. ఈ విధముగా స్పానిష్ సైనిక దళములను ముంచివేయవలెననియు, తరిమివేయవలెననియు వారూహించిరి. పోరాటము జరిగినకొద్దీ తీవ్రమయ్యెను. ఉభయపక్షములవారూ అమిత క్రూరనుగా ప్రవర్తించిరి. అందమైన పట్టణమగు హార్లెమ్ ముట్టడి పేర్కొనదగ్గది. చివరవరకును శత్రువశము కాకుండ ప్రజలు పోరాడిరి. చివరకు స్పానిష్ సైనికులు యథాప్రకారము జనసంహారముచేసి పట్టణమును కొల్లగొట్టిరి. కట్టలను తెగగొట్టుటవల్ల ఆల్‌క్మార్ ముట్టడినుండి తప్పించుకొన్నది. లేడన్ పట్టణమును శత్రువులు చుట్టుముట్టిరి. తిండిలేకా, రోగములవల్లా వేలకొద్ది పట్టణజనులు నశించిరి. లేడన్‌లో చెట్లకు పచ్చని ఆకులు లేవు. ప్రజలు వాటిని తినివేసిరి. పెంటకుప్పల మీదనున్న కృశించిన కుక్కలతో తినుటకేమైనా దొరుకునేమో అని పురుషులూ, స్త్రీలూ పోరాడుచుండిరి. అయినా పోరాటము మానలేదు. కళ్లు లోతుకు దించుకుపోయి, తిండలేక కృశించిన ప్రజలు కోటగోడలెక్కి శత్రువును ధిక్కరించిరి. ఎలుకలనైనా, కుక్కలనైనా దేనినైనా తిని పోరాడుతాము కాని మీకు లొంగమని స్పానియర్డులతో చెప్పిరి. " మేముతప్ప ఇంక ఏజీవులూ లేనప్పుడు మాలో ప్రతిఒకరమూ మా ఎడమ చేతులను తిని శరీరాన్ని నిలుపుకొని కుడిచేతులతో మాస్త్రీలనూ, మా స్వాతం

త్ర్యాన్నీ, మా మతమునూ, విదేశక్రూరరాజుల నెదుర్కొని రక్షించుకు తీరతామని నమ్మండి. ఆగ్రహోదగ్రుడై భగవంతుడు మమ్ము వినాశనము చేయదలచిననూ, మాకెట్టి సహాయమూ చేయకున్ననూ అప్పుడు కూడా మీరు మా దేశములో కాలుపెట్టకుండా మేము ఎంతకాలమైనా నిలువగలము. చివరఘడియ వచ్చినప్పుడు, మా చేతులతో మేము మా పట్టణాన్ని తగులబెడతాము. స్త్రీలూ, పురుషులూ, పిల్లలూ అందరమూకలిసి ఆ మంటలలోపడి మరణిస్తామేకాని మాయిళ్లను మీరు మైలపరచడానికి ఒప్పుకోము. మా స్వాతంత్ర్యాలనూ మీరు అణచిపెట్టడానికి ఒప్పుకోము."

లేడన్ ప్రజల ధైర్యమట్టిది. రోజుకురోజు వారికెట్టి సహాయమూ రాకుండా పోయింది, నిరాశ అంకురించింది. బయటనున్న హాలెండు ఎస్టేటులలోని తమ స్నేహితులకు వర్తమానమంపిరి. తమకు ప్రేమాస్పదమైన సముద్రజలములో ముంచివెయ్యనైనా ముంచివెయ్యవలెను గాని లేడన్ శత్రువశము కాకూడదని ఎస్టేటులు నిశ్చయించెను. "దేశము శత్రువశ మగుటకన్న సముద్రములో మునిగిపోవుటే మంచిది." శత్రు హతమగు తమసాటి నగరమునకు వారీ సమాధానము పంపిరి. "ఓ లేడన్! నిన్ను మేము వదలిపెట్టము. సముద్రములో మన దేశమునూ, మన సర్వస్వమునూ కలిపివెయ్యనైనా కలిపివేస్తాము కాని మిమ్మెన్నటికీ వదలము."

చివరకు ఒకకట్ట తరువాత ఒకకట్ట తెగగొట్ట బడినది. గాలి అనుకూలముగా నుండెను. సముద్రజలములు లోపలికి చొచ్చుకొని వచ్చినవి. ఆ జలములతో దచ్చినావలును వచ్చినవి. ఆహారమూ, సహాయమూ అవి తెచ్చినవి. ఇక స్పానిష్ సైనికులు ఈ కొత్త శత్రువును—సముద్రమును చూచి త్వరత్వరగా పారిపోయిరి. ఇట్లు లేడన్ నిలువగలిగినది. నగరవాసుల సాహసమునకు స్మారకచిహ్నముగా 1575 లో లేడన్ విశ్వవిద్యాలయము స్థాపించబడెను. నాటినుండియు అది ప్రసిద్ధి

గనుచున్నది.

ఇట్టి సాహసకథ లనేకమున్నవి. దారుణమైన హత్యాకథలున్నూ ఉన్నవి. అందమైన ఆంట్వర్ప్ జనసంహారము దారుణముగా జరిగెను. దోపుళ్లు జరిగెను. 8 వేలమంది అప్పుడు చనిపోయిరి. దీనికి "స్పానిష్ ఫూరీ" (స్పానిష్‌వారి కోపావేశము) అని పేరు.

కాని ఈ గొప్ప పోరాటము చాలావరకు హాలెండే చేసెను. నెదర్లాండులలో దక్షిణభాగము చెయ్యలేదు. స్పానిష్ పాలకులు లంచమిచ్చియు, భయపెట్టియు నెదర్లాండులలోని కులీనులను పెక్కుమందిని తమ పక్షమునకు తిప్పుకొనిరి. వారిచేత వారి దేశస్థులనే అణగద్రొక్కించిరి. స్పానిష్ పాలకులు వారిని తిప్పుకోగలుగుటకు కారణము దక్షిణమున ప్రొటస్టెంటులకన్న కాతలిక్కులే ఎక్కువగా వుండుట. కాతలిక్కులను తమ పక్షమునకు తిప్పుకొన ప్రయత్నించి వారు కొంతవరకు కృతార్థులైరి. ఇక కులీనులమాటో! స్పానిష్‌రాజు అనుగ్రహమున్నూ, ఆత్మార్థము ధనమున్నూ సంపాదించగోరి, తమ దేశము నాశనమైనాసరే అని, వారు దేశద్రోహమున కొడిగట్టినారు. ఇది సిగ్గుచేటు కాదా?

నెదర్లాండుల జనరల్ అసెంబ్లీలో విలియం ఆఫ్ ఆరెంజి ఈ విధముగా చెప్పెను, "నెదర్లాండులచేతనే నెదర్లాండులు అణగద్రొక్కబడినవి. ఆల్వాడ్యూకు తనకున్నదని గర్వించే బలము అతనికి ఎక్కడినుంచి వచ్చింది—నెదర్లాండు నగరముల నుంచేనా? అతనికి నావలూ, సరఫరాలూ, డబ్బూ, ఆయుధములూ, సైనికులూ ఎక్కడినుంచి వచ్చినట్లు? నెదర్లాండు ప్రజలనుంచే."

ఇట్లు చివరకు స్పానియర్డులు నేటిబెల్జియంకు దాదాపు సరిపోయిన నెదర్లాండులలోని భాగమును, జయింప గలిగారుకాని ఎంత ప్రయత్నించినా హాలెండును వారు జయించలేక పోయారు. ఈ పోరాటము చివరవరకూ స్పానిష్‌రాజైన ఫిలిప్పు II పై రాజభక్తిని హాలెండు వదులుకో

కుండుట ఒక వింతవిషయము. వారి స్వాతంత్ర్యముల నాత డంగీక రించినట్లయితే అతనినే రాజుగా వుంచుకొనుటకు వారు సిద్ధమయ్యే ఉండిరి. చిట్టచివరకు వారు తెగతెంపులు చేసుకోవలసి వచ్చింది. తమ మహా నాయకుడైన విలియంను రాజు చేయగోరారు. కాని అతడు సమ్మతించలేదు. ఇష్టములేకున్నా కాలమూ, కర్మమూకూడి వచ్చుటవల్ల వారు ప్రజాప్రభుత్వము స్థాపించక తప్పినదికాదు. రాజుండవలెననే సంప్రదాయ మానాడంత ప్రబలముగా ఉండెను.

హాలెండులో పోరాటము చాలా సంవత్సరములపాటు జరిగెను. 1609 వరకూ హాలెండు స్వతంత్రము కాలేదు. కాని నెదర్లాండులో నిజమైన పోరాటము 1567, 1584 సంవత్సరముల మధ్యకాలములో జరిగెను. విలియం ఆఫ్ ఆరెంజ్‌ను ఓడించలేక ఫిలిప్పు II ఒక హంతకునిచే అతని హత్యచేయించెను. అతనిని చంపినవానికి బహు మాన మిత్తునని అతడు బహిరంగముగా ప్రకటించెను. ఆనాడు యూరోపులోని నీతి ఇట్లుండెను. విలియంను చంపుటకు చేసిన ప్రయత్నము లనేకము విఫలమయ్యెను. ఆరవప్రయత్నము 1584 లో జరిగెను. అది సఫలమైనది. "మాతండ్రి విలియం" అని యావత్తు హాలెండూ పిలిచే మహాపురుషుడు మరణించాడు. కాని అతడు చేయ వలసినపని అతడు చేసెను. బాధలుపడి, త్యాగములుచేసి డచ్చి ప్రజా ప్రభుత్వము నిర్మింపబడినది. క్రూరరాజులనూ, నిరంకుశులనూ నిరో ధించుటవల్ల ఆ దేశమునకూ, ప్రజలకూ మేలే చేకూరింది. దానివల్ల ప్రజలు శిక్షితులైనారు. వారికి బలము వచ్చింది. ఆత్మవిశ్వాసమూ బలమూగల హాలెండు వెంటనే గొప్ప నౌకాబలముగల రాజ్యమయ్యెను. దూరప్రాచ్యము వరకూ వ్యాపించెను. హాలెండునుండి విడదీయబడిన బెల్జియం స్పానిష్ పరిపాలనలోనే వుండెను.

ఈనాటి యూరోపుచరిత్ర సమగ్రమగుటకు జర్మనీని చూతము. 1618 నుండి 1648 వరకూ ఈదేశములో గొప్ప అంతఃకలహము సంభ

వించెను. దీనికి ముప్ఫై సంవత్సరముల యుద్ధమని పేరు. ఈయుద్ధము కాతలిక్కులకును, ప్రాటస్టెంటులకును జరిగెను. జర్మనీలోని చిన్న రాజులును, ఎలెక్టర్లును ఒకరితో ఒకరు పోరాడుచూ చక్రవర్తితోకూడ పోరాడుచుండిరి. ఫ్రాంసుయొక్క కొతలిక్కురాజు ప్రాటస్టెంటుల పక్షము నభిమానించుటచే గందరగోళ మెక్కువైనది. చివరకు స్వీడన్ రాజు, గస్టేవస్ అడాల్ఫసు—అతనిని ఉత్తరదేశ సింహమందురు— వచ్చి చక్రవర్తి నోడించి ప్రాటస్టెంటులను కాపాడెను. కాని జర్మనీ పాడైపోయెను. కూలికి పనిచేసే సైనికులు బందిపోటు దొంగలవంటి వాళ్లు. వారు దొంగతనము చేయుచు, కొల్లగొట్టుచూ పోయిరి. తమ సైనికులకు జీతము లివ్వలేక, తిండిపెట్టలేక సైన్యాధిపతులు సైతము కొల్లగొట్ట ప్రారంభించిరి. ఇట్లు ముప్ఫైఏళ్ళపాటు జరిగెను. ప్రతి యేడూ హత్యలూ, దోపుళ్లూ, వినాశనము జరుగుతూనే వచ్చెను. వర్తకము కట్టుపడెను. వ్యవసాయమూ జరుగుటలేదు. కాబట్టి నానాటికీ ఆహారము కరవయ్యెను. తిండిలేక ప్రజలు మలమలమాడిరి. ఇందువల్ల దోపుళ్లూ, బందిపోట్లూ అధికమయ్యెను. సైనిక వృత్తిచేసికొనేవారికీ, కూలి సైనికులకూ జర్మనీ పుట్టిల్లు అయినది.

కొల్లగొట్టుటకు ఏమీ మిగలనప్పుడు, చిట్టచివరకు, ఈ యుద్ధము అంతమునకు వచ్చెను. కాని జర్మనీ తేరుకొనుటకు చిరకాలము పట్టెను. 1648 లో వెస్టుఫాలియా సంధివలన అంతఃకలహము తుద ముట్టెను. దీనినిబట్టి పవిత్రరోమక సామ్రాజ్య చక్రవర్తి అధికారము లేని వట్టి ఛాయామాత్రుడయ్యెను. జర్మనీలోని పెద్ద భాగమును, ఆల్సాస్‌ను, ఫ్రాంసు తీసుకొనెను. 200 సంవత్సరములుపైగా ఆ దేశమును నిలుపుకొని కొత్త జర్మనీకి బలవంతాన తిరిగి ఇచ్చుకోవలసి వచ్చెను. మరల 1914—18 మహాయుద్ధములో దానిని గ్రహించెను. ఇట్లీ సంధివల్ల ఫ్రాంసు లాభమును పొందెను. కాని జర్మనీలో వేరొక రాజ్యము తలయెత్తెను. ఇది ఫ్రాంసు పక్కలో బల్లెము కానున్నది.

దీనిపేరు ప్రషియా. హో ఎన్ చో వెరన్ కుటుంబముచే అది పాలింప బడుచుండెను.

వెస్టుఫాలియాసంధి, స్విట్జర్లాండు, హాలెండు ప్రజాప్రభుత్వము లను అంగీకరించెను.

యుద్ధములు, హత్యలు, దోపుళ్లు, మతమౌర్ఖ్యములు వీటిని గురించి నీకెట్టిగాధలు వినిపిస్తున్నానో! కాని శక్తి, కళావికాసమూ, వాఙ్మయ వికాసమూ చూపిన పునరుజ్జీవన కాలము తరువాత సరిగా యూరోపు ఇట్లుండెను. యూరోపును ఆసియా దేశములతో పోల్చి చూపి, యూరోపులో విజృంభిస్తూన్న నూతన జీవనాన్ని సూచించాను. ఈ నూతనజీవనము బయటపడుటకు ప్రయత్నిస్తూన్నట్లు మనము గ్రహించవచ్చును. శిశువు పుట్టుటయును, నూతనవిధానము పుట్టుట యును బాధలతో కూడుకొన్నవి. పునాదివద్ద ఆర్థిక స్థిరత్వము లేనప్పుడు పైనున్న సంఘమును, రాజకీయములును కదిలిపోవును. యూరోపులో నూతన జీవనము విజృంభించుచున్నదనుట స్పష్టమే. కాని దాని చుట్టును అనాగరిక ప్రవర్తనమే! ఆనాటి నానుడియొక్కటి ఏమన, "పరిపాలనాశాస్త్రము అబద్ధాల శాస్త్రము." వాతావరణమంతయు అబద్ధ ములతోను, కుట్రలతోను, హింసతోను, క్రౌర్యముతోను నిండి యుండెను. దానిని ప్రజలెట్లు సహించిరో?

## 87

# ఇంగ్లాండు తనరాజు నురిదీయుట

ఆగస్టు 29, 1932

ఇంగ్లాండు చరిత్రను గురించి తెలిసికొనుటకు మనమిప్పుడు కొంతకాలము వినియోగింతము. ఇంతవరకూ దాని నుపేక్షించితిమి. మధ్యయుగములలో తెలిసికోవలసిన దేమియు అక్కడలేదు. ఫ్రాంసు ఇటలీలకన్న అది వెనుకబడియుండెను. ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయము

మాత్రము త్వరలోనే విద్యాస్థానముగా పేరు సంపాదించుకొన్నది. దానివెనుకనే కొంతకాలమునకు కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయము వచ్చినది. వైక్లిఫ్, ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయములో చదువుకొన్నవాడే. అతనిని గురించి ఇదివరలో నీకు వ్రాసియుంటిని.

తొలినాటి ఇంగ్లీషు చరిత్రలో మనము గమనించవలసిన విషయము పార్లమెంటు అభివృద్ధిచెందిన క్రమము. మొదటినుండియు రాజుయొక్క అధికారమును హద్దులో వుంచుటకు కులీనులు ప్రయత్నించిరి. 1215 లో మాగ్నాకార్టా పుట్టినది. కొద్దికాలము తర్వాత పార్లమెంటు ప్రారంభములు కనిపించజొచ్చెను. అవి మొరటుగా ఉండెను. కులీనులును, బిషప్పులును లార్డ్సుసభ (House of Lords) గా ఏర్పడిరి. ఇంతకన్న ప్రధానమైనది తరువాత వచ్చినది. నైట్లును, చిన్నభూస్వాములును, కొన్ని పట్టణముల ప్రతినిధులునుగల ఎన్నుకొన్న సభ్యుల సభ. ఈ ఎన్నుకొన్న సభ్యుల సభయే కామన్సుసభ (House of Commons) గా పరిణమించెను. ఈ రెండు సభలలోనూ భూస్వాములును, భాగ్యవంతులును సభ్యులై యుండిరి. కామన్సు సభలోనైనను భాగ్యవంతులగు భూస్వాములయొక్కయు, వర్తకులయొక్కయు ప్రతినిధులు మాత్రమే ఉండిరి.

కామన్సు సభకు అధికారము తక్కువ. వారు అర్జీలు పంపి తమ బాధకములను రాజుకు తెలియజెప్పుచుండిరి. క్రమక్రమముగా వారు పన్నుల విషయములో కలుగజేసికొన జొచ్చిరి. వారి అనుమతి లేనిదే కొత్తపన్నులు వేయుటగాని, వసూలు చేయుటగాని సాధ్యము కాకుండెను. కాన రాజు అట్టి పన్నుల విషయములో వారి సమ్మతి పొంద ప్రయత్నించుచుండెను. డబ్బుపై అధికారము ప్రబలమైన అధికారమే. పార్లమెంటు, ముఖ్యముగా కామన్సుసభ, ఈ యధికారమును సంపాదించి తనబలమును, పలుకుబడిని వృద్ధిచేసికొనెను. తరుచు కామన్సు సభకును, రాజుకును ఘర్షణలు జరుగుచుండెను. అయినా

పార్లమెంటు దుర్బలమైనదే. నేను చెప్పినట్లు ట్యూడరు రాజులు కొంచె మెచ్చు తక్కువగా నిరంకుశప్రభువులు. కాని ట్యూడరు రాజులు తెలివికలవారు. పార్లమెంటుతో వివాదములకు వారు దిగలేదు.

యూరోపు ఖండమున జరిగిన మతయుద్ధములు ఇంగ్లాండులో జరుగలేదు. మతసంఘర్షణలు, అల్లరులు, మతమౌర్ఖ్యము, మంత్రకత్తె లనిఅనుమానించి స్త్రీల నెందరినో అన్యాయముగా తగులబెట్టుట—ఇవి అతిగానుండెను. కాని యూరోపుతో పోల్చినప్పుడు ఇంగ్లాండు శాంత ముగా నున్నదనియే చెప్పవలెను. హెన్రీ VIII ప్రాటస్టెంటు కాబట్టి దేశముకూడా ప్రాటస్టెండే అయినట్లు ఊహింపబడ్డది. ఆ దేశములో అనేకమంది కాతలిక్కులున్నారు; అతివాదులగు ప్రాటస్టెంటులును అనేకులున్నారు. కాని కొత్త ఇంగ్లాండుచర్చి రెంటికిని మధ్యస్థముగా నుండెను. అది ప్రాటస్టెంటు అని చెప్పుకొనును. యదార్థమునకు అది ప్రాటస్టెంటుకన్న ఎక్కువగా కాతలిక్కే. నిజమునకది యొక ప్రభుత్వ శాఖ. రాజు దాని అధ్యక్షుడు. అది రోమునుండియు, పోపునుండియు పూర్తిగా విడిపోయెను. పోపుకు వ్యతిరేకముగా అల్లరులు అనేకము జరిగెను. హెన్రీ VIII కూతురైన ఎలిజబెత్తురాణీ కాలమున తూర్పు కును, అమెరికాకును నూతన సముద్రమార్గములు కనిపెట్టబడుటవల్లను, వర్తకమునకు కొత్త అనుకూలములు చిక్కుటవల్లను ప్రజలు దూరదేశ ములకేగ కుతూహలపడ దొడగిరి. స్పానిష్, పోర్చుగీసు నావికులు పొందిన విజయములవల్ల సమ్మోహితులై, ధనాశాపీడితులై ఇంగ్లీషు వారు సముద్రయానముచేయ మొదలుపెట్టిరి. సర్ ఫ్రాంసస్ డ్రేకును అతనివంటి వారును మొట్టమొదట సముద్రములపై తిరుగు ఓడదొంగలై యుండిరి. అమెరికానుండి వచ్చు స్పానిష్ నావలను వారు కొల్లగొట్టు చుండిరి. తరువాత డ్రేకు భూమిని చుట్టివచ్చుటకు బ్రహ్మాండమైన యాత్రచేసెను. సర్ వాల్టర్ రేలి అట్లాంటిక్ దాటి ఇప్పుడు సంయుక్త రాష్ట్రములుగానున్న దేశము తూర్పుతీరమున అధినివేశము స్థాపించ

ప్రయత్నించెను. దీనిని వర్జీనియా అనిరి. వర్జిన్ (కన్య) రాణియగు ఎలిజబెత్తు గౌరవార్థమీ పేరుపెట్టిరి. అమెరికానుండి ఇంగ్లాండుకు పొగాకు చుట్టలు కాల్చు అలవాటును రేలి మొదట తెచ్చెను. తరువాత స్పానిష్ నౌకాదళము వచ్చుట, ఇంగ్లాండుపై దండెత్తలేక విఫలమగుటవల్ల ఇంగ్లాండుకు ఉత్సాహము హెచ్చెను. రాజుకును పార్లమెంటుకును జరిగిన వివాదముతో దీనికి సంబంధము లేకపోయినప్పటికీ, ప్రజల మనస్సులు దీనిపై లగ్నమయ్యెను. విదేశ వ్యవహారములపైకి వారిబుద్ధి పోయెను.

ఇంగ్లాండులో ఎలిజబెత్తు పరిపాలనాకాలము సముజ్జ్వలమై వెలిగెను. ఎలిజబెత్తు గొప్పరాణి. ఆమెకాలమున కార్యశూరు లనేకులు ఇంగ్లాండులో ఉదయించిరి. రాణీకంటెను, సాహసులగు నైటులకంటెనుగూడ గొప్పవారీ తరమున ఉదయించిన కవులును, నాటకకర్తలును. వారందరిని మించి అమరుడగు విలియం షేక్స్పియర్ వెలుగుచుండెను. అతని నాటకములు ప్రపంచమందంతటా నేడు వ్యాపించినవి. కాని అతనిని గురించి మనకు తెలిసిన విషయములు బహుకొద్ది. ఇంగ్లీషు వాఙ్మయమును అమూల్యమణులతో అలంకరించిన ప్రతిభాశాలులలో అతడొక్కడు. అతని గ్రంథములు చదివి మనమానందమున మగ్నమగుదుము. ఎలిజబెత్తుకాలమునాటి చిన్నభావగీతములకుకూడా విశిష్ట రమణీయత కలదు. అతిసులభమగు మధురభాషలో అవి సుఖముగా సాగిపోవును. ప్రతిదిన సంభవములనవి విశిష్ట విధమున వర్ణించును. ఒక ఇంగ్లీషు విమర్శకుడు లిట్టన్‌స్ట్రాచీ అనువాడు ఈ కాలమును గురించి వ్రాయుచు ఇట్లు చెప్పెను. "వీరు ఎలిజబెత్తు కాలమునందున్న ప్రతిభాశాలులు. అమోఘమగు ఉపజ్ఞతో వారు ఒక తరములో అత్యద్భుతముగా, ప్రపంచమెన్నడూ ఎరుగని నాటకమనే దివ్యమగు ఆస్తిని ఇంగ్లాండుకు ప్రసాదించిరి."

ఎలిజబెత్తు 1603 లో కాలధర్మము నొందెను. ఇండియాలో

అక్బరు మరణించుటకు సరిగా రెండు సంవత్సరముల ముందు. ఆమె తరువాత అప్పటి స్కాట్లాండు రాజు, వారసత్వము కారణముగా ఇంగ్లాండుకుకూడా రాజయ్యెను. అతడు జేమ్సు I. ఇట్లు ఇంగ్లాండును, స్కాట్లాండును ఒకే రాజ్యమయ్యెను. హింసామార్గమున ఇంగ్లాండు సాధించలేని కార్యము శాంతిమార్గమున సఫలమయ్యెను. జేమ్సు I రాజుకు దైవదత్తాధికారనుపై నమ్మకము కలదు. పార్లమెంటుపై అతనికిష్టములేదు. అతడు ఎలిజబెత్తువలె తెలివితేటలు కలవాడుకాడు. త్వరలోనే అతనికిని పార్లమెంటుకును పడలేదు. ఈతని రాజ్యకాలము నందే పట్టుదలగల ప్రొటస్టెంటులు పలువురు ఇంగ్లాండును వదలి 1620 లో, మేఫ్లవర్ అనేనావలో అమెరికాలో స్థిరనివాసము లేర్పరచు కొనుటకు ప్రయాణమైవెళ్లిరి. జేమ్సు I నిరంకుశ అధికారము వారికి నచ్చలేదు. నూతన ఇంగ్లాండు చర్చిపై వారికిష్టములేదు. అది వుండ వలసినంత ప్రొటస్టెంటుకాదని వారి అభిప్రాయము. కాన వారు తమ ఇండ్లను, దేశమునువదలి అట్లాంటిక్ సముద్రమున కావలనున్న క్రొత్త అడవిదేశమును చేర ప్రయాణమైరి. ఉత్తర తీరములందున్న ఒక ప్రదేశమున వారు దిగిరి. ఆ ప్రదేశమునకు న్యూ ప్లిమత్ అను పేరిడిరి. వలసజను లధికముగా వారితరువాత వెళ్లిరి. క్రమక్రమముగా అధినివేశ ముల సంఖ్య పెరిగెను. తూర్పుతీరము పొడుగునను పదమూడు అధి నివేశములు లేచెను. ఈ అధినివేశములే పిదపకాలములో అమెరికా సంయుక్త రాష్ట్రములయ్యెను. ఆకథ యింకను ఎంతో ముందు రానై యున్నది.

జేమ్సు I కుమారుడు చార్లసు I. ఇతడు 1625 లో గద్దెనెక్కిన పిమ్మట పరిస్థితులు విషమించెను. కాన పార్లమెంటు 1628 లో అతనికి "హక్కుల అర్జీ" (**Petition of Rights**) ని దాఖలు చేసెను. ఇంగ్లీషు చరిత్రలో ఇది ప్రసిద్ధమైన పత్రము. రాజు నిరంకుశుడుగా నుండ రాదనియు, అనేక కార్యములతడు చేయరానివి వున్నవనియు ఈ పత్ర

మున రాజుకు స్పష్టముగా నివేదింపబడెను. చట్టమునకు వ్యతిరేకముగా అతడు పన్నులు విధించరాదు. ప్రజలను చెఱలో బంధించరాదు. ఇండియాలో ఇరవయ్యో శతాబ్దిలో ఇంగ్లీషు వైస్రాయిచేసే పనులు, అనగా ఆర్డినెన్సులు సృష్టించి ప్రజలను బంధించుట—పదిహేడవ శతాబ్దిలో రాజు చేయరాదు. కర్తవ్యాకర్తవ్యములను బోధించిరను కోపమున చార్లసు పార్లమెంటును నిలిపివేసి అది లేకుండానే పరిపాలన సాగించెను. కొన్ని సంవత్సరములైనపిమ్మట డబ్బు లేకపోవుటవల్ల వేరొక పార్లమెంటు నాతడు ఏర్పరచెను. పార్లమెంటు లేకుండా చార్లసు చేస్తూన్న కార్యము లన్నిటినీచూచి, కోపించి, కొత్త పార్లమెంటు అతనిని ఢీకొనడానికి ప్రయత్నించింది. రెండు సంవత్సరముల లోపులో 1642 లో అంతఃకలహము ప్రారంభమైనది. ఒకపక్షమున రాజూ, అతనికి సహాయముగా కులీనులనేకులూ, సైన్యములో పెద్దభాగమున్నూ ఉండెను. రెండవ పక్షమున పార్లమెంటూ, దానికి సహాయముగా భాగ్యవంతులగు వర్తకులూ, లండను నగరమూ వుండెను. అనేక సంవత్సరములపాటు ఈ పోరాటము సాగెను. చివరకు పార్లమెంటు పక్షమున ఒక మహానాయకుడు, ఆలివర్ క్రాంవెల్ అనువాడు తల యెత్తెను. క్రమపద్ధతిపై నడిపింప నేర్పు గలవాడతడు. కఠినమగు క్రమశిక్షలో తన యనుచరుల నుంచగల సమర్థుడు. తనపక్షము ధర్మ పక్షమని నమ్మినవాడు. ఇతనిని గురించి కార్లైలు యిట్లు చెప్పెను. "యుద్ధమున అనుకొనని ఆపదలు తటస్థించినప్పుడును, రణక్షేత్ర మున ప్రధాన రంగములందును, ఇతరులు నిరాశాపూరితులై యున్న సమయమునను, ఇతనిలో ధైర్యము అగ్నిస్తంభమువలె ప్రకాశించెను." క్రాంవెల్ కొత్తసైన్యమును నిర్మించెను. వారిని "ఐరన్‌సైడ్సు" అందురు. తనకున్న మేరతప్పని ఉత్సాహము వారిలో నతడు ప్రవేశ పెట్టెను. పార్లమెంటు సైన్యమునందలి ప్యూరిటనులు చార్లసు సైన్య మందలి "కెవాలియర్ల"ను ఎదుర్కొనిరి. చివరకు క్రామ్‌వెలు

జయించెను. రాజు పార్లమెంటుచే చెరపెట్టబడెను.

పార్లమెంటులోని సభ్యులు పలువురు, రాజుతో రాజీనామా చేసుకొనుట మంచిదనిరి కాని క్రామ్‌వెలు కొత్తసైన్యముఇందుకు ఒప్పలేదు. ఆ సైన్యమందలి ఒక ఉద్యోగి, కర్నల్ ప్రైడ్ అనువాడు పార్లమెంటు భవనములోనికి ధైర్యముగావెళ్లి అట్టిసభ్యుల నందరినీ వెడలగొట్టించెను. దీనిని "ప్రైడ్‌పర్జి" (ప్రైడ్‌చేసిన బహిష్కారము) అందురు. తీసికొన్నచర్య కఠినముగానే ఉండెను. పార్లమెంటు ప్రతిష్ఠకు భంగకరముగా వుండెను. రాజు నిరంకుశత్వమును పార్లమెంటు కాదన్నప్పుడు వేరొక అధికారము అనగా వారి సైన్యమేవచ్చి వీరి మాటలను లెక్కచేయలేదు. విప్లవము వరుస ఆవిధముగానే వుండును.

కామన్సుసభలోని మిగత సభ్యులు—వీరిని రంప్ పార్లమెంటు అందురు—లార్డ్సుసభ వద్దంటూన్నా, చార్లెసును విచారణచేయ నిశ్చయించిరి. "క్రూరుడగురాజు, ద్రోహి, హంతకుడు, దేశమునకు శత్రువు" అని అతనికి మరణదండన విధించిరి. 1649 లో మానవుడు వారి రాజై యున్నవాడు, పాలించుటకు తనకు దైవదత్తాధికార మున్నదన్నవాడు, లండనులో, వైటుహాలులో ఉరిదీయబడెను.

రాజులును ఇతరులవలెనే చత్తురు. చరిత్రలో పలువురు రాజులు దుర్మరణము పాలైరి. నిరంకుశత్వమునుండి, రాజరికమునుండి జనసంహారము, హత్యలు పుట్టును. ఇంగ్లీషు రాజులు గతములో హత్యల పాలైరి. కాని ఎన్నుకోబడ్డ ఒకసభ విచారణసభగా మారి రాజును విచారణచేసి ఉరిదీయించుట ఆశ్చర్యకరమైన కొత్తవిషయము. పూర్వాచారబద్ధులై, మార్పుల నంగీకరించని ఇంగ్లీషువారు ద్రోహియగు క్రూరరాజు నేమిచేయవలెనో నిదర్శన పూర్వకముగాచూపుట వింతవిషయము. కాని ఈ చేసినది యావత్తు ఇంగ్లీషు ప్రజలనుకారు—క్రామ్‌వెల్ క్రిందమున్న ఐరన్‌సైడ్లే ఈపని చేసిరి.

ఇదిచూచి యూరోపులోని రాజులూ, సీజరులూ, రాజకుమారులూ,

చిల్లరరాజులూ నిర్ఘాంతపోయారు. సామాన్యజనులు మొండిధైర్యముతో ఇంగ్లాండు చూపిన మార్గాన్ని అవలంబిస్తే తమ పని ఏమికావలసింది? వారిలో పలువురు ఇంగ్లాండు మీదపడి దానిని అణచివేసి యుండవలసినదే. కాని ఇంగ్లాండప్పుడు అప్రయోజకుడగు రాజు పరిపాలనలో లేదు. ఇంగ్లాండు మొదటిసూరు ప్రజాప్రభుత్వ రాజ్యమైనది. క్రామ్‌వెలును, అతని సైన్యమును దానిని రక్షింప సిద్ధముగా వుండిరి. క్రామ్‌వెల్ క్రియకు నియంతగా వుండెను. అతనిని లార్డు ప్రొటెక్టరు అనేవారు. అతని సమర్థమగు కఠిన పరిపాలనకింద ఇంగ్లాండు బలముపోసికొనెను. దాని నౌకాదళములు డచ్చివారియొక్కయు, ఫ్రెంచివారియొక్కయు, స్పానిష్‌వారియొక్కయు నౌకాదళములను తోలివేసెను. మొదటిసారి ఇంగ్లాండు యూరోపులో ప్రధానమైన నౌకాబలముగల రాజ్యమయ్యెను.

కాని ఇంగ్లీషు ప్రజాప్రభుత్వము కొద్దికాలమే వుండెను. చార్లసు I చనిపోయినపిమ్మట పదకొండు సంవత్సరములైనా అది ఉండలేదు. 1658 లో క్రామ్‌వెల్ చనిపోయెను. రెండు సంవత్సరముల అనంతరము ప్రజాప్రభుత్వము అంతరించెను. విదేశములలో తలదాచుకొన్న చార్లసు I కొడుకు ఇంగ్లాండుకు తిరిగివచ్చెను. అతని ఆహ్వానించి చార్లసు II గా పట్టముకట్టిరి. ఈ రెండవచార్లసు పెద్దమనిషి కాడు. రాజరికమంటే అతని అభిప్రాయము సుఖముగా కాలక్షేపము చేయుట అని. పార్లమెంటు వ్యతిరేకముగా ఏపనీ చెయ్యకుండా అతడు వివేకముతో వర్తించెను. ఫ్రెంచి రాజునుంచి అతడు రహస్యముగా జీతము పుచ్చుకొనుచుండెను. క్రామ్‌వెల్ కాలములో యూరోపునందు ఇంగ్లాండు సంపాదించుకొన్న గౌరవస్థానమునది, ఈతనికాలమున పోగొట్టుకొనెను. డచ్చివారు వచ్చి తేమ్సునదిలోవున్న ఇంగ్లీషు నౌకాదళమును తగులబెట్టి వెళ్లిపోయిరి.

చార్లసు సోదరుడు, జేమ్సు II అతని తరువాత రాజయ్యెను.

వెంటనే పార్లమెంటుతో పేచీవచ్చెను. జేమ్సు భక్తుడగు కాతలిక్కు. తిరిగి ఇంగ్లాండులో అతడు పోపు అధికారమును నిలువబెట్టగోరెను. మతవిషయములో ఇంగ్లీషువారి అభిప్రాయము లెట్టివైనను—అవి స్పష్టముగా లేవు—పలువురు పోపు అన్నను, కాతలిక్కు మతమన్నను మండిపడుచుండిరి. ఇట్టి సందర్భములో జేమ్సు II ఏమియు చేయలేక పోయెను. పార్లమెంటుకు కోపము తెప్పించినందువల్ల అతడు తల దాచుకొనుటకు ఫ్రాంసు పారిపోవలసి వచ్చెను.

మరల పార్లమెంటు రాజుపై విజయము సాధించెను. ఈసారు అంతఃకలహము లేకుండా ఈపని శాంతముగా జరిగినది. దేశమునకు రాజులేడు. కాని ఇంగ్లాండు, మరల ప్రజాప్రభుత్వము కాదలచుకో లేదు. ఇంగ్లీషువారికి లార్డు అన్న ఇష్టము. రాజోచిత వైభవాడం బరములన్న ఇష్టము. కాన పార్లమెంటు కొత్తరాజుకొరకై వెదక మొదలుపెట్టెను. ఆరెంజి కుటుంబములో వారికొకడు చిక్కెను. 100 ఏండ్లకు పూర్వము స్పెయినుకు వ్యతిరేకముగా నెదర్లాండుల పోరాటమునునడిపిన మౌనియగు విలియం ఈకుటుంబమువాడే. ఇప్పుడు వేరొక విలియం ఆకుటుంబమున నుండెను. అతడు ప్రిన్సు ఆఫ్ ఆరంజి. ఇంగ్లీషు రాజవంశమునకు చెందిన మేరికన్య నాతడు వివాహ మాడెను. కాన 1688 లో విలియం-మేరీలు ఇద్దరును జంట పాలకులుగా చేయబడిరి. పార్లమెంటు ఇప్పుడు సర్వాధికారముల వహించియుండెను. పార్లమెంటులోని ప్రజాప్రతినిధులకు అధికారమిచ్చిన ఇంగ్లీషు విప్లవము పూర్తి అయ్యెను. ఆనాడు మొదలు ఏ బ్రిటీషు రాజుగాని, రాణిగాని పార్లమెంటు అధికారమును ధిక్కరించ సాహసించలేదు—కాని పార్ల మెంటుకు ఎదురు చెప్పకుండా, ధిక్కరించకుండా అనేకవిధములుగా పార్లమెంటు నెదిరించవచ్చును. కుట్రలుపన్నుట, సభ్యులను తమవైపుకు తిప్పుకొనుట మొదలైనవి. బ్రిటిషు రాజులనేకు లీపద్ధతు లవలంబించిరి.

పార్లమెంటు సర్వాధికారి యయ్యెను. కాని ఈ పార్లమెంటు

స్వరూపమెట్టిది? ఇంగ్లాండు ప్రజల ప్రతినిధులందున్నారని అనుకోవద్దు. ప్రజలలో బహుకొద్దిమంది ప్రతినిధులే అందుండిరి. లార్డ్సు సభలో నున్నవారు లార్డులు. అనగా గొప్ప భూస్వాములున్నూ, బిషప్పులున్నూ. కామన్సుసభసైతము భాగ్యవంతుల సంఘమే. అందు భూకామందులును, పెద్దవర్తకులును ఉండిరి. బహుకొద్దిమందికే ఓటిచ్చు అధికారముకలదు. నూరు సంవత్సరముల క్రితము వరకు ఇంగ్లాండులో "పాకెట్ బరోలు" లెక్కలేనన్ని ఉండెను. అనగా ఎవరి జేబులోనో ఒకరి జేబులోఉన్న ఎన్నికవర్గములు (Constituencies). ఎన్నికవర్గమంతటిలోను ఒక సభ్యుని ఎన్నుకొనే ఒకరిద్దరు వోటర్లు మాత్రమే ఉండవచ్చును: 1793 లో కామన్సుసభకు 306 సభ్యులను 16 మంది మాత్రమే ఎన్నుకొన్నట్లు చెప్పబడ్డది. ఓల్డు సారమ్ అనే చిన్నగ్రామముండెను. అది పార్లమెంటుకు ఇద్దరు సభ్యులను పంపించెను. ప్రజాబాహుళ్యమునకు వోట్లు లేవనిన్నీ, వారికి పార్లమెంటులో ప్రతినిధులు లేరనిన్నీ నీవు గ్రహించవచ్చును. కామన్సుసభ ప్రజాసభ అనడానికి వీలులేకుండెను. పట్టణములలో తలయెత్తుచున్న మధ్యతరగతుల ప్రతినిధులైనను అందులేరు. భాగ్యవంతులగు వర్తకుల యొక్కయు, భూస్వాముల యొక్కయు ప్రతినిధులు మాత్రమే కొందరుండిరి. పార్లమెంటు సభ్యత్వమును కొనుట, అమ్ముటకూడ జరుగుచుండెను. లంచగొండితన మమితముగా నుండెను. 1832 వరకు, అనగా 100 సంవత్సరముల క్రితమువరకు పరిస్థితు లిట్లుండెను. అప్పుడు ఎంతో ఆందోళన జరిగినపిమ్మట రిఫారం బిల్లు ఆమోదించబడెను. ఎక్కువమందికి వోటిచ్చు అధికారము వచ్చినది.

కాని రాజుపై పార్లమెంటు విజయమన్నప్పుడు అది కొద్దిమంది భాగ్యవంతుల విజయము మాత్రమే. నిజమునకు ఇంగ్లాండు ఈ కొద్దిమంది భూస్వాములచేతను, కొద్దిమంది వర్తకులచేతను, మాత్రమే పాలింపబడుచుండెను. జాతి అంతటిలోనూ బహు సంఖ్యాకులుగానున్న

ఇతర తరగతులకు ఎట్టి హక్కులును లేవు.

ఈ విధముగానే స్పెయినుతో ఎంతో పోరాడినపిమ్మట స్థాపించ బడ్డ డచ్చి ప్రజాప్రభుత్వముకూడా భాగ్యవంతుల ప్రజాప్రభుత్వమే.

విలియం-మేరీల అనంతరము, మేరీ సోదరి "ఆనీ" ఇంగ్లాండు రాణి అయ్యెను. ఆమె 1714 లో చనిపోయెను. పిమ్మట ఇంగ్లాండుకు ఎవరు రాజు అను విషయమున చిక్కు వచ్చెను. చివరకు పార్లమెంటు, రాజుకొరకు జర్మనీ వెళ్లవలసి వచ్చెను. హానోవర్ కుటుంబమునకు ఎలెక్టరైన ఒక జర్మనును ఎన్నుకొనిరి. అతడు ఇంగ్లాండుకు రాజయ్యెను. అతనిపేరు జార్జి I. బహుశా పార్లమెంటు అతనిని ఎన్నుకొనుటకు కారణము అతడు మందమతిఅని. పార్లమెంటుకు అద్భుతగుణు తెలివైన రాజుకంటె తెలివితక్కువ రాజుండుట క్షేమకరముగదా. జార్జి I ఇంగ్లీషైనను మాట్లాడలేడు. ఇంగ్లీషు రాజుకు ఇంగ్లీషురాదు. అతని కొడుకు జార్జి II అయ్యెను. అతనికికూడ ఇంగ్లీషురాదు. ఈ విధముగా ఇంగ్లాండులో హానోవర్ కుటుంబము పాదుకొన్నది. అదే హానోవర్ రాజవంశము. నేటికిని ఉన్నదదే. అది పరిపాలించుచున్న దని చెప్పుటకు వీలులేదు. పరిపాలన కార్యములన్నియు పార్లమెంటు చేతులలోనే ఉండెను.

పదహారు, పదిహేడు శతాబ్దులలో ఐర్లాండుకును, ఇంగ్లాడుకును మనస్పర్థలు, వివాదములు తటస్థించెను. ఐర్లాండును జయించవలెనను ప్రయత్నములు జరిగినవి. ఎలిజబెత్తు, జేమ్సు I పరిపాలించుకాలమున తిరుగుబాట్లు, హత్యలు జరుగుచునే ఉండెను. ఐర్లాండుకు ఉత్తరమున ఉన్న అల్స్టరులోని భూము లనేకము జేమ్సు ఆక్రమించుకొని, స్కాట్లాండునుండి ప్రాటస్టెంటులను తీసుకువచ్చి అచ్చట నివాసము లేర్పరచుకొనునట్లు చేసెను. అప్పటినుండియు వలసవచ్చిన ఈ ప్రాట స్టెంటులు అక్కడే నిలిచిపోయిరి. ఐర్లాండు రెండు భాగములుగా చీలిపోయెను. స్కాట్లాండునుండి వలసవచ్చినవారూ, అచ్చటి ఐరిష్

వారూ. రోమన్ కాతలిక్కులూ, ప్రాటస్టెంటులూ, ఈ రెండు భాగముల వారూ ఒకరినొకరు ద్వేషించుకొనుచుండిరి. ఈ విభాగమువల్ల లాభము పొందినవారు ఇంగ్లీషువారు. మామూలు ప్రకారము పాలకులు "విడగొట్టి పాలించుము" అనే సిద్ధాంతముపై నమ్మకము కలవారు. నేడుకూడ ఐర్లాండులో పెద్దసమస్య అల్స్టరు సమస్యే.

ఇంగ్లీషు అంతఃకలహము జరుగుచున్న కాలమున ఐర్లాండులో ఇంగ్లీషువారు హత్యచేయబడిరి. ఐరిష్‌వారిని హత్య చేయించి క్రామ్‌వెల్ క్రూరముగా పగతీర్చుకొనెను. ఈ రోజువరకు ఐరిష్‌వారు దీనిని జ్ఞాపకముంచుకొనిరి. మరల పోరాటములు, మరల సంధులు, ఈ సంధులను ఇంగ్లీషువారు పాటించక భగ్నముచేయుట—ఈ విధముగా ఐర్లాందు చరిత్ర దీర్ఘచరిత్ర. ఆవేదనతోకూడిన చరిత్ర.

"గల్లివర్సు ప్రయాణములు" అనే గ్రంథమును వ్రాసిన జొనాతన్ స్విఫ్టు ఈ కాలపువాడే. అతడు 1667 నుండి 1745 వరకు నివసించి యుండెను. అది పిల్లలు తరుచు చదివే ప్రసిద్ధగ్రంథము. నిజమునకది ఆ కాలపు ఇంగ్లాండును హేళనచేయుటకై వ్రాసినగ్రంథము. "రాబిన్‌సన్ క్రూసో" అనే గ్రంథమును వ్రాసిన డానియల్ డిఫో, స్విఫ్టు సమకాలికుడే.

PRINTED AT SWATHANTHRA PRESS, 33, PERAMBUR HIGH ROAD, MADRAS-11.

అపూర్వ గ్రంథములు

ప్రథమ ప్రచురణ

# రతి రహస్యము

సంస్కృత మాతృక:

హరిహరుడు

ఆంధ్రీకరణము:

ముప్పిపల్లి సోమభూపాలుడు

పరిచయము:

నిడదవోలు వెంకట్రావు

పుటలు — 144

కాలికో బైండు

వెల: అమూల్యము

సభ్యులకు ఉచితము

వివరములకు:

కల్చరల్ బుక్స్ లిమిటెడ్

మద్రాసు — 11.

పిల్లల పుస్తకాలు

ప్రచురణ — 1

# లక్క పిడతలు

రచన:

చింతా దీక్షితులు

28 చిత్రాలు, మూడు రంగులలో నార్వీజియన్ బోరీగార్డ్
డ్రాయింగ్ కాగితంపై ముద్రణ, 64 పుటలు,
అందమైన పుస్తకం వెల రూ. 1-0-0.

"బాల", "చందమామ", "పాపాయి" ఏజంట్లకు ప్రత్యేక షరతుః

హిగిన్‌బాథమ్స్ వారి పుస్తకశాఖ లన్నిటిలోను దొరుకును.

వివరములకు :

కల్చరల్ బుక్స్ లిమిటెడ్

మద్రాసు — 11.